# భారతీవ్యాసములు

విద్వాన్

బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ;

సారస్వతవ్యాసముల

సంపుటము

* * *

1956

ప్రకాశకులు :

సర్వస్వామ్య సంకలితము

బి. వి. & సన్సు,
రామారావు పేట, కాకినాడ

మూల్యము
మూడు రూపా

# విషయసూచిక

విషయము. పుట సంఖ్య

# అంకితము

## గురు దేవులకు

జయ ఆషాఢ బహుళ నవమినాడు

తన యెనుబదవ యేట స్వర్గస్థురాలైన

అన్నపూర్ణా మాతృదేవత ఆత్మోపశాంతికి.

మన్మథ ఆషాఢ బహుళ నవమి సాంవత్సరిక దినము.

# ౧. ఆంధ్రసారస్వత దృక్పథము

సారస్వతము జాతీయౌన్నత్యమునకుఁ బ్రధాన ప్రమాణము. ఏజాతిదైనను నాజాతి మేధాసంపద, జనజీవనములు పాండిత్య, విజ్ఞాన, సభ్యతాదులు ఆజాతి సారస్వత దర్పణమునందే ప్రతిబింబించుచుండును.

## ఆంధ్ర సారస్వతాదర్శము

భారతీయసాహిత్యము పరమపవిత్రము. హైందవుల జీవిత పరమావధి పరమార్థదర్శనము. వారి సాహిత్యమును దన్నిమిత్తమే. భారతీయసారస్వతమున మృదుమధురపద జాలమునకు, పదసౌందర్యమునకు, భావపటిమకు నాంధ్ర సారస్వత మగ్రగణ్యము. ఈ సారస్వతాదర్శము జీవిత సార్థక్యసంసిద్ధి. అనఁగా సారస్వతమును భగవచ్చింతన, ధ్యాన, మననములకే వినియోగించి, భగవత్సాక్షాత్కారము సంపాదించుట దీనిని పరమార్థదర్శకముగా భావించుటయే. మన పూర్వాంధ్ర సారస్వతము నిర్వహించిన మహోత్కృష్ట ధర్మములలో ఈధర్మము ప్రధానమైనది.

## మానవజీవిత పరమార్థము తత్త్వజ్ఞానమే

ఈభూమండలమును నిరాతంకముగా, నిత్యముగాఁ బరిపాలించునది వాస్తవముగా తత్త్వజ్ఞానమే. లౌకికము

సరియగుపద్ధతిని జరుగుచుండుటను తత్త్వజ్ఞానమే మార్గములను రయుచుండును. లోకాతీతమైన యుపజ్ఞ మానవకోటికనలఁ దెలిసియో తెలియకో సాధికారికముగా సత్యదర్శింపఁబడుచున్న విధము నే దర్శనజ్ఞానము తెలుపును. శంఖారావమునకు, ఖడ్గధారలు మొనచోవఁ జేయఁజాలుటకు నీ దర్శనజ్ఞానమే మూలము. నిజముగా తత్త్వజ్ఞానము స్వేచ్ఛతో నేని వ్యక్తిత్వముగా నిరంకుశ లోకపాలన మొనర్చు విజేతలను జేసె. ఈ జ్ఞానార్జనమే మానవ జీవిత పరమార్థము.

## ఆంధ్రసారస్వత ప్రత్యేకత

ఈ జ్ఞానార్జనకు సాధనము లనేకము లున్నవి. అందు సారస్వత మొకటి. సారస్వతమూలమున నీ జ్ఞానప్రకాశము నందనమకట్టి విజయవంతమైన దాంధ్రసారస్వతము: ఇదియే మన సారస్వతమునకుఁగల ప్రత్యేకత. "చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరం, ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్" అను దృఢవిశ్వాస మాంధ్రులపాలమ్ము. ఈ పరమవిశ్వాసము మూలముననే పరమార్థము నాంధ్రులు సంపాదింపఁ జాలుచున్నారు. ఆంధ్రమహాకవులు భగవదవతార చరితములే కావ్యమయములుగాఁ జేయుట సారస్వతమును పరమార్థ సంపాదన సాధనముగా వినియోగించుటకే. ఈ యభిమతము పరిపూర్ణముగ సిద్ధించిన దని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

తత్త్వజ్ఞాన సంపన్నులైన పూర్వాంధ్రకవుల మానస క్షేత్రముల యుద్భూతసారమే ఆంధ్రసారస్వతము. మన సారస్వతము జాతీయాదర్శములను, జీవితలక్ష్యమును అనుశ్రుతముగా స్పష్టము చేయుచునేయున్నది. ప్రస్తుత మిట నాంధ్రసారస్వతనిర్మాతల కావ్యనిర్మాణములకుఁ గల ప్రధానోద్దేశములు తెలిసికొనుచు, నవి ముఖ్యముగా "భగవత్సంబంధములైనవై, పరమేశ్వరభక్తి ప్రబోధకములై తుదకు సర్వశక్తిమయుని జేర్పఁజాలినవే యై యుండవలె" నన్న విషయమును దిఙ్మాత్ర[?]దర్శనముగాఁ దెలుపఁదలఁచే యీ వ్యాసోద్దేశము. అందుచే, నగాధ మగు నాంధ్రసారస్వత సముద్రమునుండి యతి సంక్షేపముగాఁ గొన్ని జలకణములే యిట గృహీతములు.

## నన్నయ కావ్యరచనోద్దేశము

నిరాధారము లగు పునాదులు గల ప్రాఙ్నన్నయార్య యుగమునకుఁ బ్రణామము లర్పించి, నన్నయనుండియే ప్రారంభింతము. నన్నయ కావ్యరచనోద్దేశము 'విశ్వశ్రేయః కావ్య' మ్మను నాదర్శమున జీవితపరమార్థ ప్రదర్శనము. సంకుచితదృష్టి లేనివాఁడై, నన్నయ 'జగద్ధితముగ' మహాభారతసంహితారచనబంధురుఁ డైనాఁడు. నాఁటినుండి యీ విశాలభావ మాంధ్రుల యుగ్గుఁబాలలోఁ గలిసిపోయినది. భారతభారతీసముద్రమున నాంధ్రమహాభారతము శ్రోతలకే

“అమల సువర్ణశృంగఖురన్యస్త కపిలంబులగు గోశతంబుల నొసఁగిన బహువేదవిప్రులకు దానముచేసినఁ దత్ఫలంబున కెక్కుడు సమకూరదు” నన్నఁ దద్రచయితను నేఁడు చెప్పవలెనా? కవి ఋషి, తత్త్వవేత్త, ఆదర్శజీవియై, తన కావ్యరచనాభియోగ్యతను వేనోళ్ళఁ జాటినాఁడు.

తాను రచింపఁబోవు కావ్య మెట్టిది, దాని ఫల స్వరూప మే తెఱఁగున నుండు నన్న విషయముఁ దెల్పుట నన్నయవిధి. “ధర్మార్థ కామమోక్షేషు వైచక్షణ్యం కలాసుచ, ప్రీతిం కరోతి కీర్తించ సాధుకావ్య నిబంధనమ్” అను విషయము నేకాక, తన కావ్యరూపమును, తత్ఫల స్వభావమును ఇట్లు వివరించినాఁడు. కావ్యస్వరూప మిది :

> “అమితాఖ్యానకశాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై
> సుమహావర్గచతుష్కపుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
> త్తమ నానాగుణకీర్తనార్థఫలమై ద్వైపాయనోద్యానజా
> త మహాసౌరభ పారిజాతము”

ఈసుమసౌరభము నాఘ్రాణింపఁజాలిన పుణ్యాత్ముల కగు ఫలము విపులధర్మారంభసిద్ధి; చతుర్వేదములు, అష్టాదశ పురాణములు, ధర్మమోక్షతత్త్వములు నెఱిఁగిన ఫలము; దానజపాగ్నిహోత్ర బ్రహ్మచర్యముల ఫలము; అశేషపాప క్షయము సంభవించుటే కాక “నిరంతర సంతతపుణ్యసంప దున్నత్యభివృద్ధి సేయు.” ఇది నన్నయ గ్రంథపరమార్థము. ఈపరమార్థలక్ష్యమే “యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో

జనుః, సముద్రోప్యముఖం పరుడుతే లోక స్తదనువర్తతే'' యను గీతాచార్యోక్త్యనుసారము పారంపర్యముగా నాంధ్రకవుల ననువర్తన సాధనమాయెను.

### మల్లికార్జున పండితారాధ్యుల లక్ష్యము

ఈ లక్ష్యమే మహోత్కృష్ట గ్రంథకర్త, శైవమత సంస్కర్త యగు మల్లికార్జున పండితారాధ్యులు పాటించి, పరమార్థసాధనకుఁ బనికిరాని, శివభక్తి ప్రబోధకములు కాని గ్రంథములఁ బరశురామప్రీతి చేయుట, అట్టి గ్రంథకర్తలఁ జంపుట పుణ్యమేయని శివతత్త్వసారాదిగ్రంథములఁ జేర్కొని నాఁడు. ఈతఁడు ''దుస్తర భవనిష్ఠుర దుఃఖసముద్ర సముత్తరణ వహిత్రంబు' భక్తియనియు, ''నకర్మణా నతపసా నజపైర్న సమాధిభి రవ్యయనీయసదృశభక్తికిఁ'' బ్రియుఁడు భగవంతుఁ డనియుఁ, దదారాధనమే జీవిత పరమార్థ మనియు స్వాత్మానుభవరూపముగాఁ జాటినాఁడు. ఈతని తరువాతివాఁడైన పాల్కురికి సోమనాథుఁడు దీనినే యాదర్శముగాఁ జేసికొన్న ట్లాతని బహుకృతులు చాటుచున్నవి.

### కవిబ్రహ్మ తిక్కన

కవిబ్రహ్మ తిక్కన సిద్ధపురుషుఁడు. సాంగవేదవేది. 'లోకహితనిష్ఠఁ' బూనియే ధర్మాద్వైతస్థితిఁ గృతులు రచించి నాఁడు. భారతరచన ''భవ్యపురుషార్థతరుపక్వఫలము'' కాన, ''జన్మాంతరదుఃఖముల్ దొలఁగునట్లుగఁ జేసి, సుఖాత్ముఁ జేయు''మని హరిహరునిఁ గోరి, 'జననమరణాదులైన సంసార

దురితములకు నగపడకుండఁగఁ దొలఁగు నేరుపుఁ దా నరయుటే కాక, యావదాంధ్రలోకమునకుఁ దన కృతిముఖాల మునఁ దెలియఁజేసినాఁడు. తన్మూలమునఁ దన పుట్టువు కృతార్థమై తాను పుణ్యుఁ డగుటే కాక, ఆంధ్రావళి మోద మునకు, మోక్షమునకుఁ గారకుఁ డైనాఁడు. భారతీ కావ్యరచనఁ దుదముట్ట సాగించి, యందు కవితా సౌష్ఠవమును బ్రశంసాపాత్రముగాఁ జూపఁజాలి, కవిబ్రహ్మయై, జీవిత పరమార్థమును శాంతిపర్వాదులఁ బ్రత్యేకముగను, నితర ముల నక్కడక్కడను సర్వజన సుబోధకముగాఁ జేసి యాధ్యాత్మిక గురుబ్రహ్మయైతి మద్వితీయుఁడుగాఁ గాఁజాలి నాఁడు. అందుచే, నన్నయ ప్రారంభించిన జీవితపరమార్థ దృక్పథమే తిక్కనపట్ల మహోన్నతిఁ జెందినదని చెప్పక తప్పదు. తిక్కన సర్వతోముఖప్రజ్ఞ గలవాఁడయ్యు, సారస్వతలక్ష్యములలో నొకటగు పరమార్థమునకుఁ బ్రత్యేకత నిచ్చియున్నాఁడు.

### భక్తాగ్రగణ్యుఁడు పోతన

మాక్సుముల్లరుపండితుఁ డన్నట్లు తత్త్వవేత్తలగు కవు లన్నిజాతుల, నెల్లవేళల, నెల్లడల నుద్భవించువారు కారు. దైవత్వమందిన జాతులందే వారు జన్మింతురు. కాని, యాంధ్రసారస్వత నిర్మాతలలో సారస్వతారంభము నుండి నేఁటివఱకుఁ దాత్త్వికదృష్టిచేఁ దన కావ్యమును పరమార్థ సాధనభూతమైనదిగాఁ జేయని యాంధ్రకవి లేఁడను టతి

శయోక్తి కాదు. ఇంతకు, నది కొందఱిలో పరిపూర్ణత నందినది. అట్టివారు తమ కావ్యములందెల్లెడల బ్రహ్మవిద్యాబోధనమే నిర్వహించినారు. అందుఁ బోతనకవీంద్రుఁ డద్వితీయుఁడు.

పోతనభక్తాగ్రగణ్యునకు 'శ్రీకైవల్యపదంబు' జీవిత లక్ష్యము. అంతరంగముగ కావ్యాత్మ భగవత్సంబంధమైనదగుటే కాక, బహిరంగముగ నా కావ్యము మానవాధముల కీయక పరమేశ్వరాంకితముఁ జేసితీరవలె నను దృఢవ్రతమునకై 'జగద్ధితముగఁ' జేసిన భాగవత గ్రంథమును శ్రీహరికి సమర్పణోత్సవ సల్పించి పోతన ధన్యుఁడైనాఁడు.

పోతన కావ్యప్రయోజనము చేతులారఁగ శివునిఁ బూజింపనివాఁడు, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువనివాఁడు, దయయు సత్యము లోనుగాఁ దలఁపనివాఁడు తల్లులకడుపుచేటని వ్యాఖ్యానించెను. మఱియుఁ, దనకే కాక శ్రోతలగు నాంధ్రులకును పునర్జన్మము లేకుండఁగా జీవితము సఫలముఁ జేసెదనని వాగ్దానము చేసి, మహిత త్యాగబుద్ధి పరఁగ, నాధ్యాత్మికాది తాపత్రయంబు లడఁచి, పరమార్థభూతమ్మై, అధిక సుఖదమ్మై, మోక్షదాయియగు భాగవత గ్రంథ రచనమున సంకల్పసిద్ధిఁ గాంచినాఁడు.

“నగరోవిందక ధాసు ధారసమహా వర్ణోక్తి ధారాపరం
పరలం గాక......ఇతరో పాయానుగ క్తిస బ్రవి
స్తరనుగ్గాంతరసు గంతగు స్పహాజను స్వంభావితా నేకగు
స్తరగంభీరకఠోరకల్మషకన ద్దావానలం బాఱునే ?”

అను నదీతని పరమార్థసందేశము.

ఈతని కావ్యవిభాగ మింతయు పరమార్థలక్ష్యము ననుసరించి ద్వివిధము :

"హరినామస్తుతిచేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజితమైన మానససర స్ఫూర్తిన్ వెలుంగొందు, శ్రీ
హరినామస్తుతి లేనికావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్గలితవత్కాకోలగర్తస్థితిన్!"

భక్తితత్త్వప్రతిపాదనమున, జీవితపరమార్థ ప్రదర్శనమున నాంధ్రసారస్వతమున నే కాక, యావద్భారతసారస్వతమున నింతటి గ్రంథము లేనే లేదు.

చిత్తుసత్తుల సమస్యలం గూర్చియు, శరీరము, బుద్ధి, మనస్సు, పదార్థము, ఆత్మలకు సంబంధించిన సమస్యలం గూర్చియు, కీడునకు మూలమును గూర్చియు, జీవితపరమార్థోద్దేశ్య మేది యనుటం గూర్చియు, సృష్టికర్త, జీవుల పరస్పర సంబంధమును గుఱించియు, భక్తితత్త్వము, మోక్షసాధనములు, ఆధ్యాత్మికసాధనలు, యమనియమాదులు సర్వమునుగుఱించియు శ్రీకృష్ణ భాగవతమున, పోతన భాగవతమున నాంధ్రులకు సుబోధ మగునట్లు చక్కఁగా, సమగ్రముగాఁ దర్శించి వివరించియున్నారు. మహోన్నతమైన పరమార్థ సారస్వతనిర్మాతలం దగ్రగణ్యులనఁదగు శ్రీకృష్ణ పోతన లమృతమయమూర్తులు. వారి కావ్యాదర్శము లాచంద్ర తారకములు, మోక్షప్రదాయకములు.

సాధనములై, పరమాత్మ సాక్షాత్కారమునను మార్గములే యగుచున్నవి. విశిష్టాద్వైత సంప్రదాయానుసారము భగవంతుఁడు భక్తికళత్రుఁ డను విషయ మీగ్రంథసారస్వతమునఁ గ్రొత్తకాదు. కాన, మన సారస్వతమునఁగల శృంగారరస ప్రధాన కావ్యములును పరమార్థతత్త్వ నివిష్టకృతములే. ఈ కావ్యములు శర్కరామిళితములగు సౌషధగుళికలు. వానిలో సైత మల్పవిద్యావంతులకుఁ బ్రబోధరూపమున విస్పష్టవాక్యముల జ్ఞానోద్బోధనము లున్నవి. మృత్యువుచే భయపెట్టి, పెద్దన చెప్పెడి పరమార్థబోధఁ గనుఁడు :

> "నీడఁ గడవఁ బాఱు నేలకు వెలిగాఁగ
> నడుగు వెట్టి తిరుగ నాత్మ వెఱఁగి
> యొకటిఁ దలఁప నరుల కొదవిన నొదవ దే
> కరణి మృత్యుదేవి కన్నుఁ బ్రామ ?"
> "మఱి, మృత్యువు డాఁగడిచోట లేదో ?"

కావున

> "చావుఁ దలపోసి మానవుఁ
> డేవగ దుష్కీర్తి వోరయకే దినములు వోం
> డై వెడలునట్లు నడువఁగ
> దైవం బటమీఁద మేలు తాన ఘటించున్."

మఱియు, ఈరీతిగా మానవునిఁ బ్రవర్తింపుమనుటకై, యథేచ్ఛావిహారి నెంత భయపెట్టి పరమార్థమువంకకుఁ ద్రోలుచున్నాఁడో :

"ఎవ్వఁడు మీఁ దెఱుంగక యథేచ్ఛ సుఖైకరతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టఁగా
నవ్వాడఁ గమ్మనుష్యపశు వయ్యవివేకి చెడున్ జగంబునన్
నవ్వఁగఁ బాలు రౌరవమునం బడఁబాలును నిందపాలునై."

నవరస పరిపూర్ణము లగు కావ్యములనడుమ నీరీతి పరమార్థ సన్మార్గమును జూపుచు, నాంధ్రాభిరుచులఁ బట్టి శృంగారాదిరసముల వర్ణనలఁ జేయుచున్నను, వానివాని నడుమ సారస్వతలక్ష్యమగు జీవితప్రయోజనమునే యాంధ్ర ప్రబంధము లన్నియుఁ జూపుచున్నవని చెప్పవచ్చును.

### ధూర్జటి శివభక్తి ప్రబోధము

పోతనచేత విష్ణుభక్తిప్రతిపాదన మెంత సిద్ధిబొందెనో, శివభక్తిప్రబోధము ధూర్జటికవి కంత విజయము నొసఁ గూర్చినది. ధూర్జటి—

"నీకున్ గాని కవిత్వ మెవ్వరికి నే నీనంచు మీఁద త్తితిన్
జేకొంటిన్ బిరుదంబుఁ గంకణము ముంజేకట్టితిన్ బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు"

నని ఘోషించి, "ఈశ్వరుఁడు కాదా మత్ప్రబంధాధి పత్యాగణ్యార్హుఁడు వేఱొకండు గలఁడే" యని యీశ్వరున కాత్మార్పణఁ జేసి తన శుభకావ్యరత్నమున కీశు నధీశునిఁ జేసినాఁడు. ఈకావ్యరత్నమున నీశ్వరాత్మార్పణమే జీవిత పరమావధియని సువ్యక్తము చేసినాఁడు.

అనుచు నాపేఁ జీయమనలసిన ప్రత్రిక్రియ :

"సాత్త్విక శాస్త్ర శ్రవణత
సాత్త్విక సత్సంగమంబు సడలక భగవ
త్తత్త్వకథాశ్రవణంబున
సత్త్వగత విముక్తినొందు సంసారమునన్"

ఇట్లీ జీవి తరించుటకు మార్గములను సాధనానుకూల
ముగా విస్తరించి వివరించినాఁడు.

అపూర్వ కవిచక్రవర్తి పింగళి సూరనార్యుఁడు

అపూర్వకవిచక్రవర్తి పింగళి సూరనార్యుఁడు విష్ణు
పదమును జేరు మార్గ మెంత విస్పష్టముగా వినిపించి
యున్నాఁడో చూడుఁడు ;

"తనశక్తికొలఁది సత్కర్మముల్ ఫలకాంక్ష
మాని కృష్ణార్పణ మతి సలుపుట
ప్రతిషిద్ధకర్మంబుఁ బరిహరించుట విష్ణు
భక్తిపైఁ గ్రమమునఁ బాదుకొనుట
తద్భక్తిగల పుణ్యతముల సంసర్గంబు
దుర్జను లున్నట్టిత్రోవఁ జనమి
విష్ణుసన్నిధికళావిఖ్యాత వివిధ ది
వ్య క్షేత్ర తీర్థయాత్రాచరణము
బ్రహ్మచర్యంబుఁ దపము వైరాగ్యగుణము
వలయు వైకుంఠమును గోరువారి కెల్ల
వీనిలోపలఁ గొన్ని గావింపఁ గనిన
వృష చనవు చేర్చుఁ గ్రమమున విష్ణుపదము."

ఈ విధముగనే, రాయలనాఁటికవు లందఱుఁ బెట్టి పర
మార్థప్రబోధములఁ గావించియే యున్నారు. వాని నెల్ల నీ
సంక్షేపవ్యాసమునఁ జేర్కొనుట సాధ్యముకాదు.

## ఆంధ్రకవుల దృఢవిశ్వాసము

సారస్వతపరమావధి యాంధ్రకవులలో విశ్వసనీ-మము నంది, కృత్యంతర్గతమైన విషయములు పరమేశ్వర సంబంధములై యుండవలె ననుటే కాక, సత్కృతికృతిపతిత్వము మానవమాత్రుల కంకితము మీయరాదను, భగవదంకితము చేసితీరవలెనను దృఢభావము స్థిరముగా మొదలనే యాంధ్రకవుల కలవడినది. దానికిక్రిందినిశ్చయములే సాక్షిభూతములు.

> “ప్రాజ్ఞులు ప్రబంధకల్పనాపాటవంబుఁ
> గలుగుటకు సత్ఫలంబుగాఁ దలఁచి కృతులు
> చేయుచుందురు జగదేకనాయకునకు
> నచ్యుతున కంకితముగఁ గృతార్థు లగుచు.
> ధాతలకు ధాత భువన
> త్రాతలకుఁ ద్రాత శౌరి రక్షకుఁడఁట యీ
> దాతలదాత న్విడిచి యి
> లాతల నేతల నుతించు లాఘవ మేలా?
> వాసుదేవుండు బ్రహ్మాండవల్లభుండు
> భక్తజనులకు సకలసౌభాగ్యదాత
> దాతమాత్రంబె మోక్షప్రదాత యతఁడె
> అతని నుతియించుకంటె భాగ్యంబు గలదె?”

అను స్థిరనిశ్చయ మాంధ్రకవిపుంగవులకుఁ గల్గినది. అంతియ కాక,

> “మానక కర్మభూమిపయి మానుషదేహముతో హితాహిత
> జ్ఞాన మెఱుంగు పండితుఁడు చారుకవిత్వము నేర్చి జానకీ
> జానికథల్ రచింపక యసత్కథ లెన్ని రచించె నేనియుం
> దాని వివేక మేమిటికి దాని కవిత్వమహత్త్వ మేటికిన్?”

అను నిశ్చయమును గాంచుచో, ఆంధ్రకవిశేఖరుల తాత్త్వికదృష్టి, జీవితపరమావధి సువ్యక్తము లగుచున్నవి.

## శతకవాఙ్మయము

ప్రార్థన, స్మరణ, మననాదులచే బరమార్థసాధన మారంభించిన సారస్వతశాఖ శతకవాఙ్మయము. పరమేశ్వర స్తోత్రాత్మకములైన భక్తి జ్ఞాన వైరాగ్య బోధకము లగు శతకములు భాషాయోష నలంకరించిన వసంతములుగా నున్నవి. కేవలభగవత్స్తుతికై దండకములును ప్రబలినవి. స్త్రీలవాఙ్మయమునైనను భగవదవతారచరిత్రములు, పరమేశ్వరారాధన పూర్వకములే కానవచ్చుచున్నవి. ఈ విధముగా నాంధ్ర సారస్వతశాఖ లెన్నిటిఁ గన్నను, జీవిత పరమార్థదృష్టి వెల్లివిరియుచునే యున్నది.

## ఆంధ్రసారస్వతము దివ్యజాతిసముద్భూతము

ఇంతకుఁ దేలిన దేమన, ఆంధ్రసారస్వతమున్నతసభ్యత చెందిన దివ్యజాతినుండి యుద్భవించె ననుట నిర్వివాదాంశము. మనజాతి పౌరస్త్యజాతులలో నెల్ల నుత్తమజ్ఞానవంత మనుటకు మొదలే సంశయము లేదు. అగుట, ఆంధ్రసారస్వతములో నేదేనొక యల్పభాగముతోనైనఁ బరిచయముఁ గల్గించు కొనుటకు నొక్కని జీవితకాలము చాలదు. ఆంధ్రసారస్వత జీవితపరమార్థదృక్పథవివరణ మెంత సాధ్యమనిన :

"తృష్ణాపరుండైన తెరువరి తియ్యని
మున్నీటిసలిలంబు లెన్నిగ్రోలు,
నిలుపేద యగువాఁడు నిర్జరగిరిఁ జేరి
జాతరూపం బెంత సంగ్రహించు
గణనాపరుండైన గణికుండు సమకొని
రిక్కల నెన్నింటి లెక్కపెట్టు
లంఘనోన్ముఖుఁడైన జంఘాలుఁ డొక్కరుం
డిమ్మహీవలయమ్ము నెంత గడచు
నట్టిదియ పో."

యనుట కేమాత్రమును సందియము లేదు.

# ౨. ఆంధ్రకథానక కావ్యములు:

## భోజరాజీయము

౧

ప్రాచీనాంధ్ర సారస్వతమ్ముఁ బురాణప్రబంధ కావ్య నాటకాదులతోపాటు చక్కని పద్య కథానకవాఙ్మయమును బ్రబలియున్నది. ఈకథానకములలోఁ గూడ నితరశాఖల వలెనే యనువాద కావ్యములు, స్వతంత్ర కావ్యములును గలవు. ఈస్వతంత్ర పద్య కథానక కావ్యములలో నా యా కవి పుంగవులు కథాకథనచాతుర్యము, నూతనకల్పనానైపుణ్యము ప్రతిభావ్యుత్పత్తులతో జోడించి యద్వితీయ కథా సాహిత్యమును మనకుఁ బ్రసాదించియున్నారు.

ఈ కథానక కావ్యములలో శాలివాహనగాథాసప్తశతి, సింహాసనద్వాత్రింశిక, విక్రమార్కచరిత్రము మున్నగు కథానకములు సంస్కృతకథానక కావ్యానువాదములు. భోజరాజీయము, హంసవింశతి, శుకసప్తతి, కళాపూర్ణోదయము మున్నగు కథానకము లాయాకవిచంద్రుల స్వకపోల కల్పితములు, నద్వితీయ శిల్పప్రతిభానకములు. కళాపూర్ణోదయము పద్యనవలారాజ మని విశ్వవిఖ్యాతి నార్జించినది. ఇఁక శుకసప్తతి హంసవింశతుల కేదియో మూలమున్నదని యెవరో యూహించిరి కాని, యది సత్యమునకు సన్నిహితము కానిమాట. ఈ రెండుకథానకములందలి కథాచమత్కృతి,

నిరుపమానశిల్పము, నందు ద్యోతకమగు లోకజ్ఞానము, కల్పనాపాటవము, హృదయాకర్షణశక్తి యత్యద్భుతములు.

ఇఁకఁ, బరమపవిత్ర కథానిధి యనఁ దగు భోజరాజీయము కేవలము స్వతంత్రకథానక కావ్యము. ఇందుఁ దద్రచయితయగు ననంతామాత్యుఁడు గడితేఱిన కథారచయితగా గోచరించుచుండును. ఈతని కథారచనమందలి యాదర్శములు, కథాశిల్పము నందలి మెలఁకువలు, కథానకములందలి జనరంజకత్వము పరిశీలించినచోఁ గవిత్రయమునకుఁ దరువాతివాఁడును, ప్రబంధకవులకుఁ బూర్వుఁడును నగు ననంతామాత్యుఁడు కొన్ని వందల సంవత్సరములకుఁ బూర్వమే యద్వితీయ కథాసాహిత్యమును మనకుఁ బ్రసాదించియుండుట గోచరము కాఁగలదు.

అనంతామాత్యుఁడు తాను బుధచకోరచిత్తప్రియుఁడ నని, సంతతవాణీ వరప్రసాదానులబ్ధ వాగ్విభవుఁడనని, చెప్పికొని తనయర్హతను జాటి సజ్జనరంజకత్వమే తన కృతికిఁ గావలయున దని పేర్కొనియున్నాఁడు. కవిత్వప్రాశస్త్యము, కృతుల యాదర్శములు, తా ననుసరించినవిధమును నిట్లు వాక్రుచ్చెను.

"సకలవిద్యలయందుఁ జర్చింపఁ గవిత యు
త్కృష్టమం డ్రదది నిత్యకీర్తికొఱకు
నర్థాప్తికొఱకు నా వ్యవహారలక్షణం
బెఱిఁగెడి కొఱకు ననేకవిధము

లగు నమంగళముల వారియించుకొఱకు సు
చిత నిత్యసౌఖ్య సంసిద్ధికొఱకు
ఒనరఁ గాంతా సమ్మితోపదేశంబునఁ
బ్రీతిమై హితమాచరించుకొఱకు
నయ్యెఁ గానఁ బెద్దలాచరించెద రంచు
నేర్పఁ గొలదిఁ గృతి యొనర్పఁబూని."

ఇట్లు కృతియొక్క పరమార్థమును వక్కాణించి తాను భోజరాజీయమును రచించుట కింకను గారణము లిట్లుగాఁ గవి పల్కుచున్నాఁడు :

"నూతనంబయ్యుఁ బురాతనకృతులట్ల
సంతత సేవ్యమై జరుగు ననియు
నాదిరాజసమానుఁ డగు భోజభూపతి
చరిత మీకవితాప్రసంగ మనియు
నిందుఁ జెప్పెడి కథ లిన్నియు నోలిఁ బ్ర
శస్త ధర్మోపదేశంబు లనియు
నఖిల జగన్నాథుఁడగు నహోబలనాథుఁ
డీపుణ్యకృతికి నధీశుఁ డనియుఁ
బృథివి నెల్ల జనులు ప్రియ భక్తి యుక్తిఁ బా
టింతురనియు నాఅడిల్లి ......"

అధిక నిష్ఠతో నీకృతి రచించినట్లు చెప్పినాఁడు. ఇందు ముఖ్యముగా గమనింపఁ దగిన కథానకాదర్శములు :

౧. నూతనత్వము ౨. పురాతన కృతి సామ్యము ౩. ప్రశస్త కవితాప్రసంగము ౪. ధర్మోపదేశకత్వము ౫. సజ్జనరంజకత్వము. ఈ యైదు సుగుణములు నద్వితీయముగా

బట్టినవి కనుకనే యనంతామాత్యుని భోజరాజీయము సారస్వతమున శాశ్వతత్వమునందఁ గన్నది. ఒక్క మాటలో నాతఁడు మరలఁ దన కథాప్రసంగము నిట్లు క్రోడీకరించి నాఁడు :

'సూత్రకథ భోజరాజ చరిత్రవయా నడుమ ధర్మరీతులు నీతుల్
చిత్రకథలై తలిర్పఁగ, శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడియుండున్'

ఇందు ధర్మరీతులు నీతులు చిత్రకథలై శ్రోత్రపేయముగా నుండుటే కథానక ప్రధానాశయ మని చక్కఁగాఁ బల్కి యనంతామాత్యుఁ డీపలుకుఁ దన కృతియందు సత్యము కావించినాఁడు. అందుచేఁ బూర్వోదాహృతములగు గుణములను స్థాలీపులాకన్యాయమున నాతని కృతిలోఁ గాంచిన నవి కథానకమున కెంత శోభావంతములో తెలియఁ గలదు.

కథాసంవిధానము : నవీనత

భోజరాజీయము 'నూతనం బయ్యుఁ బురాతన కృతులట్ల సంతతసేవ్య' మనియు,

"దత్తాత్రేయప్రోక్త ముదాత్త సుకృతభోగవిశ్రుత సునీతిపథా
యత్తంబై యితిహాసము క్రొత్తగదే భూమి ........."

ననియు, నీకృతి సంతతశ్రావ్యము, "వివిధ కథానూత్నరత్న భూషణాభిరామము" నని కవి తెల్పియుండుటచే నిందలి కథాభాగములు నూతనకల్పితములే కాని పురాతనము కానట్లు సుస్పష్టము. సంస్కృతమందలి భోజచరిత్రము

నకును, దీనికిని బోలికలు లేకపోవుట యిందులకు మఱియుఁ బ్రబలతార్కాణము.

### పురాతనకృతిసామ్యము

కాని, కొన్ని కథాభాగములు పూర్వపురాణకథానుకరణములై గ్రంథప్రాశస్త్యమునకుఁ గొంత కారణభూతమైనవి. భారతమునందలి "ఇరుప్రొద్దు గుడుచుచు నెడనెడ గుడువక యొప్పు నాతండు నిత్యోపవాసి" "ఋతుకాలముల నాత్మసతి గూడి క్రీడించి పరగు నాతఁడు సదాబ్రహ్మచారి" యను వాక్యములు గైకొని కవి యౌచితీసుందరముగ నిందరుంధతీవసిష్ఠు లగస్త్యుని నతిథిగాఁ బూజించిన కథాసందర్భము మహాద్భుతముగా వివరించినాఁడు. పావకలోముఁడు హంసయంత్రము నేసి యనుమతిని బరిణయమైన కథాభాగము మత్స్యయంత్రము నేసి ద్రౌపదిని బడసిన యర్జునుని చరిత్రమును స్మృతికిఁ దెచ్చుచున్నది. ఉత్తమగుణవిరాజితుఁడగు పావకలోముని కాళ్ళు నఱుకఁబడుటయు, నాతనికిఁ బార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమగుటయు సారంగధరచరిత్రముఁ బోలియున్నది. వంజరుఁడు తప మొనరించి గంగను భూమికిఁ దెచ్చినకథ భగీరథునికథకు రమ్యోదాత్తానుకరణమగుట తోఁచును. ఇట్లే, కొన్నికథాభాగములకు మాత్రము పురాతనకథాభాగములు సూత్రప్రాయములై యనంతామాత్యుని పరిణతహస్తమున నౌచితీసుందరతను, నాతని

మృదుమధురభాషణమునసుశ్రావ్యతను గడించి సానలుదీఱిన రత్నములైనవి.

## ప్రశస్తకవితాప్రసంగము

కొంచెమించుమించుగా నీసుగుణము తరువాతిదగు ధర్మోపదేశకత యను సుగుణమున నంతర్భూతమై యున్న దని చెప్పవచ్చును. పరమప్రామాణ్యము లగు శ్రుతిస్మృతి పురాణేతిహాసాదులందుఁ బ్రతిపాదితములగు సత్యము,ధర్మము, అహింస మున్నగు సుగుణములే యీకవితాప్రసంగమునకుఁ బరమార్థములు. ఉత్తమమైన ధర్మముల నుత్తమమైన నీతుల నుత్తమమైన మార్గమున బోధించుటచేతనే యీ కావ్యమున కింతవిశిష్టత సంభవించినదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

## ధర్మోపదేశకత్వము

మహాప్రజ్ఞాకల్పితము లగు నిందలి కథాభాగములు ప్రశస్తధర్మోపదేశకము లగుట విశేషముల కెల్ల విశేషము. ఇం దేకథాభాగము నరసినను బ్రశస్తధర్మోపదేశకము, సునీతి పథాయత్తము నై పాఠకమానసముల నానందముగ్ధములఁ జేయుచు ననంతామాత్యుని కావ్యపరమార్థదృక్పథమును వేనోళ్ళఁ జాటుచున్నది. రోగభూయిష్ఠుఁడగు మహుని చరిత్రమును, మాధుకరప్రభావమును గుఱించిన దుష్టసతి, సత్పతి – వీరలచరిత్రమును, యోగికి ద్వేషిపాయస మిడిన బ్రాహ్మణుఁడు, యోగికి మంటిముద్ద భిక్షముగా నిడిన

యామెకథ, చండాలదంపతుల చరిత్రము, సుశీలకథ మున్న గునవి "అవశ్య మనుభోక్తవ్యమ్ కృతం కర్మశుభాశుభ" మ్మను నార్యోక్తికిఁ దార్కాణములై యలరుచున్నవి. పుష్ప గంధిచరిత్రము, మదనరేఖమహత్త్వము, అనుమతిచరిత్రము, అన్నదాన పరుఁడగు విప్రునిభార్య కథ మున్నగునవి పరమ పాతివ్రత్యమాహాత్మ్యమును వేనోళ్ళఁజాటు శంఖారావములు. మఱియు, నతిథిపూజా ప్రభావము, సత్యవాక్యపరిపాలనా మహత్త్వము, అన్నదానమువలని యనంతఫలము నద్భుత ముగా నుద్ఘోషింపఁ బడినవి. ఇట్లు దానధర్మ సత్యదయా శౌచముల ప్రభావ మనంత మని వివరింపఁబడినట్లే లుబ్ధ త్వము, అధర్మము, అసత్యము, క్రౌర్యము, అశౌచము మున్నగు దుర్గుణము లెన్ని యిక్కట్టులు గొనివచ్చునవియుఁ దెలుపుటకుఁ గుంభిచరిత్రము, నన్నదానపరుఁ డగు విప్రుని వదినెలచరిత్రము మున్నగునవి సాక్షిభూతములగుచున్నవి. అన్నిటికన్న మిన్నగా మహారాక్షసుని హృదయము, మహాకామాంధుని మనస్సు, మహాక్రూరసింహహృదయము మార్చివేసి యున్నతపరివర్తనమును గొనితెచ్చిన సత్యవాక్య విజయ మీ గ్రంథమున నద్వితీయముగా, నత్యద్భుతముగాఁ గొనియాడఁ బడియున్నది. ఈ మహోత్కృష్ట సుగుణసంప దను జూఱగొన్న గోవ్యాఘ్ర సంవాదకథ, పుష్పగంధిచరి త్రము, పావకలోముని కథ యాంధ్రసారస్వతమున కాచం ద్రార్కమము నిత్యనవచైతన్యము నొసఁగఁ జాలియున్నవి.

ఇట్టి మహనీయకథామధుర మగుటచేతనే భోజరాజీయకథాభాగమును శ్రీకృష్ణదేవరాయలు, పింగళి సూరనార్యునివంటివారే కొన్నిపట్ల ననుకరించియున్నారు. ఎట్లన, ఆ ముక్తమాల్యదయందలి మాలదాసరికథ మదనరేఖ కథకును, కళాపూర్ణోదయమందలి సత్త్వదాత్మునికథ చెప్పిన బాలిక కథ యిందుఁ గల యన్నదానపరుఁడగు విప్రునకు నన్నదాన మాహాత్మ్యము నప్పుడే పుట్టిన బాలుఁడే చెప్పిన కథ కనుకరణములు.

సజ్జనరంజకత్వము

అనంతామాత్యుఁడు :

"... — సరసీరుహ సంభవుఁ డిచ్చుఁగాఁత మ
త్కృతికిఁ జిరాయువున్ విమలకీర్తియు
సజ్జన రంజకత్వమున్."

అని కోరుకొనియున్నాఁడు. వాణీపతియు నీగుణముల నీకవి కనుగ్రహించియుండుట కావ్యమున స్పష్టముగా గోచరించుచున్నది. అనంతామాత్యుని కవిత్వము కడు మృదు మధుర మనియు నుత్తమ కవిత్వమునకుఁ గల ప్రతిభావ్యుత్పత్తులు, నుత్తమశైలికిఁ గల మాధుర్యము, నర్థబోధకత మున్నగుసుగుణముల నది యద్భుతముగాఁ దలదాల్చు కొనెనను టతిశయోక్తి కాఁ జాలదు. ఈతనిశైలియందు గమనింపఁ దగిన ముఖ్యాంశములివి: గానమాధుర్యము, అర్థసౌలభ్యము, సహజగాంభీర్యము, మార్దవము, ఔపదేశికసంపన్నత మున్నగునవి. ఆమూలాగ్రముగా నొకేవిధమున మృదు మధుర

ముగానున్న భోజరాజీయమందలి శైలి తరువాతి యాంధ్ర
కవులలోఁ బలువుర కలవడలేదని ఘంటాపథముగఁ జెప్ప
వచ్చును.

మఱియు నితర కావ్యములవలెఁ గాక భోజరాజీయ
మందలి ప్రతికథాభాగమును నీతులనిధి, ధర్మములపుట్ట, మం
చికినిల్లు. ఇవియే సజ్జనరంజకత్వమునకుఁ బ్రధానకారణ
ములైనవి.

ఈవిధముగ స్వకపోల కల్పితములగు కథానక కావ్య
ములలో భోజరాజీయ మగ్రగణ్యమని చెప్పవచ్చును. చిన్న
కథల ప్రయోజనము, చిన్నకథల శిల్పము, వానియాదర్శ
ములు, కథననైపుణ్యములో మెలఁకువలు ననంతామాత్యుఁ
డెఱిఁగి స్వతంత్రపద్యకథానక కావ్యము నాంధ్రసారస్వతము
నకు మొట్టమొదట నొసఁగిన వాఁడగుట నాతనితోపాటు
మనము నాతని కృతికి శుభ మాకాంక్షింతము:

"అఖిలజగత్సేవ్యమై భూమిపై నహో
బిలము దా నెందాఁక వెలయుచుండు
నాతీర్థమందుఁ బ్రఖ్యాతమై భవనాశ
నీనది యెందాక నెగడుచుండు
నామహానదిప్రాంత నత్యంత పూజ్యమై
గరుడాద్రి యెందాఁకఁ గదలకుండు
నయ్యద్రి శిఖరంబునందును నెందాఁక
శ్రీనృసింహస్వామి స్థిరతనుండు
నస్మదీయ కృతియు నందాఁక సంతత
శ్రావ్యమై సమస్త సభలయందు
విస్తరిల్లుఁ గాఁత వివిధ కథానూత్న
రత్నభూషణాభిరామ మగుట.

# అనంతామాత్యుని అమృతశైలి

ఉత్తమపరిణతి నందిన హస్తమున కేగాని యుత్తమశైలి యలవడదు. రచనావిధానమునఁ జక్కని మెలఁకువ లెఱిఁగి కవి యెంత పరిపాకము గాంచిన నంత సహజసుందరము, మృదుమధురము నగు శైలి యాతని హస్తమున కలవడును. శైలివిషయమున ననంతామాత్యుని భోజరాజీయ మొకవిశిష్టస్థానము గడించుకొన్నది. దీనికిఁ గారణము చక్కనిశైలికిఁ గావలసిన సద్గుణములన్నియు నీకృతియందుఁ దలచూఁగియుండుటే. ఉత్తమశైలికిఁ గల ప్రధానగుణములను దలపోసి యాయాగుణములు భోజరాజీయమున కెంత శోభ నొసగూర్చినవో స్థాలీపులాకన్యాయమునఁ గనుఁగొందము.

సాధారణముగా గానమాధుర్యము, అర్థసౌలభ్యము నవరసోచిత పద ప్రయోగము, సహజగాంభీర్యము, మార్దవము, ఔపదేశిక సంపన్నత మున్నగునవి మన ముత్తమశైలికిఁ బ్రధానగుణములని యంగీకరింపవచ్చును. వీనిని గ్రమముగాఁ బరిశీలింతము.

### గా న మా ధు ర్య ము

పద్యమునకును, రాగమునకును సంబంధ మున్నదా యను ప్రశ్న ముదయించుటకే తావులేదు. వాగర్థములకు, భార్యాభర్తలకు సంబంధము లేదని యంగీకరించిననాఁడు పద్యరాగములకు సంబంధము లేదని యంగీకరింపవచ్చును,

ఛందశ్శాస్త్రముయొక్క ప్రధానలక్ష్యములలోనిది యొకటగు టయే యిందులకుఁ దార్కాణము. ఈ విషయ మనుభవ యోగ్యమే కాని యనుటకు యోగ్యముకానిది. ఎంత నీరస మైన పద్యమైనను జక్కని రాగముతోఁ బాడిన నెంతవారి నైన సమ్మోహితులఁ జేయుటఁ జూతుము. వేయేల, మన త్యాగరాజకీర్తనములే యిందులకు సాక్ష్యములు. సామాన్య ములగు మాటలనే మంత్రమొనరించి యుత్తమగానమున మేళవించుటచేతనే శిలలనైనఁ గరఁగించి భక్తహృదయముల తోపాటు భగవంతుని హృదయమును గూడ శ్రీత్యాగ రాజస్వామి వశపఱచుకొనలేదా! మన తెలుఁగు పలుకు లలో నీ గానలహరి యంతర్భూతమై యున్నది. అది జాణ యగు కవిచేత నెల్లరకు హృదయగ్రాహియై మాధుర్యము నిచ్చుచున్నది. ఈగుణము భోజరాజీయమునఁ గల దనుటకు రెండుమూఁ డుదాహరణములు మాత్రము చూచి ముందు గుణముఁ జర్చింతము.

> "చిగురుటాకులలోని జిగిఁ గూర్చి యాబాల
> యరకాళ్ళఁ జేతుల నలఁది రొక్కొ
> పసిఁడితీఁగెలమీఁది ప్రభ దెచ్చి యాకాంత
> మెయిదీఁగె యంతట మేది రొక్కొ
> చంద్రబింబము కాంతి సవరించి యా లేమ
> మోమున నునుపుగాఁ దోమిరొక్కొ
> క్రొమ్మెఱుంగుల మించు గొనివచ్చి యాయింతి
> కలికి కన్నులఁ గీలు కొలిపిరొక్కొ...

"ఆమదిరాక్షి నేత్రరుచు లావనజానన ముద్దునవ్వు లా
భామిని మందమందమృదు భాషితరీతులు డెందమందుఁ బే
రామనిసైఁ దనర్చుటయు......"

"ఆలోల మందానిలాధూత లత మాడ్కి..."

ఆయాతావులయందొక్క సునిశితమగు గానమాధు ర్యముండుటచేఁ జదువరులకుఁ బద్యపఠనమున నాసక్తి యినుమడించుచుండును.

అర్థసౌలభ్యము

అర్థసౌలభ్య మను గుణమిందుఁ గలదనుటకుఁ గావ్యమంతయుఁ దార్కాణముగాఁ జూపవచ్చును. అన్వయక్లిష్టత లేక పాఠకునకుఁ జదివినంతనే పదములతో పాటర్థము నెంటనే స్ఫురించుటయే యర్థసౌలభ్యము. ఈసుగుణము నీక్రింది పద్యములఁ జక్కఁగాఁగననగును.

"కావున నిన్నుఁ జూచి కడఁ
గంటిమి మా దురితాబ్ధి కంచు సం
భావన చేసి యావనిత
భర్తయుఁ దాను నిషిద్ధభావముల్
పోవఁగఁ ద్రోచి శుద్ధమగు
పూర్వపుమేనులు దాల్చి నెమ్మదిం
బోవఁగ విప్రకాంతయును
బోయె నకల్మషవృత్తి నింటికిన్"

"చెప్పఁగఁ జూచి సిగ్గువడుఁ
జెప్పఁగఁ; జెప్పకయున్నఁ దీర, దేఁ
జెప్పెదఁ గాక; యంచుఁ దెగి
చెప్పఁ దలంచు; నిదేమి మాటగాఁ

జెప్పొదుఁ ? జెప్పినం బతియుఁ
చిత్తమునం గలుషించునో పరుల్
జెప్పెడువార్త కాదనుచుఁ
జెప్పఁగఁ బూనును జెప్పఁ గాదనున్.

"కన్నకడుపుగానఁ, గడుఁ జిన్నగాన, నే
నతనిఁ బాసి దూరమరుగునట్టి
వేళగాన, వాని వీక్షించిరాకున్న
వలపుమాన దనిన వదలనైతి"

ఇట్టి సులభమగు రచన పరిణతహస్తునకే గాని సామాన్యునకు సాధ్యముకాదు. పెద్దల సూక్తులు సూత్రప్రాయములు, విస్పష్టార్థద్యోతకములు, అక్లిష్టములు; అందువలననే మధురములు. ఈకృతియంతయు నిట్లుండుట విశేషములకెల్ల విశేషము.

నవరసోచిత పదప్రయోగము

రసోచితములగు పదములు కావ్యదేహమునకుఁ బ్రాణవాయువులు. భోజరాజీయమున నవరసవర్ణనములు నాయా తావుల నుచితపదజాలములతో విరాజిల్లి యనంతామాత్యుని శైలి కమృతత్వ మాపాదించె ననుటలో సందేహము లేదు. శృంగార రసోచితమగు పదజాలముతోడి యీక్రింది వర్ణనఁ గనుఁడు :

"స్మరచాపముక్తమై చనుదెంచునట్టి మో
హన సాయకంబొ యీ వనజగంధి
హరుజూటమున నుండి యరుగుదెంచినయట్టి
చంద్రబింబమొకో యీ జలజనయన

యంబరస్థలి నుండి యరుగుదెంచినయట్టి
క్రొమ్మెఱుంగొక్కొ యీ కోమలాంగి
యుద్యానతరులలో నుండి వచ్చిన యట్టి
యెలదీఁగ యొక్కొ యీ యిగురుఁబోఁడి
యనఁగ నత్యంత సౌకుమార్యమునఁ బేర్చి
చిత్తమున కింపు నించు నచ్చెలువఁ జూచి."

ఆ చెలి సౌకుమార్యము మన కేల కాని యీపద సౌకుమార్యముమాత్రము మనలను సమ్మోహితులఁ జేయు చున్నదిగదా !

కరుణరసోచితమగు నీక్రిందిపద్యము బాష్పైనఁ గరఁగించుఁగదా !

"పిడుగడచినక్రియ నీటెం
బొడిచినగతి గుండె పగిలి భూస్థలిమీఁదన్
బడి పొరలుఁ దన్నుఁ గొను ను
గ్గడువుగఁ గన్నీరు నించు గడగడ వడఁకున్.
" 'బే'యనుఁ దల్లీ నీవెట
పోయెదవను నన్నుఁ డించి పులివాతఁ బడన్
బోయెదవే యనుఁ జెల్లం
బోయను నింకేటి బ్రతుకు పో నాకు ననున్."

ఇందలి 'బే' 'పో' యను పదములు కరుణరసస్ఫోరక ములు. ఇట్లే యితరములగు బీభత్స, భయానక, వీర, హాస్య, రౌద్రాద్భుత శాంతరసములను వర్ణించు సందర్భముల నా యాతావుల నాయారసములు సుస్పష్టముగా ద్యోతకము లగుచుండును.

"స్రుక్కిన యంగుళములు దళ
మెక్కిన దేహమును గాంతియెడలిన మొగముకా
మక్కిన చెవులును ముడిఁగిన
ముక్కునునై వచ్చి మహుఁడు ముద్దియఁ గనియెన్"

అనుచోట భీభత్సమును,

"వచ్చిన నమ్మహాత్ముఁడును వావిరిఁ దత్తరుశాఖ డిగ్గి వే
వచ్చి నృపాత్మజుం గదిసి వాని శిరోరుహరాశి యొక్కచేఁ
జెచ్చెరఁ జుట్టి పట్టి యొకచే మొగమెత్తి గళంబుచాయకున్
దెచ్చి మొగంబు దంష్ట్రికలు దీటుచు నుత్కట సంభ్రమంబునన్"

అనుచో భయానకరసమును,

"......అక్కుమారకంఠీరవుం డకుంఠిత సత్త్వంబున......సత్త్వహీనంబగు మూషకంబు నెగురవైచి యాడు మార్జాలంబునుం బోలెఁ గొంత తడవు వీరవినోదంబు సలిపి యధిక రోషంబున నాదోషకారిం గడకాలువట్టి ఖేచర ప్రీతిగా బడిసెవైచు చొప్పునం ద్రిప్పి..."

మున్నగు తావుల వీరరసంబును,

"చంపంగవచ్చిన జముని దూతలకు లం
చము పెట్టి వచ్చెనో చావునొల్లఁ
బొమ్మని మోరకంబునఁ ద్రోచి వచ్చెనో
యింటి వారికిఁ జెప్ప కిచటఁ జచ్చి
నట్లైనఁ గోపింతురని చెప్పవచ్చెనో..."

మున్నగుచోట్ల హాస్యరసమును,

"చెలఁగి కొల్లిచ్చిన నిలవ్రక్కలై భుజం
గమరాజు తలల రత్నములు దొఁప

వెస లంకెవైచిన వసుధాధరేంద్రగ
హ్వరముల్ట్రిహరులు బిట్టదరి పడఁగఁ
గొమ్ములఁ గోరాడి చిమ్ముచో నెగసిన
ఘనగండశిలలు మేఘములు దాఁకఁ
జీఁ దఱగొని పాఱుచోఁ దరుశ్రేణులు
దుర్వాతహతిఁ బోలెఁ దుమురుగాఁగ."

మున్నగు తావుల రౌద్రరసమును,

"తెరువిమ్మని యిటు లడుగుము
సరభసగతి నుదక మిరుదెసలఁ బాయఁ గడుం
బరువునఁ బోవఁగ నయ్యెడుఁ
దరుణీ యరుగు మఱకాలు తడిగాకుండన్."

అనిన వసిష్ఠుఁడు మున్న
ట్లనుటకుఁ దో డిదియు నొక్క యాశ్చర్యము పొ
మ్మని తలఁచుచు గౌతమికిం
జని యట్టుల పల్క నది వెసం దెరు విచ్చెన్."

అనుచో నద్భుతరసమును,

"ఇవ్విధమున శోకింపఁగ, నన్వాత్సశిరంబుమీఁద నానన మిడి నీ
వెన్వరికిఁ గాఁగ వగచెద, నివ్వలవని జాలిపడఁగ నేటికిఁ బుత్రీ.

"పుట్టిన పిమ్మటఁ జావును
గట్టి వృథామరణ మొందుకంటె బుధులకున్
దట్టమగు కీర్తి సుకృతము
లిట్టలముగఁ గల్గు చావు లింపులు గావే."

మున్నగు తావుల గోమాత పులివాఁతఁ బడుటకై పుత్రి నొప్పించి పోవుసమయమున శాంతరసమును సార్థకపద జాలముతోఁ జక్కగ నొప్పారియున్నవి.

## సహజగాంభీర్యము

సహజగంభీరమగు శైలి యలవడుట కవిపూర్వపుణ్యావశేషముననే కాని యది యలవఱచుకొందమన్న నలవడునది కాదు. ఈసుగుణ మున్నదనుటకు నిదర్శనము పద్యములలోఁ గుంటిసపకే కాని, వ్యర్థపదములు పాదపూరకము లై గాని, యుండక గొసుకే ప్రవాహముగాఁ బద్యమంతయు నడచుటే. ఇట్టిగుణముల కుదాహరణముగా రెండు మూఁడు పద్యముల గమనించినఁ జాలును.

"మమకారంబు నహంకారము, సంసారాను బంధరజ్జువు లని చి
త్తముల వివర్జింతురు సం, యము లీవును నడుపుమా తదాచారంబున్.
ఆడకు మసత్యభాషలు, గూడకు కొఱగానివానిఁ గొంకక యొరు లె
గ్గాడిన నెదురుత్తర మీఁ, జూడకు విని విననివాని చొప్పునఁ జనుమీ!
చులుకన జలరుహజంతువు, చులుకన తృణకణము దూది చుల్లనసుమ్మీ
యిల నెగయు ధూళి చుల్లన, చులుకన మఱి తల్లి లేని సుతుఁడుకుమారా!

ఇట్లీ కృతి యామూలాగ్రముగా సహజగంభీరశైలికి నిలయమై యున్నది.

## మార్దవము

ఇఁక మార్దవమను సుగుణ మెట్లొప్పినదో చూతము. కవి తా నేఱుకొను పదములు సుమసదృశము లై యుండునట్లు చూచుకొనును. నిఘంటువుఁ జూచుకొన్న నర్థము సరిపడును గదా, యన్న సంతృప్తితో సత్కవి యే పదమును వాడఁడు. మాధుర్యమునకుఁ దోడు మృదుపదజాలముఁ గవి యెన్ని యొక సుమహారమువలెఁ గావ్యహారమును నిర్మించును. అనం

తామాత్యుని మార్దవగుణమున కీ క్రింది పద్యములు చెప్పఁ దగ్గని తార్కాణాలలో పరికింపుఁడు.

✓ "తావి గొనని పుష్పదామంబు విధమునఁ
జిగుమఁ బడని మావిచిగురు భంగిఁ
ద్రాఁకఁబడని నవసుధాధారపగిదిని
జెలువఁ జూడ సురతచిహ్న లేదు."

"పెదవులు గదలెం గదలవు
రదనంబులు గానవచ్చె రా వనుపాటిన్
మృదువచనరచన లెసఁగఁగ
ముదిత యతని హృదయకమలముం గరఁగించెన్."

"జపములకుఁ జొరక మగి తపములకుఁ జనక నుడిఁ
గపటములు విడిచి నినుఁ గృపణాలగుఁ జేఁడన్
విపుల తరముగు పరమకృప చిగురు నిగుడఁ బెఱ
వేషములకుఁ దొడిపఱవ కపుడు నిజరూపం

బుపమలకు మిగిలి యతినిపుణగతిఁ బొగఁడు మృదు
లక్షితముల నెసఁగ నధికపుమహిమ చూపన్
సుపథ మగు సుగతి గని యపగతగుణికు లగుచు
సఫలమితనిగమములను ద్రిపురదనుజారి."

ఇట్టి మృదువచనముల చేతనే పై పద్యమున ముని[illegible]పతిహృదయమును, తుది పద్యమున భక్తుఁడు భగవంతుని హృదయమును గరఁగించి వశపఱచుకొనుట వర్ణించి యనంతామాత్యుఁ డా కారణముననే పాఠకహృదయముల నపహరించియున్నాఁడు.

## ఔపదేశిక సంపన్నత

ఋషి యగువాఁడే కవియగును. ఆతని ప్రధానలక్ష్యము శాస్త్రములలో విధి రూపముననుండి భీతిని గలిగించు పరమ ధర్మములను దాను కాంతాసమ్మతము చేసి మృదుమధురముగఁ జెప్పి పాఠకులను సన్మార్గమునకుఁ ద్రిప్పఁ జూచును. ఈశక్తి మానవాతీతము, విషయము ప్రాంతదే యైనను జెప్పువానికిఁ గల యాశక్తి కతముననే యది మహామంత్రమై పలువుర కాదర్శప్రాయమగును. ఈవిషయమున ననంతామాత్యుని దండె వేసిన చేయియే. ఈవిషయమునను రెండుమూఁడు పట్టులే పరికించి యనంతామాత్యుని యతిశయ నిపుణత కానందింతము.

పావకరోముఁడును, సోదరియు నొకే గురువునొద్దఁ గావ్యనాటకాదు లభ్యసించుచున్న దినములలో నొకనాఁడు పావకరోముని సోదరిని :

"గురుతనూజుండు మనమునఁ గోర్కె నిగుడఁ
దోడిశిష్యుల నందఱ వీడుకొల్పి
వనిత నేకాంత మందిరమునకుఁ దెచ్చి
కడియ వచ్చిన నది వాని కళ లెఱింగి"

యిట్లు బోధించినది.

"ఇటు తగునయ్య విప్రుఁడ వహీనగుణాఢ్యుఁడ వీవు నీవ నే
మిటి కిటువంటి దౌష్ట్యము శమించునె మజ్జనమందు విన్నఁ ద
క్కటి జను లేమి యంద్రు మదిఁ గాంక్షయె గల్గిన నగ్నిసాక్షిగాఁ
జెటికొన వట్టి కాక వృథసేయుట ధర్మమె కన్యకాత్వమున్ ?
పడఁతికిఁ గన్యా ధర్మం బెడలినఁ గొరయగునె వెండి యెవ్వరికైనం
గడివోయిన పువ్వులు మఱి, ముడుచునె రసికుఁ డగువాఁ డమోఘ
విచారా !"

ఇట్టి బోధనముచేతనే పిమ్మట నాతని హృదయము పవిత్రమై యీమెను మాతృభావముతో సంస్తుతించినాఁడు. ఈమెయే మహాక్రూర రాక్షసుని హృదయమును దన సత్య వాక్పరిపాలనచే మార్చివైచి యాతని కృపఁ జేయించినది :

"బొంకకు మెన్నఁడున్ దనుజపుంగవ శాంతివహించియుండు మే
వంకను జీవబాధలగు వాని నొనర్పకు శాంతుఁడవై గతా
హంకరణుండవై ఘనదయామతివై విజితేంద్రియుండవై
పంకజనాభ దివ్యపదపంకజ భక్తిపరాయణుండవై."

తన సత్యవాక్పరిపాలనమునఁ బులి కాహారముగాఁ బోవు గోవు తన వత్సము నిట్లు బోధించి బుజ్జగించుచున్నదో కనుఁడు.

"నిన్నుఁ గని యిన్నిదినములు
చన్నిచ్చితి నేను ఋణవశంబున నిఁక నీ
వెన్నఁడు నన్నుఁ దలంపకు
మన్న మమత్వంబు విడువుమన్న మనమునన్.

"ఒంటిఁ జరింపకు పొలముల
నింటికిఁ గడు ప్రొద్దు గలుగ నేతెంచుచు రా
వెంటఁ బడి పోడుచు గోవుల
చెంటఁ జనకు క్రయ్యఁ బడకు సందడియగుచోన్

చులుకన జలరుహ జంతువు
చులుకన తృణకణము దూది చుల్కనసుమ్మీ
యిల నెగయు ధూళి చుల్కన
చులుకన మతి తల్లి లేని సుతుఁడు కుమారా!

కావున నిట్టి లాఘవము గానుపకుండఁ బ్రభుత్వతాగుణ
శ్రీ వెలయంగ సజ్జనులఁ జెంది తదీయ హితోపదేశముల్
నీ విమలాంతరంగమున నిల్పుదుగాని నిరర్థగోష్ఠి కిం
బోవకుమయ్య! దుర్గములఁ బొందకుమయ్య వివేకహీనతన్.

శబ్దనిగ్రహముగ సందర్భోచితముగ సహృదయ హృదయ రంజకముగా నాయా సుగుణముల నలవఱచుకొన్న యనంతామాత్యుని యమృతహస్త మమృతశైలినే ప్రదర్శించినది. ఇంకను నాయాపట్టులఁ గల సంభాషణచాతుర్యము, హితోపదేశము, ధర్మబోధ హృదయంగమముగా పఠితల నోలలాడించుచుండును. ఇట్లనంతామాత్యుఁడు సులభసుందర మగు భాషలో సుజన స్తవనీయమగు భోజరాజీయము నాంధ్ర భాష కొసఁగి చిరస్థాయి యైనాఁడు. పసిబిడ్డలకైన నర్థమగు నీతని మృదుమధురభాషయు, నీతని రచనావిధానము నెల్లరకు నాదర్శప్రాయము లనుటలో సందేహము లేదు.

---

3

# భోజరాజీయము : కొన్ని విశేషములు

ప్రాచీనాంధ్రకవిశేఖరు లెందఱో తమజీవితములందు వలెనే తమకావ్యములందును బహునియమములను గడుదీక్షతోఁ బాటించి యాదర్శప్రవర్తనముతోపాటు సలక్షణ కవితామృతమును లోకమున కొసఁగి యున్నారు. ఈ బహునియమానుసరణము కాలక్రమమునఁ గవులలోఁ దఱుఁగుట గమనింపఁ దగినవిషయము. ఒకవిధముగా బహునియమోల్లంఘనమున స్వతంత్రపథ మవలంబించిన కవులకతన భాషామాత కెన్నో శృంఖలలు నైతొలఁగినవని యానందించువారు కూడ బహునియమపూర్వకముగా భాషామాతకుఁ బరిపుష్టి సుందరతలను గూర్చిన కవితల్లజులను మిక్కిలి ప్రశంసింపక తప్పదుగదా! అటు నన్నయతిక్కనాదులకుఁ దరువాతివాఁడు నిటు ప్రబంధకవులకుఁ బూర్వుఁడు నగుననంతామాత్యుఁడు తన 'భోజరాజీయము'న ననుసరించిన విశిష్టనియమములును, జూపినప్రయోగవిశేషములును నాతని సహజసుందరకవితకు వన్నెఁ గొనితెచ్చి యాతని ప్రతిభ మఱింత స్తోత్రపాత్ర మొనరించినవై చినవి. కావున; నేతద్విషయము లిట దిఙ్మాత్ర ముగఁ బరిశీలింతము.

## ప్రాసనియమము

మనయాంధ్రకవిపుంగవులలో నొక్క నన్నయమాత్రము ఖండాఖండప్రాసము వాడలేదు; రేఫశకట రేఫసాం

కర్యము చేయలేదు. తిక్కన భారతాదులలో సానుస్వారని రనుస్వారప్రాససాంకర్యము కలదని 'సర్వలక్షణ సారసంగ్రహకులు' ప్రకటపఱచినవి. తిక్కన కవులునై తమ పెక్కెడల నీప్రాస సాంకర్యము చేసియున్నవారే. కాని యనంతామాత్యుఁడు మాత్రము తన భోజరాజీయమునఁ బ్రాససాంకర్యము చేసియుండలేదు.

### సమప్రాసము

అనఁగా మొదటిపాదమున ననుస్వారపూర్వకమగు నక్కరము ప్రాసస్థానమునందున్నఁ దక్కిన మూఁడుపాదములు నట్లేయుండుట. ఈసమప్రాసములం దర్ధబిందుప్రాసము, శకటరేఫప్రాసము, సాధురేఫప్రాసము, భోజరాజీయమునఁ జక్కఁగాఁ బాటింపఁబడినవి. మఱియొక్క విశేషమేమన నుభయప్రాసము శిష్టజనాంగీకృతమయ్యు ననంతామాత్యుఁడు దీనినంగీకరించియుఁ దానుమాత్రము ననుప్రాసమే వాడియున్నాఁడు. పద్యములందలి నాలుగుపాదములందలి ప్రాసము నొకేవిధముగ నుండవలె నను నియమము నెల్లెడల నీతఁడు పాటించెను. పలువు రిటీవలికవు లిది పాటింపలేదు, మఱికొందఱు మూఁడుపాదము లొకవిధముగను నాల్గవ పాదమును భిన్నముగను వాడిరి. ఈసూత్రమే యనంతామాత్యుఁడును బాటించెనను వారి కాధారములు భోజరాజీయమున ముద్రితప్రతులలో రెండుచోట్లఁ గల పాఠములు. కాని తాళపత్రప్రతిలో భిన్నపాఠములు గాననై ముద్రితప్రతిలోని

పాఠము లగ్రాహ్యము లని భ్రమపడుచుటచే నింతగ్రంథమున నెన్నియో తావులఁ బ్రాససాంకర్యముచేయక యొకటిరెండు తావులఁ జేసినాఁడనుటకన్నఁ దాళపత్రప్రతిలోని పాఠములే గ్రహించి యనంతామాత్యుఁడు ప్రాససాంకర్యము చేయని వాఁ డనుటే సమంజసముకదా! ఈప్రాసమును పాటించుట కష్టసాధ్యమయ్యుఁ బద్యమాధుర్యము చెడకుండ నీమహాకవి దీని ననుసరించెననుటకుఁ గొన్ని యుదాహరణలుచూపెదము.

అర్ధబిందు సమప్రాసమునకు :—

"కాఁగానిమాట లాడెదు, రాఁగూడదు నేఁ దపశ్చరణమై నుండం
గాఁ గోమలి యిటు నిల్వక, యేఁగుము మగనాలి కేల యీదుర్గుణ
ముల్" (౮. ఆ. ౧౮౯)

"ఆఁకొని యఱచెడిఁ బ్రేవులు, నేఁకట శోషములవలయు నీ మాంసమున
జ్జాఁక యిడి యివ్విధంబునఁ, దేహము చెడి పల్కఁదగునె ధేనువ
నాతోన్" (౮. ఆ. ౨౧౨)

"నాఁడెల్లవారు నీఁపూ, బోఁడి వలదు మాను మనఁగఁ బయిలోడక తాఁ
దూఁడరిదై తఱియఁబడిన, వాఁ డితనికి నేఁడు మగవల దను
వారున్" (౨, ఆ. ౧౦౯)

శకటరేఫ సమప్రాసమునకు ;—

"తెలిపకుఁ గుచమండలమును, మఱి పిఱుఁదును ఘనముచేసి మధ్యమునకుఁ జే
దఱిక పొసఁగు నని యజూనం, దఱి దూఱుట మానెఁ జాలం
దాల్చుటవలనన్" (౩, ఆ ౧౩౦)

"పాటలఁగ నమ్మహీపతియుఁ బాయక తోడన పాఱెఁ బాఱిన
క్కాటడవిం గిరాతతతి కాపురముండెడు పల్లె సొచ్చి పె
న్కోటలఁబెట్టి పుంగి మాంసములు ముక్కున బంటిగ మ్రింగుచుండ దై
వాఱెడు భక్తి నత్రిమునిపట్టియు కొమదిలోఁ దలంచుచున్"

(౧. ఆ. ౧౧౫)

ఇట్లే యితరస్థలములఁ బ్రాసమునసే కాక యనంతా మాత్యుఁడు 'భోజరాజీయము'నఁ గాని 'రసాభరణము'నఁ గాని ద్విరేఫములకు యతిమైత్రియు నంగీకరింపలేదు. చూడుఁడు.

"ఉవ్వను ప్రోఁతతో నెదురెఱుంగని వీఁక ... "

(౩. ఆ. ౨౦౦)

"ముందరఁ బురోహితుండు పి, ఱుంద సచివుఁ డాయుధపు మెఱుం

గులు మెఱయన్ (౪. ఆ. ౭౭)

మఱియు న ణ లకు బ భ లకుఁ బ్రాసము చెల్లుట శిష్టసమ్మతమయ్యు ననంతామాత్యుఁడు భోజరాజీయమున సమప్రాసమే పాటించుట విశేషవిషయము.

"అని దనుజుఁడు ధట్టించిన, వనజానన వట్టు నంతవాఁడవుగావే
నిను నిప్పుడు గాదంటినె, విను యుక్తాయుక్త పదవివేకము వలదే"

(౪. ఆ. ౭౫౭)

"బాణము వెఱుకుము తనువును, బ్రాణంబులు నిలువ వనిన రాసుతుఁ
డదియున్
శోణితముగఁ బెఱుకఁగ నలి, వేణి తదుత్థితదురంత వేదనవలనన్"

(౫. ఆ. ౧౧౪)

"నాభాగ్య మెట్టిదో నిను. నీభంగిని దూఱవలసె నిప్పుడు నాకున్
శోభన మొనర్పఁ దలఁచిన, నోభవ్యచరిత్ర చేయు మొకకార్యంబున్"

(౬. ఆ. ౪౦౫)

ఇదేవిధమున 'భోజరాజీయము' న ననంతామా త్యుఁడు విశిష్టనియమముల ననుసరించుట స్పష్టము కాఁగలదు.

## కొన్ని శబ్దముల ప్రామాణ్యము

ఇతర ప్రామాణికగ్రంథముల నిర్ధారకములుగాఁ గానరాని పదములలో 'ఎలనాగ' యీగ్రంథమున నిర్ధారకముగ నున్నది.

> “భోగమున కోడి ప్రాఁ, త్యాగము సేయుటకుఁ దెంపు తలకొను మదితో
> నాగాతమి కరుగుచు నెల, నాగను బొడగంటి నొకవనస్థలి శాంతన్” (౧. ఆ. ౧౭౪)

ఇట్లే 'పీకు' 'కాపు' రెండును నిరనుస్వారములని యీతని మతము.

> “ఆకన్నెఱింగి యచ్చట, నీకన్నియ నుండనీక యిటు తెచ్చితివా
> రాకొమరుఁ డెందుఁ బోయెనొ, పీకున నిది మూర్ఛవోయి విరహాతురతన్” (౩. ఆ. ౨౩౬)
>
> “మోపెడు కట్టెలు గాల్చిన, కాపే యర్హుఁడగునఁటె జగన్మోహనకీ
> లాపరిచయ దృగ్దీప్తి, వ్యాపారాపాంగమైన యంగనఁ గవయన్” (౪. ఆ. ౮౯)

మఱి యన్యగ్రంథముల నిరనుస్వారముగ నున్న 'తోకొను' అనుపద మిందు సానుస్వారముగ నిర్ధారింపఁ బడినది. 'తోడు+కొను' అనునపుడు 'తోకొను' అనియు, 'తోఁక+కొను' అనునపుడు తోఁకొను అనియు నొకేపదమునకు ద్వైరూప్యము సిద్ధించుచున్నది. కాని, యీకవి నాలుగైదు తావుల 'తోఁకొను' అనియే నిర్ధారకముగ వాడుటచే నీతనిమత మది యని నిర్ణయింపవలయును.

"తేఁకువ యలరఁగ నీగతిఁ,దోఁకొని చని చదల రత్నతోరణదీప్తుల్
ప్రాఁకెడు ఘనగృహముల న, య్యాఁకల విడియించె రాజముఖ్యుం
డంతన్" (४. ఆ. ౭౭)

"ఆఁకలి వచ్చిన విప్రులఁ, దాఁకింపక యశన మిడుము తత్పరమతి న
ట్లాఁకలి జేయకు కుడువం, దోఁకొనిరాపర్వమగు తిథులమనవారిన్"
(౬. ఆ. ౧౬౧)

ఇట్లే ౩. ఆ, ౨౨౬ మున్నగుపద్యముల నిది నిర్ధారకన్గాను యున్నది. ఈవిధముగా ఛందోదర్పణ కర్తయగు ససంగొలిఁడు తనగ్రంథమునఁ బై శబ్దములపట్ల నభిప్రాయము సూచించినాఁడు.

హేమాపాత్రములు, కాంచనాపాత్రములు

భోజరాజీయమున నీ రెండుపదములుఁ బ్రాసస్థాన యతిస్థానములఁ బొడకట్టు చున్నవి.

"జామాతృప్రముఖప్రభూత్తను జనుల్ సంతృప్తు లౌనట్లుగా
హేమాపాత్రములన్ జతుర్విధములై యింపారునాహారముల్
ప్రేమాధిక్య మెలర్ప షడ్విధరసోపేతంబుగాఁ బెట్టె సు
త్రామానోకహవైభవం బెసఁగ నాధాత్రీశుఁ డత్యున్నతిన్."
(४. ఆ. ౧౦౧)

"అంతఁ బోక కాంచనా పాత్రమునఁ బెక్కు
రుచులు గల్గుభోజ్యనిచయ మిడినఁ
గంటి మంటి ననుచుఁ గడుపారఁ గుడిచి య
వ్వనితఁ జూచి యిట్టులనియె నతఁడు." (५. ఆ. ३४२)

ఈపదములు తాళప్రత్తప్రతిలో నిట్లే యున్నవి. హేమకాంచన పదము లాకారాంతము లని కవి పొరపడు

ననుటఁ బొసఁగమి నాలోచింప "హేమామత్రములు" "కాంచనామత్రములు" నైయుండుట సమంజసమని తోఁచి నది. "సర్వమావపనం భాండమ్ పాత్రామత్రేచ భాజన" మ్మని యమరము. (ద్వితీయకాండ, వైశ్యవర్గ, ౩౩ వ శ్లోకము) ప్రాచీనలేఖకులపొరపాటే యచ్చునకెక్కినదనుట స్పష్టము.

## పా ఠ భే ద ము లు

భోజరాజీయము నకుఁ దాళపత్త్రప్రతి యొకటి మాత్రము గలదు. అది కాక చిన్నయసూరి సేకరించిన కొన్ని పాఠములు మాత్రము సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమునఁ గలవు. ఈ రెండింటి మూలమునను బూర్వోదాహృతము లగు ప్రాససాంకర్య దుష్టప్రయోగ శంక వైతొలఁగ సలక్షణము లగు పాఠములు లభించినవి. అందు ముఖ్యమైనవి కొన్ని మాత్రమిటఁ జూపుచున్నాను.

> "ఆఱు మొగంబు లాతఁడు మహాత్ముఁడుఁ దాతని ముద్దుసేయుచో
> నాఱు ముఖంబులన్ వలగు నంబిక యేసును నీవుఁ గూడఁగా
> నాఱు ముఖంబు లయ్యెడి రయంబున గమ్మని నీవు నవ్వుచుం
> జేరుట యోగి వర్యులకుఁ జింత్యమగున్ ముఖపంచకోజ్జ్వలా"
> (౫. ఆ. ౨౦౧)

ఇది ముద్రితపాఠము. దీనివలన 'ఱ, ర' ప్రాససాంకర్యమిట సిద్ధించినది. దీనికిఁ జిన్నయసూరి పాఠములలో "...నవ్వుచుం, జీఱుట యోగివర్యులకుఁ జింత్యమగున్..." అని కలదు. ఇదే సమంజసము, నిర్దుష్టము నగు పాఠము.

"నూతుల దరులను లోఁతగు, పాతటికసవులను నెట్టి పచ్చికయున్నన్
బ్రాఁతిపడి మేయఁబోకుము, మాతినిడకు ముగ్రసత్వములుగలనీటన్"
(౩. ఆ. ౩౫)

ఇది ముద్రితపాఠము. ఇందును బ్రాససాంకర్యము గలదు. దీనికిని జిన్నయసూరి పాఠము "ప్రీతిపడి మేయఁబోకు" మని. ఇదియే నిర్దుష్టము.

"నవ్వుచుఁ జెక్కుమీటి నలినస్ఫుటలోచన మాటలేల నీ
యవ్వన లక్ష్మికిన్ భటుఁడనైతి ననుం గరుణింపుమంచు వాఁ
డువ్విళు లూరుచుం బలుక నుత్పలగంధియు నోమహాత్మ నీ
కివ్విధ మెట్లు చొప్పడియె నేనొక బ్రాఁతియె నీకుఁ గోర్కకున్"
(౭, ఆ. ౧౦౯)

ఇందలి ద్వితీయపాదమందలి "యవ్వనలక్ష్మి" వ్యాకరణదుష్టము. ఇది ముద్రితపాఠము. దీనికిఁ దాళపత్రప్రతిలో,

"నావ్వుఁడు..., యావ్వనలక్ష్మికిఁ..., డూవ్విళు లూరుచుం..., కీవ్విధ మెట్లు..., అని లిఖింపఁబడియున్నది. ఈ లేఖక దోషములు ముద్రాపకుల దోషములై యచ్చున కెక్కినవి. కాని కవిదోషములు కావు. పూర్వాక్షరముల లేఖనపద్ధతిఁ దెలిసినవారు,

"నావుడు... యావనలక్ష్మికిఁ... ఊవిళులూరుచుఁ... ఈవిధమెట్లు..." అనియే లిఖింతురు. ఇదియే సుసంగతమగు పాఠము. ఈవిధముగాఁ బరిశీలనానంతరము భోజరాజీయము నిర్దుష్టగ్రంథమని విస్పష్టము.

## కొన్ని ప్రయోగములు

భోజరాజీయమునందలి ప్రయోగములలోఁ గొన్ని మాత్రమే ముఖ్యమైన వాని నుదాహరించుచున్నాను.

1. 'బాలకి'. 'బాలిక' యనియే కాని 'బాలక' వ్యాకరణమునకుఁ బూర్ణసమ్మతము కాదు. కాని బహుశాసనములఁ గననైన యీపద మిందు నిర్ధారకముగా నున్నది.

> "ఒకసహకారశాఖ తుద నోలిఁ బెనంగొని యున్నపువ్వుఁ దీఁ
> గకుఁ దనహస్త మెత్తుటయు గ్రక్కున లేఁజిగు రంచుఁ గోకిలం
> బాకటిరయంబులం గదియనుల్కి వడంకుచుఁ బాలె నొక్క బా
> లకి తనబోఁటి తోడ నబలా! యిది కౌతుక తీఁగ సొమ్మనన్."
>
> (౪, ఆ. ౧౭౫)

2. 'బిట్టుబిట్టు' ఈపద మొక్క భోజరాజీయమునఁ దక్క మఱి యేయితర గ్రంథమునను బ్రయుక్తముగునట్లు కానరాలేదు.

> "అప్పుడు బిట్టుబిట్టు విభుఁ డాతరుణిం గనుఁగొన్న..."
>
> (౫, ఆ. ౯౯)
>
> '... ఆ, తని యేతెంచుట బిట్టుబిట్టు గని కాంతల్ విస్మయా
> క్రాంతలై."
>
> (౬, ఆ. ౪౪)

పై రెండింట నిది యవ్యయ మని 'తటాలున' యని యర్థమని శబ్దరత్నాకరము గ్రహించినది.

3. 'బిట్టబిట్ట' యు నిందుఁ గాననగు సపూర్వపదములలో నొకటి. ఇది దేశ్య విశేష్యమనియు (బిట్టు+బిట్టు) యని శబ్దరత్నాకరము గ్రహించి మిక్కిలి బిగు వని యర్థము చెప్పినది.

"అనవుడు నట్లకాక యని యాసతి విప్రునియింటి కేఁగి య
ల్లన నతఁ డొంటి యున్కిఁ బదిలంబుగఁ జూచి సమీపమందు ని
ల్చినఁ గనిబిట్టుబిఱ్ఱఁ దన చిత్తము జల్లనమోముదేరకో
గనుఁగొని యింతప్రొద్దిటకుఁ గామిని రాఁగత మేమినావుడున్."
(౪, ఆ. ౩౦౯)

4. "చిటికెనవట్టు=వివాహమాడు." దీనికి క్రింది చక్కని ప్రయోగము గలదు,

"... కాంతుఁయె కల్గిన నగ్నిసాక్షిగాఁ జిటికెనవట్టి కాక పృథ
సేయుట ధర్మమె కన్యకాత్వమున్." (౪, ఆ. ౨౩౩)

5. 'బిఱ్ఱు' అనుపద మకర్మక్రియగా భోజరాజీయమున నే ప్రయుక్తము. అన్యగ్రంథముల నీపదము కానరాదు.

"... నెత్తుటం జేరినకోరమీసములు బిఱ్ఱిన వెంద్రుఁకలున్."
(౪, ఆ. ౧౦౫)

ఇట 'బిరుసైన' నని యర్థము శబ్దరత్నాకరమిచ్చినది.

6. "వ్రక్కవాయు=తెగు" అని శబ్దరత్నాకరము. ఈపదము నితరగ్రంథముల గాన రాలేదు. భోజరాజీయము (౫, ఆ. ౧౯౫) ననే కలదు.

7. 'వాలయించు'. ఇది 'వాలాయించు' నకు రూపాంతరము, అపూర్వమును.

"... నీవెఱుఁగవె నీజీవన మేవారికి నిన్నువాలయింపఁగ నేలా."
(౫, ఆ. ౩౫౨)

8. 'మొకమోట' ఇది మొగమాటకు రూపాంతరము సంకోచమని యర్థము.

"— మొక, మోట దరిద్రత్వమునకు నోగిఁ బోత్తరయ్యెన్."
(౬, ఆ, ౫౫)

9. 'మొగమిచ్చుమాట' యు నపూర్వము, నిందుఁ బ్రయుక్తమును.

"మొగమిచ్చుమాటల కేల చేల్పడితి భూపాలతిలక."
(౩, ఆ. ౧౦౯)

10. 'గరవడు' 'అనఁగా గర + పడు = గడ్డకట్టు' అని యర్థము. ఇదియు నపూర్వమే.

"కరఁగు వెన్నఁడు లేక గరవడ్డ లేమంచు దెచ్చియున్నతముగాఁ
దీర్చి రొక్కొ."
(3. ఆ. ౨౧౫)

భోజరాజీయము నిర్దుష్టమగు కావ్యరత్నమనియు నిం దనంతామాత్యుఁడు బహునియమానుసారియై పరమ మాధు ర్యోపేతమగు కవితామృతమును జూఱయిచ్చినవాఁ డగుట నాతఁ డమృతకవి తల్లజుఁ డనియు నాతని 'భోజరాజీయము' సహజసుందరకవితాధార, సలక్షణప్రయోగ బాహుళ్యము, సద్విషయమూలము, గల సత్కృతి యనియు సారాంశము. ఈకృతి యాంధ్రకథానక కావ్యములలో నగ్రగణ్యమై తన రారుచున్నది.

---

## 3. వైయాకరణుని కావ్య గౌరవము

ఆంధ్రభాషాయోష సమూల్యాభరణములతో నలంకరించిన కవితల్లజులలో ననేకు లనంతశాస్త్రజ్ఞులు, అష్టభాషాపరిపూర్ణులు, అఖండమేధానిధులు కలరు. వారు వారి యభిమానశాస్త్రములలోఁ గడుంగడు నిష్ణాతులై యుండియు సర్వసమర్థులగుటఁ గావ్యకళాదర్పణమునఁ బ్రతిబింబించుచుండుటాయాశాస్త్రాభిమానుల కానందజనకముగను, సామాన్యజనులకుఁ గొంచె మేవగింపుగను గానవచ్చుచుండుటసహజము. ఎవ్వ రేవిధముగ నెంచినను భాషామాతకుమాత్రము వారి కృతులు విలువగల నగలే యగుచున్నవి. ప్రస్తుతము కవిశిరోభూషణమను నహోబలపండితీయమును రచించిన యహోబలపతి గొప్పవైయాకరణుఁడు; బహుశాస్త్రజ్ఞుఁడు. అతఁడు "కవిమహోపాధ్యాయభట్టారక, అభినయనన్నయభట్టారక" బిరుదాంచితుఁడు. అంతతోఁ దృప్తిపడక 'కాళిందీకన్యాపరిణయ' మను నొకప్రౌఢ కావ్యమును రచించి యాతఁ డాంధ్రసారస్వతమునఁ జక్కనికీర్తి గడించియున్నాఁడు. పరమ వైయాకరణుఁ డగు నాతని పాండితీవిభవ మిందుఁ బలువిధముల విజృంభించినది. కాని, యాతని యభిమాన శాస్త్రమగు వ్యాకరణము కూడ నింకెట్టికల్పనల కాలవాలమైనదో, యెంతటి ప్రభావము నాతని కావ్యకళపైఁ బఱపినదో స్థాలీపులాకన్యాయమునఁ గాంచి యానందించుటకే యీవ్యాసముద్దేశింపఁబడినది.

ఈతఁడు రచించిన సత్కవిస్తుతిలో "ప్రాణివర్ణక లబ్ధగ్రంథన్యాసాయ, సరళపరుషాయమహస్మహాత్ స్థిరమయాంధ్ర, వాగ్గతకర్త భూకవి వాగ్వినేత" యను శబ్దశాసనుని బలుకుటలో నీతని వ్యాకరణశాస్త్రాభిమానము విదితమగుచున్నది. ద్వారకాపురమునందలి కరీంద్రములను వర్ణించుసందర్భమున—

"వాచకశబ్దములో పరసిమాత్రముచే నిలసిల్లు వాచ్యతన్
దోచిలు మానఁ బ్రాకృతత గుణ్యముగా కసదాగ్ర గిరిగా
నొచితి గా దటంచు మది నారసి గోపగమాత్రకంబు
లోచి వసించు సద్వారి సమూహము బెరాన్వితమగు కరీంద్రముల్."

అనియు,

"ఊకారంబు సవర్ణదీర్ఘయుగళీ యుకారంబు గావింపఁగ
జోకన్ బ్రహ్స్వముఖ స్వరాంకములఁ దా సూత్రంబున వ్యాకృఁగా
వ్యాకర్త మునిమద్వృచ స్వగణి సుత్రేం బిస్పృటన్ విహాసనం
చాకారాకృతి త్రిప్రకారముగ బ్రహ్మోయం గాలవిద్యాంసముల్."

అని కాలవిద్యాంసముల ప్రమోదమును ద్విత్వయాశ్వాసమునను జమత్కరించి కవి సంస్కృతవ్యాకరణ సంప్రదాయమును, దానిపైఁ దన యభిమానమును జక్కఁగా వెల్లడించినాఁడు.

నారదుని యాగమనము వర్ణించు సందర్భమున—

"సంగతతత్పురుషపద నిష్ఠానువృత్తి వలగాదు పాణినీయం బనంగ
సిద్ధసాధ్యవిశేషబుద్ధ స్వరూపతఁ బ్రాకృత వ్యాకృతిఫక్కి యనఁగ
జ్ఞాతాత్మకీర్తి నిగూఢతాంజనాత్మత సాధ్వలంకృతి విశేషం బనంగ
సరళస్థిర కళాప్రశస్తి సద్భావత సరసాంధ్ర శబ్దశాసన మనంగ

సరగుదెంచెను నారాయణాభిధాయ
కాష్టవర్ణ మనూత్తంస కాభిధాన
చతురచతుర స్వరస్వర స్వరవిశేష
హారమహాతికరుండు శుభాకరుండు."

అని పాణినీయమును, ప్రాకృతవ్యాకరణాదులను, మఱియొకచో—

"ప్రకృతి ననుసరించి పరగును జగతిలో
వికృతి యిద్ది వింత నెలఁది యందుఁ
బ్రకృతి నడచి వికృతి ప్రబలమై కనుపట్టె."

అని ప్రాకృత వ్యాకరణమును వినుతించెను. ఈవిధముగా వ్యాకరణాభిమానాభి నివేశము లీతని కావ్యమునఁ బ్రవేశింపక మానినవి కావు. మఱియుఁ బూర్వోక్తమగు "సరళస్థిరకళాప్రశస్తి సద్భావత సరసాంధ్ర శబ్దశాసన మనంగ" అనియు,

"గుణవృద్ధు లగుచు రాజిలు
ఫణిరాజశయాను బొమలు పరికించునుగా
గుణిగణము వక్రమే యిది
గణుతింపఁగ వక్రతమమె కా యిది యనుచున్."

అని యాంధ్రవ్యాకరణ సంప్రదాయములను జేర్కొనియున్నాఁడు. మఱి యహోబలపండితీయమున "సంధ్యభావోపి న దోషాయ" యని యహోబలపతి నిర్ణయించిన వాఁడగుటచే—

"అమరువిద్యున్మాల యగును దనూయష్టి
మత్తేభగతి యగు మంజుపదము
అల భుజంగ ప్రయాతమై యారు దనరు"

మున్నగుచోట్ల విసంధితఁ బాటించి, యది దోషము కాదని తన సూత్రమును బలపఱుచుకొనుటకై కేళివనవర్ణన వ్యాజమున-

"అమితధ్వని వైచిత్రియుఁ
గ్రమహీనత్వాదిదోష రహితము వని కా
వ్య మనఁగఁబరగ నసిద్ధో
పమత విసంధితయు గుణతఁ బరగ నరిదిగఁజా."

అనియును, మఱియొకపట్టునఁ గాళిందీకన్య చనుదోయి వర్ణించుచు-

"కలయఁ బ్రసాద మొప్ప నధికస్ఫుటమై మధురత్వ మొందఁ గో
మలపరుష స్వభావ పటుబంధము మీఱ సమస్తభూషణా
వలులు దలిర్ప సద్వరస వాసితఁ గావ్యమునాఁ జెలంగు నె
చ్చెలి చనుదోయి క్లిష్టతను జేకొని మానుదునో విసంధితన్,"

అని చక్కఁగాఁ జమత్కరించి వాక్యాంత పాదాంతముల విసంధి దోషముగాఁ బాటింపఁ దగ దను భావమును వెల్లడించి తన యభిమతసూత్రమునకుఁ దన కావ్యముననే ప్రామాణ్యమును జూపి తరువాతి వారి కీ విషయమున దోషములేదని చాటియున్నాఁడు.

ఇదేవిధముగా నహోబల పండితీయమునఁ గల "సంస్కృతసమాసాంతస్థిత స్యాచోపి క్వచి త్సంధిః" అను సూత్రమును బలపఱుచుచు, తత్సమాచ్ఛులకుఁ జాలచోటుల సంధికార్యము చేసినాఁడు. "పారలేక సరస తెడలక", "వ్యాక. ర్త్రాముని", మున్నగు తావు లిందుల కుదాహరణములు.

ఉత్తమపురుషైకవచన నకారసంధికిఁ గూడ నహోబలపండి తీయమున "ఉత్తమ పురుషేతు 'ప్రాయస్తు స్యాత్క మాదిక స్యేతః' ఇతి సూత్రేణ సంధిః :- చేసితి నచ్యుతార్చనము = చేసితచ్యుతార్చనము...ఇత్యాదౌ విభాషేతి ప్రయోగతో వగంతవ్యమ్" అని వ్రాసియుండుటచేఁ దనకావ్యమున నీసూత్రముఁ బాటించి-

"అంతరమా తమంబు బలు పాఱుప నేఱుపు గల్గె నాకు నే
కాంత మనంతమా నదయ మండి తనంతపదంబు గంటి..."

మున్నగుచోట్ల నిట్టిప్రయోగములు తనకు సమ్మత మగుటఁ జాటినాఁడు. మఱియుఁ దా నహోబలపండితీయ మున"...ఏతేన 'రాయంచకాళ్ళఁ దాలకయమున్న' ఇత్యాది కవిప్రయోగానాం నకించిద ప్యసామంజస్య మితిధ్యేయం" అని రల యతి నంగీకరించి "లలితవైఖరి గనియు నబ్రంబుగాఁగ" అనియు, మఱి యితరస్థలములను నీయతి వాడి వ్యాకరణ సంప్రదాయములను, వానికిఁ దాను భావించిన నిర్ణయము లను బూర్వాపరవిరుద్ధరహితముగఁ దన కావ్యమునఁ జాటి నిజవ్యాకరణశాస్త్రాభిమానమును వ్యక్తీకరించియున్నాఁడు.

ఇంతేకాక యహోబలపతి తన కావ్యమునఁ బలుతా వుల సమయమును బురస్కరించుకొని తన యభిమానశాస్త్ర మగు వ్యాకరణముపై ననేకాభిప్రాయములు వెల్లడించి యున్నాఁడు. శరత్కాల వర్ణన సందర్భమున :

"ప్రకటితకాశాకాశా వికలసవర్ణత శరత్తు విదితంబయ్యెక్
వికృతికిఁ బ్రకృతిత్వముగొని ప్రకృతికి వికృతిత్వమొందు భావన్నగుచుక్".

అని పలికినాఁడు. ఈతఁడే కాళిందీకన్యచుక్కబొట్టును జక్కఁగ వర్ణించుట ప్రశంసార్హము.

"ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి
ప్రాకృతాఖ్యకభాష నా భావిత ద్వి
రేఫవైఖరి గలిగి త్రిలింగదేశ
సూక్తి యననొప్పఁ గస్తూరిచుక్కబొట్టు."

అని బుధులు మెచ్చఁ బలికి ప్రాకృత త్రిలింగదేశ సూక్తికిఁ జుక్కబొట్టుఁ బెట్టి కవి నిజముగా శ్లాఘ్యుఁడైనాఁడు. ఈ విధముగ భాషావ్యాకరణ శాస్త్రములను వర్ణనలలో సమ్మిళితముచేసి సహృదయ హృదయారవిందములఁ జూఱ గొనుట సామాన్యకవికి సాధ్యముగాని పని. ఇట్టి వానివలన నీ వైయాకరణుని కావ్యగౌరవ మినుమడించిన దనుటలో సందియములేదు. ఇదే విధముగ నీతని బహుశాస్త్ర పరిజ్ఞాన మీ కావ్యమున విదితమగుచున్నది. ప్రకృతాంశమగు నొక్క వ్యాకరణ విషయమే యిట సంగృహీతము. అహోబలపతి యీ వ్యాకరణాభిమానము తుదకు శ్రీకృష్ణుని కాళిందీకన్యా సమాగమసందర్భమున నామె కుచోపగూహాన సమయమునఁ గూడఁ బరుషసరళ పదప్రయోగమున సే వర్ణింపఁ జేసినది.

"పరుషంబులగుటఁ గుచములు
సరళంబులు గాకయున్న సఖి చిత్రంబే
స్థిరములగుచున్న వజ్రము
పరమాణు సమానమధ్య పరికింపంగన్."

ఇట్లని యహోబలపతి రచితమగు కాళిందీకన్యా పరిణయమున బహుసత్కావ్యలక్షణములు గలవు. కాని, వాని

యన్నిటికన్న మిన్నగా వైయాకరణ సార్వభౌముఁడగుట వ్యాకరణాభిమానము ముద్దగట్టి కొన్నిపాళ్ళధికమై సామాన్యు లగు రసజ్ఞులకుఁగొంత యేవగింపు కలిగింపక మానదు. ఐన నది యాతని దోషము కాదు. వ్యాకరణాభిమానులగు సరజ్ఞు లకిదియు ముదావహము. వివిధాభరణాలంకృతమగు నాంధ్ర మాత కిదియు విశిష్టభూషణమే కాఁగలదు. ఇంతకు నహో బలపతి కభిమానపురుషులు నన్నయాథర్వణులు. వారిలో నన్నయ.

> "ప్రకృతి యుగంబు దీర్చు ముని వర్యులకున్ సముఁడైన పుణ్యునిన్
> వికృతికి శిక్షగాఁగఁ బద విద్య రచించినవాని నంధ్ర వా
> క్ప్రకటకవిత్వ కల్పతరు రాజము బీజము సర్వవాక్యశా
> సకబిరుదాంక (నన్నన) విచక్షణ చంద్రుఁడు"

మఱి యథర్వణాచార్యుఁడో? వికృతి వివేకము గన్న వాఁడు, మహర్షి తుల్యుఁడును. అగుటఁ బైరీతి నహోబలుని వ్యాకరణాభిమానము సాహిత్యస్ఫోరక మేయైనదని సంతసింప వచ్చును.



# ౪. తెనాలి రామకృష్ణుని తమ్ముఁడు

అష్టదిగ్గజములలో నొక్కఁడై యపూర్వకవితావిశే
షమున నాఱితేఱినవాఁడై పాండురంగాది సత్కృతులు రచిం
చిన తెనాలి రామకృష్ణునకు నించుమించుగా నంతటివాఁ
డగు నొక్క తమ్ముఁ డుండెనన్న సంగతి చాలమంది యెఱుఁ
గనిది. దీనికిఁ గారణము రామకృష్ణుఁడు ప్రౌఢకవియగు నొక
తమ్ముఁడు తన కుండెనని తన కావ్యములఁ గాని, మహాకవి
యగు రామకృష్ణుఁడు తన యన్న యని యాతమ్ముఁడు తన
కావ్యమునఁ గాని తెలుపుకొని యుండకపోవుటే. మతవిష
యికమగు వైమనస్య మిట్లు తెలుపుకొనకపోవుటకుఁ గార
ణము కావచ్చును. కాని, యుపలబ్ధములగు ప్రమాణముల
ననుసరించి రామకృష్ణకవి కొక తమ్ముఁడు గలఁ డనియు,
నాతఁడే యన్నయ యనియు నిటఁ దెలిసికొని యాతని శృం
గారకావ్యమగు సుదక్షిణాపరిణయమును స్థాలీపులాకన్యాయ
ముగఁ బరిశీలించి యానందించుట ప్రకృతవిషయము.

తెనాలి రామకృష్ణుఁడు :

"కౌండిన్యమునిరాజ మండలేశ్వరవంశ, పాథోధి నవసుధాభానుమూర్తి
పాలగుమేలేశ పదపయోజద్వయీ, ధ్యానధారణ సముదాత్తచిత్తు(ఁడు)
మానితోయాతయామానామ భావిత, విపులమహాయజుర్వేదవేది
రామేశ్వరస్వామి రమణీయ కరుణావి,శేషపోషిత విలసిత సమగ్ర
సహజసాహిత్య మాధురీ సంయుతాత్మ(ఁడు)
రామధీమణికిని బుత్త్రి(ఁడు) ... ..."

(ఉద్భటారాధ్య చరిత్రము)

సుదక్షిణాపరిణయకర్త యగు తెనాలి యన్నయ :

"నవ్యసుగుణాభిరామ తెనాలి రామ
పండితాగ్రణి సత్పుత్త్రి(ఁడు) ...
హరపదాంభోజసౌముఖ్యుఁ డన్న పాఖ్య(ఁడు) ..."

(సుదక్షిణాపరిణయము)

ఏతత్కావ్యగద్యమునందును "శ్రీమత్తెనాలి రామేశ్వర శాశ్వతకృపాకటాక్షలక్షిత కవితాభిరామ రామయపండితకుమార సహజశైవాచారసంపన్న ధీమదన్నయ నామధేయ ప్రణీతంబైన ..." అని యున్నది. ఈతని గురువు పాలగుమి భీమగురుఁడు. ఈపై రెండిటినిబట్టి రామకృష్ణకవియు, నన్నయయు నన్నదమ్ము లని తెలుచున్నది. ఒక్క గురుని విషయమున రామకృష్ణకవికి "పాలగుమి యేలేశ్వరుఁడు"ను, అన్నయకు "పాలగుమి భీమేశ్వరుఁడు"ను గురువులని చెప్పఁబడినది. ఇది యంత బాధకము గాదు. ఏలేశ్వర భీమేశ్వరు లొక్కరైనఁ గావచ్చును. లేదా యన్న దమ్ములు గావచ్చును. కాని, కొండవీటి రెడ్డిరాజుల కాలమునఁ గల "పాల్గుమి శ్రీకంఠగురోః పంచాక్షరీమంత్ర పౌనరుక్తస్య..." మున్నగు శ్లోకములు గల శాసనము ననుసరించి పాలగుమివా రారాధ్యులు, శైవాచార్యు లనియుఁ దెలియుచుండుటచేఁ బాలగుమి యేలేశ్వర భీమేశ్వరులు శైవాచార్యులు తెనాలిరామకృష్ణునకు నన్నయకు గురువు లనియు మాత్రము స్పష్టముగాఁ దెలియుచున్నది.

మఱియు, తెనాలి రామభద్రుఁడు రచించిన "ఇందుమతీపరిణయము"లో రామభద్రకవిని గుఱించి కృతిపతి యిట్లు నుడివినట్లు గలదు :

"ప్రౌఢి మీపెదతాత పాండురంగాది స
త్కృతులు చేసెను రామకృష్ణసుకవి
అనుజుఁ డన్నప్ప మీపినతాత రచియించెఁ
బరగ సుదక్షిణాపరిణయంబు ... "

(ఇందుమతీ పరిణయము)

అదికాక, కవి యీ కావ్యమునందే యిష్టకవిస్తుతిలో—

"... కవితాఘనతామహు మత్పితామహున్
రామయరామకృష్ణకవిరాజుఁ దలంచి నుతించి మ్రొక్కెదన్."
"తదను సంభవమణిని సుదక్షిణాప
రిణయ ముఖ కావ్యరచనాధురీణు నాంధ్ర
కవి కదంబము లోనఁ బ్రఖ్యాతిగన్న
యన్నప కవీంద్రు ధీసాంద్రు నభినుతింతు."

(ఇందుమతీ పరిణయము)

అని యుండుటచే నింక నిస్సంశయముగా రామకృష్ణుఁడు, అన్నయ యన్నదమ్ములని చెప్పవచ్చును.

ఈ తెనాలి యన్నసత్కవి—

"పలుకులకల్కి కప్పురపుఁ బల్కులు చల్లిన రీతిఁ బండువె
న్నెలతళుకుల్ విధుండు హావణించిన మించున శంబరారిచెం
గలువలతూపుఁ గోపుల ముఖాముఖిఁ జూపిన యేపునం గృతుల్
పలుకఁగ నేర్చు పూర్వకవి పద్ధతి..."

ఈ వాక్య మీతని సుదక్షిణాపరిణయకావ్యము పట్టున నన్వర్థమయ్యె నని చెప్పవచ్చును.

మఱియు, నీతనిఁ గృతిభర్త—

సరససాహిత్య సౌహిత్యపరత నీవు
పరిఢవించు సుదక్షిణాపరిణయంబుఁ
గీర్తి విలసిల్ల మాకు నంకితము సేయు
తేటయగు వాగ్విలాసంబు కోటిసేయు"

నని యర్థించినాఁడు. కావున, అన్నయకవిత్వ లక్షణములలో, పూర్వకవి పద్ధతిని సరససాహిత్యసౌహిత్యములు పరిఢవించుటయు, తేటయగు వాగ్విలాసము వెలయుటయు ముఖ్యములు.

పూర్వకవిపద్ధతిఁ బల్కిన యన్నయ కవిత్నము నవీన పద్ధతులపైఁ గ్రొత్తపోకడలు పోయిన యాతని యన్నయగు రామకృష్ణుని కవిత్వమునకుఁ దీసికట్టయినది. ఐనను, నాతని 'సత్కవి' నొనర్చుట కుపరించినది. పూర్వకవి పద్ధతు లెట్లవలంబించినాఁడో వివరముగ నెఱుఁగుటకంటె, అష్టాదశవర్ణనములతోఁ బూర్వసత్కవులను బాగుగనే యనుకరించి సత్కవి కాఁజాలినాఁడని సంతసించి, విశిష్టమగు నాతని "తేటయగు వాగ్విలాసము" నరయుటే ప్రస్తుతము సమంజసమగును.

"అపరంజి బలుగట్టు యతిమనంబుల గుట్టు
విల్లుగా నిల్లుగా వెలయునతని
పెడవిల్తు మైచాఁదు విమధిఁ బుట్టిన చేఁదు
పూఁతగా మేఁతఁగా బొదలునతని
గమలజు తలపాలు గబ్బి బెబ్బులితోలు
కోరఁగాఁ జీరఁగాఁ గొఱలునతనిఁ
గొండఁబుట్టిన కల్కి గొప్ప మువ్వొన్న మల్కి
యాలుగా వాలుగా నలరునతని."

(౧ ఆ. ౧౧౬)

మఱియు :

> "సిద్ధరసంబు పెంజెలమ యాదలమింటి
> చెలమఁ దాల్చిన యఘుచ్ఛేదకుండు
> త్రవ్వి పెట్టిన పెన్నిధానంబు పెన్నిధా
> నముల వానికిఁ గూర్చు ప్రమథభర్త
> ముంగొంగు పైఁడి యామునఁ బైఁడి మలరాచ
> వారి విల్లుగఁ జేయు వారణారి
> గీము ముంగిటి చందమామ సన్నపుఁజంద
> మామ మాళి ధరించు మదనహరుఁడు
> కొలుచు వారికి గాదెలోఁ గొలుచు; భక్త
> సురభిమతులకు దొడ్డిలో సురభి..."

(౧ ఆ. ౧౧౭)

ఇందు కవి వాగ్విలాస సౌష్ఠవమేకాక హరపదాబ్జారాధనానందము వెల్లివిరసినది.

శివపార్వతులు కపటవిప్రదంపతులై యంశుమంతుని కడ కరుదెంచినపిమ్మట శివుఁడా రాజన్యునకుఁ దన్నెఱింగించు సందర్భము వ్యంగ్యమర్యాదతో మర్మగర్భమగు శ్లేషతో, సత్యమగు వాగ్విలాసముతో నొప్పారుచున్నది చూడుఁడు :

> "నాపేరు శంభుమిశ్రులు ;
> నాపాఠము విద్యలెల్ల; వనజాసనుఁడున్
> నాపాటి గాఁడు ; దిక్కుల
> నోపికఁ జరియింతుఁ గాని యొకయూరెఱుఁగన్.

> "పెనుగొండ నిలుతుఁ దఱచుగ
> మనసెనసి ధనాఢ్యుఁ డొకఁడు మముఁగూడుక రాఁ
> జనవున సకలజనంబులుఁ
> బని సేయఁగఁ గొదవలేని బలగముతోడన్.

"తామరతంపర సంపద
   యేమని వచియింతు నట్టి యిలుదీర్పంగా
సామర్థ్యము గలిగిన దీ
   కోమలి ధైర్యమున రాతికూఁతురు సుమ్మీ.

"తనయుల నిద్దఱిఁ గాంచితిఁ
   గనికర మిఁక నేల దైవఘటనకు మరువై
చనియె నొకరుండు వెనుకన్
   వెనకయ్యాయు గృహము విడిచి వీటేఁడియయ్యెన్."

(౨ ఆ. ౨౮, ౨౯, ౩౦, ౩౧)

ఆ కపటవిప్రుఁడే తనముదివయస్సును నిందించుకొను పట్టున, అన్నయ వార్ధక్యవర్ణనము మిక్కిలి సరసముగ నున్నది.

"అంగ సంగత పూర్వశృంగార కాంతి సా
   మగ్రి పలాయన మంత్రవిద్య
కాంతాకటాక్షవీక్షణ శరవ్రాతంబుఁ
   గడకు నొత్తెడు మూసకట్టుమందు
చిత్తసంభవుని కెంజిగురుంగటారిఁ బై
   నాడంగనీని వజ్రాంగిజోడు
తారుణ్యాభరమదోదయ సమున్నత సత్వ
   భద్రవేదండక పాకలంబు

మించుమూఖపంకజమునకు మంచువాన
యాత్మబోధ ప్రదీపంబు నార్పుగాలి
యలఘుగౌరవ కులశైల కులిశధార
కోఁతలకు రోఁత ముదిమి......" (౩-౩౮)

దైన్యచిత్తుఁ డగు నింద్రుఁడు దిలీపునికడ కేతెంచు సందర్భమున నాతని నన్నయ వర్ణించు వర్ణనము స్వభావోక్తియై యాతని వర్ణనవైదగ్ధ్యముఁ జాటుచున్నది.

"వాడినమోముతోడఁ గయి వ్రాలినచూపులతోడ దీనతం
గూడినపల్కుతోడ నెటఁ గూడని గందపుఁబూఁతతోడఁ గి
లూడిన యందెతోడ బిగి యూడిన తాలిమితోడ వచ్చెఁ గి
గ్గాడియుఁ బోలెఁ గామగవి గాఁడి గలయ్య......" (3-౪)

పూర్వోదాహృతపద్యమునందలి 'పలాయనమంత్రము' 'మూసకట్టుమందు' 'వజ్రాంగిజోడు' 'పంకజమునకు మంచు వాన' మున్నగు నానుడులు, పద్యమునందలి జిగిబిగి, తరువాత పద్యమునందలి పదరచనము అన్నయ కన్నయగు పాండురంగ విభుని పదగుంభనము, నౌచితీవిశేషము నీతనికిని గలవనుటకు సందేహము లేదనుటకు సాక్ష్యములు. మఱియు నీతని తెలుఁగునుడులు, ఈక్రిందిపద్యమునఁ జక్కఁగ విదితములు;

"తోట దొడ్డి యనెడిమాట లేకుండఁగఁ
గాలువక్రంతల క్రందడంగఁ
బైరుపచ్చలు లేక ప్రజలు నెమ్మదిఁ గుంద
నిల్లుముంగిలి యను టిల్ల గాఁగ
మానిసి మ్రట్లు గానిపించఁగనీక
పల్లెపట్టులు సివపాడుగాఁగఁ
బసరము పెయ్యల పస యొక్కడో చనఁ
జెట్టుచేమల యునికిపట్టు వదల." (౪-౫౭)

ఈవిధముగా అన్నయసత్కవి తేటయగు వాగ్విలాసమునకు నెన్నో యుదాహరణము లీయవచ్చును. మొత్తము మీఁద సుదక్షిణాపరిణయకర్త యగు తెనాలియన్నయ తెనాలిరామకృష్ణుని తమ్ముఁడనియు, నన్నకు మిన్నగాక పోయిన నెన్నికగన్న సత్కవి యనియు, నీతని "తేటయగు వాగ్విలాసంబు కోటిసేయు" నని తెలిసికొనుట కీమాత్రము చాలును.



## ౫. గోపరాజు కవితామృతము

ఆంధ్రవాఙ్మయచరిత్రమునఁ బదునైదవశతాబ్దాంతమున వెలువడిన యుత్తమోత్తమ కావ్యములలో సింహాసనద్వాత్రింశిక యొకటి. ఏతత్కృతికర్త యగు కొఱవి గోపరాజు మహాప్రతిభావంతుఁడు. ఈతని కున్న యొక్క గొప్పవిశేషమువలన నీతని కావ్యము సారస్వతమునఁ జిరస్థాయియైనది. ఈతఁడు ప్రాచీనులలోఁ బ్రాచీనుఁడు; ఆధునికులలో నాధునికుఁడు. అనఁగా నీతఁడు పూర్వకవుల కవితారీతులఁ బుణికిపుచ్చుకొని ప్రజ్ఞాపాటవముతో జోడించి యనుసరించి యభ్యుదయరచయితల కభ్యుదయరసయిత్రియై వెలుఁగొందినాఁడు. ప్రాచీనాంధ్రకావ్యసాంప్రదాయికమైన యష్టాదశవర్ణనములతోపాటు బల్లి, నల్లి, చేఁప, పక్షి, క్రిమి, కీటకము, చింతపండు. బెల్లము, నల్లము మొదలగునవే కాక కడుపులోని యాఁకలి, కంఠములోని బాధ, పుట్టఁబోవు బిడ్డ, అప్పుడే పుట్టిన బిడ్డ, బిడ్డయొక్క బొడ్డు, బొడ్డుయొక్క కోఁత, ఉగ్గు, ఆముదము, ఒకటేమి సృష్టిలోఁగల సమస్తవిషయములను బహు చమత్కృతితో నీతఁడు వర్ణించియున్నాఁడు. అట్టి మహాకవియగు గోపరాజు కవితామృతముఁ గ్రోలుటకు మున్నాతని కవిత్వరీతుల నరసి స్థాలీపులాకన్యాయమున నవి యెట్లు పరిణతి నందినవో పరికింతము.

కావ్యవిమర్శమునకుఁ బ్రధానములు సరసత్వము, కవితాదరణము. ఇవి లేనినాఁడు కాళిదాసాదులును విమర్శ

కుని దృష్టికి, నాతని పరీక్షకుఁ డాళలేరు. ఈవిషయమునసే గోపరాజు —

"ఆదరణంబులేక చెడనాడిన బాణమయూర కాళిదా
సాదులకైనఁ దప్పుగల దన్యుల కేమిటి చెప్ప ..."

నని పలికినాఁడు. మఱియు, నేభావమైన "నిది బాణో చ్ఛిష్ట" మని తీసివేసియు, నేకావ్యమైన నిది యాంధ్రీకరణమే యని యేవగించియు సుకవిత్వము నైన నరసికులు నిందించు టాకాలమునఁ బరిపాటి యైపోయినదికాఁబోలు. ఈవిషయ ములను దెలుపుచు వీని కీవిధమున గోపరాజు సమాధాన మిచ్చుచున్నాఁడు.

"సుగుణులం 'బాణోచ్ఛిష్టం
జగత్త్రియ' మ్మనఁగఁ గొంత చదువఁగఁ బ్రియమే
తగఁ దోడంటిన పాలిం
పుగఁ బెరుఁగయి యున్న నది యభోజ్యంబగునే?"
"సంబంధములగు రసభా
వంబులు మునుకంటె నభినవంబులు గలవే
యంబుధిసె కాక బహుర
త్నంబులు వర్తకుల కేమి తాఁ బండినవే?"

యని ప్రశ్నించి, యిఁక సంస్కృతకావ్య మాంధ్ర మున కనువదించి మెప్పించుట సామాన్యమైన విషయము కాదుసరికదా యదియే ఘనత యని పలుకుచున్నాఁడు. అది యెట్లన:

"... విలుకాఁడు తూఁటుగా,
నేసిన నంచె పాఱ మఱి
యేసినవానిదె నూటి కావునన్."

భాషావిషయమున నీతఁడు తనయభిప్రాయము నిట్లు తెలిపినాఁడు :

> "తెలుఁగునఁ జేటుగాఁ గథలు చెప్పినఁ గావ్యము పొందు లేదు మె
> త్తన పస చాల దంద్రు; విశదంబుగ సంస్కృతశబ్దమూఁదఁ జె
> ప్పిన నవి దర్భముం గ్లసుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
> దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్."

అని సంస్కృతాంధ్రముల జోడించి కావ్యము చెప్పెదనని యాప్రకారము కావ్యమున నడచుకొనెను. హరిహరాంకితము గావించిన తన కృతిలోఁ గృతిపతి వర్ణనముల పట్ల నొక్కయెడఁ జక్కని సంస్కృతసమాసములతో హరినో హరునో వర్ణించుచు మఱియొకచోటఁ దెనుఁగుదేశిని దేట తెల్లముగ మృదుమధురముగా వర్ణించియుండుట నాయా తావులఁ గననగును. కాని, సంస్కృతముపై కంటె నీతనికిఁ దేటతెనుఁగుపైనే మిక్కుటమగు మక్కువ గలదని కావ్య పరిశీలకులకు గోచరించును. ఆవిషయముఁ గవియు సంస్కృత భాషలో—

> "పలుకుతెఱుంగుచోఁ బదవి భాగము నన్వయ మర్థముంచు నీ
> మలకలకంటె నందుల సమర్థము తేటతెనుంగ యొప్పు నా
> కొలఁది ప్రియంబుగాదె చెఱకుల్ దినుకంటె రసంబు గ్రోలినన్."

అని వక్కాణించినాఁడు.

కవి సర్వజ్ఞుఁడై యుండవలెనని యితని నియమము. శబ్దజాలముల నిర్వచన స్థితుల నెఱిఁగి, యెప్పుడేది ప్రస్తుతమో యప్పుడా మహిమ మచ్చుపడునట్లు సర్వజ్ఞుఁడై

రచించు కవియే సత్కవి యనఁబడును. మొత్తముపై గోప రాజు తన కవిత్వమును—

"పదిలముగ మృదులవచనా
స్పదపదసంపదల రసము పద నిడి ... "

రచించు నని ప్రతిజ్ఞఁ బూని కృతకృత్యుఁడైనాఁడు.

ఆయా యావర్ణనములు గల తావులందు గోపరాజు కనఁబఱచిన సర్వజ్ఞత్వము, పదములయందలి మృదులత భావములయందలి నూతనత్వము, రసమునందలి మాధు ర్యము, వైచిత్ర్యముగాఁ గని గ్రోలవచ్చును. విజయపాలుఁ డను రాజు వేఁట కరుగునపుడు కలిగిన దుశ్శకునములు :

"పిల్లులు పోరాడె బల్లు లూరక త్రుళ్లె
దమ్మళి పొడసూపెఁ దుమ్మి రెదురఁ
దొఱఁగు వోయిన లేఁగ కొఱలుచు నొకకుట్టి
పఱతెంచెఁ గ్రంపపై నఱచెఁ గాకి
యులుమఁ డొక్కఁడు నూనెతలతోఁడ నేతెంచె
మైలచీరలఁ జాకి మ్రోల నెదిరెఁ
గాకియును గొరవంకయును జెక్కలపోఁతు
నేటిరింతయు దాఁటె నెడమదిశకు"

ఈవిధముగ నింక ననేకములగు దుశ్శకునవిషయము లను సవివరముగాఁ దెలిపినాఁడు. ఏవిషయవర్ణనమునైనను దాని లోఁతుపాఁతులను స్పష్టముగా వివరించును. ఈరీతినే యడవిమృగములు, చేఁపలు మొదలగువాని నామములెల్ల నుగ్గడించి వర్ణించుటలో నీతని సర్వజ్ఞత్వము గోచరము.

మృదుమధుర పదరచనమున కీతని కావ్యమంతయు నుదాహరణమే యనవచ్చును! ఈతని మాటలు అమృతపు టూటలు; కపురపుమూటలు. చూడుఁడు. గంగావర్ణనమున—

"ఒకని యడుగుఁ జేరి యొకని యాదల యెక్కి
యొకని వెంట వచ్చి యొకనిఁ గలిసి
వెడలి పోఁగి తనుచు విందు మట్లయ్యె నీ
జీవనంబు లోకపావనంబు."

ఇందలి వ్యంగ్యమర్యాద, శ్లేష, రసమాధుర్యము సహృదయానుభవైకవేద్యము. మఱియు—

"మున్నీటిపాపయు మున్నీటితేపయు
నిల్లాలు నిల్లునై యొసఁగువానిఁ
బాములపగవాఁడుఁ బాములవగవాఁడు
దేరును బాన్పునై తేరువానిఁ
గలువల చుట్టంబుఁ గలువలవెట్టంబుఁ
దనరెండు కన్నులై తనరువానిఁ
బూవింటివాఁడును బూవింటివాఁడును
గారాపుసుతులుగాఁ గలుగువాని

జోడులేని కంటిజోగికి జోడుగా
నున్నవానిఁ బెక్కు మన్నవానిఁ
తల్లిదండ్రియైన నల్లనివేల్పును
కంట చెడని ముక్తిపంట గాదె

ఇందలి పదముల సౌకుమార్యము ప్రశంసనీయము. అష లీకని విషయునిగదనమే విశిష్టరసాలవాలము. మృదుమధురధోరణి యీతని సొమ్ము. ఉదాహరణములకు, నాచి

త్యమునకు నీతఁడు దడవుకొనవలసినపనిలేదు. క్షుణ్ణముగ సాదృశ్యముగల విషయముల నీతఁడెన్నే నేకరుఁబెట్టఁగలఁడు.

"జూదరిసత్యంబుఁ జోరుని ధర్మంబు
సరసుని కోపంబు సవతిపొత్తుఁ
బాషండు మతమును బ్రాహ్మణుకలహంబు
దులువసంగడమును ఖలుని తపముఁ
గులటల భక్తియుఁ గోమటి నిజమును
బడ్యాంగనల ప్రేమ పందబిరుదుఁ
బగతుర సైరణ యొగచు వైరాగ్యంబుఁ
బేదపెద్దతికము వాదిధనము

నధమసంశ్రయంబు నైంద్రజాలికమును
బొమ్మసొమ్ము మునుఁగకొమ్మ పట్టు
మంత్రిలేని రాజ్యమహీనుయౌ నావేళ
సుస్థిరములు పిదప నస్థిరములు"

ఈ తుదిపాదములోఁ గల సొగసు, అనంత మగు భావము నూహ్యములు గదా. గోపరాజునకుఁ గల బోధకతాశక్తియు నిరుపమానము. ఈతఁ డీవిషయమునఁ దిక్కన్న కన్నయో, పిన్నయో యన్న నతిశయోక్తి కాఁజాలదు.

"మును దనకుం గానున్నది
పనివడి యగు నారికేళఫలరసముక్రియన్
జనన్నున్నది చనుఁ గరిగ్ర
స్త్కన మ్రింగిన వెలఁగపండుగుంజును బోలెన్"
"కోటులు గలవాని గోళ్లులు గలవానిఁ
గొమ్ములు గలవాని నమ్మవలదు"

"కలిగి పెట్టలేక కష్టుఁడై యున్న దు
ర్గుణుని పాపమునకుఁ గొలఁది లేదు
తన్నుమానియైన ధర్మంబు చేసిన
యతని పుణ్యమునకు నవధి లేదు."

ఇట్టి వన్నియు సాభిప్రాయములు. సానఁబెట్టిన కొలఁది మెఱుఁగెక్కు రత్నములవలె నిట్టిపద్యములు పఠించినకొలఁది నూతనభావముల ననుభవమునఁ జూపఁగలవు.

గోపరాజు తక్క నాంధ్రసారస్వతమున నింతవఱకుఁ జింతపండును గావ్యములలో వర్ణించినవారు లేరు. హాస్యరస పోషణముతో పాటితని చించావృక్షవర్ణనము సరసమై సహృదయులఁ దలలూఁపింపఁజేయుచున్నది. ఈవిధమగు మనోహర వర్ణనములు ప్రాచీనకావ్యముల మిక్కిలి యరుదు. చింత పంటి ప్రభావముఁ గనుఁడు.

"చింత మదిలేక మనుజులు
చింతించిన కొలఁదిఁ జవులు చేకూర్చుచు ని
శ్చింతులఁగా నొనరించెడు
చింతన సరిగలదె లోకచింతామణికిన్."

"ఈచింతపంటి సరిగా
నోచెల! యమృతంబుఁ జెప్ప నొప్పునె దానిన్
వాచవి గొని తమజిహ్వల
సేచవులంను లేక చెడరె యింద్రాదిసురల్."

ఏ యభ్యుదయకవి యిట్లు వర్ణించినాఁడు? మఱియుఁ జింత శబ్దవ్యుత్పత్తిఁ గనుఁడు.

"భ్రాంతిపడి కల్పవృక్ష
ప్రాంతంబునఁ గూడుఁ గూర్కుఁ బట్టక సురల
శ్రాంతంబు దీనికై మదిఁ
జింతించుటఁ జేసి పరగెఁ జింత యనంగన్."

మఱియు :

"ఉడుపతి తనలో నమృతము
గడలుకొనియుఁ బెక్కుచవులు గానక కృశుఁడై
విడిచిన కళలన్నియు నీ
గొడిసెల రూపమునఁ జింతఁ గొలువఁగఁ బోలున్."

"వెస నిర్మించిన బ్రహ్మకు
రవితుఁడు మ్రొక్కుడుచు ఫలము రంజిల్లఁగ ష
డ్రసములలో నిది నమలెడు
దెసఁగని నోరూరు నాదిదేవునకైనన్."

ఇంకను వేయేల ?

"గరితలేని యిల్లు దొరలేని తగవును
జింతపండులేని వింత చవియుఁ
జనవులేని కొలువు శశిలేని రాత్రియు
ముక్కులేని మొగము నొక్కరూపు."

ఇట్టి మధుర హాస్యరసాలవాల మగు సుకవిత యేరి కింపొనగూర్పదు ?

గోపరాజు 'ప్రసూతివిజ్ఞానము' నీతని సర్వజ్ఞతఁ దెలుపఁగలదు. గర్భవతియైన కాంత కేపిల్లపుట్టునో లక్షణములఁబట్టి చెప్పఁగల దిట్ట యీతఁడు.

"ఇంతి మదిఁ దలఁకుచు నెడమప్రక్క నిదిగో
మెదలె ననుచుఁ జెప్ప సుదతు లంతఁ
జంటి జిగురు గోర సంధించి చిరజీవి
యైన సుతుఁడు పుట్టు ననఁగఁ బొంగు."

పుట్టిన నిసువుయొక్క బొడ్డుఁ గోయుటఁ గనుఁడు :

"నిసువు బొడ్డుమీదఁ బసిఁడి టంకం బిడి
యొయ్య నాభినాళ ముత్తరించి
ముత్తియములఁ జేట ముంచి యం దిడి కను
దమ్ములందు సమ్మదమ్ము నిగుడ."

"కలిఁ దోచి నూనెఁ ద్రేలిడి
తల పుట్టియయందు నేతితైలంబును జో
త్తిల రాచి మెత్తఁగాఁ బొదు
గలరించి కుమారు నునిచి రాదాదు లటన్."

ఈవిధమగు వర్ణనముల పట్లను, నితరనములను గూడ దేశితెనుఁగునే వాడి తన యభిమాన మాభాషఁ జూపి యున్నను, దన ప్రతిజ్ఞ ప్రకార మితఁడు సంస్కృత పద ప్రయోగముల సైతము తన పాండితీ గరిమ, నైపుణ్యము ననంతముగఁ జూపినాఁడనుట కొకటిరెం డుదాహరణములు చాలును :

"రుచిరస రోలంబరోలంబ కలకంఠ
కలకంఠకులవృత కలకలంబు
బంధూకబంధు సౌగంధకగంధి ని
కేతన కేతకీ కేతనంబు
పరిభూత భూత పపంచాస్య పంచాస్య
నాగేంద్ర నాగేంద్ర భోగభూమి
సేక సముత్సేక శీకర సూకర
కాసారకాసార భాసురంబు

చలపలాశపలాశ రసాలసాల
తాల హింతాల శితలోత్తాల తలము
మృగమృగాదన మృగశాఖి మృగమయంబు
వింధ్యవనము ... ... ... ... "

"పర్వతపథమున రథమును
బర్వస్త్రీసంగమమున బ్రాహ్మవ్రతముక్
గర్వమున ధర్మకార్యము
నుర్వీభాగమున నావయుక్ నడవ దనా"

ఈ రీతిగా గోపరాజుభయభాషాపైదుష్యమును జూపి తన కావ్యమున కమరత్వమును సంపాదించుకొనియున్నాఁడు. పూర్వకవితామర్యాదల నేమఱక యనుసరించియు నవీనవర్ణనములను జొనిపి యభ్యుదయమున కాయువుపట్టగు దేశి తెనుఁగునకుఁ గల విశిష్టతఁ గనిపెట్టి తద్భాషోచితపోషణమునఁ దన కావ్యమును రస సంపద్విభాసితమగు మృదుమధురపదయుతము నొనర్చిన గోపరాజు మహాకవి యగుట నిస్సంశయము. పరమపూజ్యభావముతోఁ బరమేశ్వరాంకిత మొనరించి హరిహరాభేదమును సూచించుట హరిహరరూపి యగు నాదిమధ్యాంతరహితు నాతనితోపాటు మనమును స్మరించి కృతకృత్యుల మగుట మనవిధి :

"కన్నులయ్యును బండికన్నులయ్యును జంద్ర
సూర్యు లెవ్వని కడ సొంపు గనిరి
సుతుఁ డయ్యు రథముపై సూతుఁ డయ్యును సుర
జ్యేష్ఠుఁ డెవ్వనికడ శ్రేష్ఠుఁడయ్యెఁ
దల్పంబునయ్యు నాకల్పంబు నయ్యు నా
గేంద్రుఁ డెవ్వనికడ నెన్నఁ బడియెఁ
బదమయ్యు మస్తకాస్పదమయ్యు నాకాశ
మధ్య మెవ్వనికడ మహిమకెక్కెఁ
నట్టి యుభయమూర్తి హరిహరనాథుండు
దేవదేవుఁ డిష్టదైవ మగుచు
నెరయఁ బ్రోచుఁగాత !... ..."

## ౬. ఆంధ్రసంవాదకావ్యములు

ప్రాచీనాంధ్ర కావ్యములయందు సంవాదకావ్యము లను విభాగమింత వఱకెవరును జేసియుండలేదు. కాని విషయ విమర్శనమున కనుగుణముగా నుండుటయును, కొన్ని కావ్య ములు ప్రత్యేకముగా నీవిభాగముక్రింద వచ్చుచుండుటచేతను ప్రకృతవిభాగము సంగతమేయగును. కాని, సాధారణముగా మనయాంధ్ర పురాణేతిహాసములందును, గావ్యములయం దును గూడఁ గవి ప్రతిభావ్యుత్పత్తులు ద్యోతకములగుటయును, పఠితల హృదయము లుప్పొంగుటయును సంవాదములే యాయుఃపట్టు లనవచ్చును. భారతమునందలి యత్రి గౌతమ సంవాదము, సత్యాద్రౌపదీసంవాదము, కపిలగోసంవాదము, ఇంద్రబలిసంవాదము మున్నగునవి పఠితృలోకమునఁ జిర స్థాయిగా నిల్చుట కిదియే కారణము. మఱియు భాగవతము నందలి కపిలదేవహూతి సంవాదము, ఉద్ధవకృష్ణ సంవాదము, అవధూతయదు సంవాదము మున్నగునవియు, మనుచరిత్ర మందలి ప్రవరవరూథినీ సంవాదము, ఉత్తరరామాయణమం దలి రంభారావణసంవాదము, కళాపూర్ణోదయమందలి సత్య రంభా మాయారంభాసంవాదము, నిట్టే యితరప్రబంధము లందలి యాయాయీ సంవాదస్థలములు విశిష్టరసాలవాల ములై విలసిల్లుచున్నవి.

పురాణయుగ కవులకును, ప్రబంధయుగారంభ కవుల కును జిత్తవృత్తులు, నాదర్శములు వేఱుగా నున్న కారణ మునఁ గేవల సంవాద కావ్యములు రచింపకపోయినను నా యాత్మావుల మాత్రము వారు తమ శక్తి సామర్థ్యములను నిరుపమానముగనే ప్రదర్శించియున్నారు. ఇఁకఁ గేవల సం వాద కావ్యములుగాఁ బేర్కొనఁదగినవి రాధామాధవ సం వాదము, కృష్ణార్జున సంవాదము, గౌరీసంవాదము, సత్య భామాకృష్ణ సంవాదము, లక్ష్మీనారాయణ సంవాదము, చోరసంవాదము, రామలక్ష్మణ సంవాదము, మున్నగునవి. వెలిదిండ్ల వేంకటపతి రచించిన రాధామాధవ సంవాదమును గేవల సంవాదకావ్య మనుటకన్నఁ బ్రబంధమనుటే మేలు. ఆ కథనే శృంగారరాధామాధవ మనుపేరఁ జింతలపూడి యెల్లనార్యుఁడు, రాధికాసాంత్వన మనుపేర ముద్దుపళనియు రచించియున్నాడు. మిగిలినవన్నియుఁ గేవల సంవాద కావ్య ములే. అందు లక్ష్మీనారాయణ సంవాదము, చోరసంవా దము రెండును బదునెనిమిదవ శతాబ్దమునకుఁ జెందిన గోకుల పాటి కూర్మనాథకవికృతులు. ఇఁకఁ గృష్ణార్జున సంవాద మును రచించిన పోచిరాజు వీరకవియు, రామలక్ష్మణ సంవా దమును రచించిన సీతారామకవియు, దక్కినవారును దరు వాతి వారు.

దీనిని బట్టి యాంధ్రసంవాదకావ్యము లన్నవి పందొ మ్మిదవ శతాబ్దారంభమున బయలుదేఱినవని చెప్పవచ్చును.

మంచివో, చెడ్డవో ప్రత్యేకస్వతంత్ర కావ్యములుగా రచింపఁబడిన వీనికి వాఙ్మయమున స్థానమేమైనఁ గలదా, లేక క్షుద్రకావ్యములుగా నివి నశింపవలసినవా ? యని పర్యాలోచించుటకుఁ బ్రకృతము కూర్మనాథ కవికృత సంవాద కావ్యద్వయమే యిట గృహీతము.

ఈ రెండు కావ్యములును విష్ణుభక్తి ప్రతిపాదనములు. అందు మొదటిదగు లక్ష్మీనారాయణ సంవాదము శృంగార రసప్రధానము. విలాసార్థము వనవిహారమున కేఁగి తిరిగి యాలస్యముగ వచ్చిన నారాయణునకు నాతనిరాక యందలి విలంబమునకు క్షణమొక యుగముగాఁ గడిపి నిరీక్షించుచు నెంతసేపటికి నాతఁడు రాకపోవుటచే విసిగి వేసారియుండి తుద కాతఁడు రాఁగానే యాతనితో లక్ష్మికి జరిగిన సంవాదమే యీకావ్యవిషయము.

ఆనారాయణుఁడు :

"తన మనస్సంకల్పవనరాశి కబ్జజాం
డములు లీలాబుద్బుదములు గాఁగఁ
దన కథాజ్యోత్స్నకు సనకాది ఘనయోగి
సముదయంబులు చకోరములు గాఁగఁ
దన దివ్యతేజోగ్ని కనలహారిత్తురం
గములు పటుస్ఫులింగములు గాఁగఁ
దనదు మాయా వినూతన తిరస్కరిణికిఁ
బ్రాణికోటులు సాలభంజికలుగ

వలరు జగదీశుఁ డభినుత జాగ్రత కేశుఁ
డాది మధ్యాంతరహితుఁ డాహ్లాదహేతు
వప్రమేయుండు జలధరశ్రీప్రకాయుఁ
డమరరిపుమర్దనుండు జనార్దనుండు."

ఆతఁడు లక్ష్మి నొంటి వీడి విలాసవిహారమున కేఁగి భక్తులతో వారొసఁగిన కానుకలతోఁ దిరిగి లక్ష్మికడకు వచ్చి యవి యన్నియు నామె కర్పించినాఁడు. ఆమెకుఁ గావలసిన వవి కావు. ప్రియాగమ విలంబనమున నామెకుఁ బిచ్చి యెత్తినది. దానికిఁ దో డాజగన్మోహనాకారుని యొడలెల్ల నామెకు జారచిహ్నములతో నిండినట్లు కనవచ్చినది. నారాయణుని యొడలిపైఁ గల గురుతుల నెన్నుచు నిదియేమి, యది యేమని యడుగును. జగన్నాటక సూత్రధారుఁ డన్నిటి కన్నియు నిర్దోషిగా సమాధానమిచ్చును.

"సతుల కీల్జడలంట జవ్వాదిగా దిది
యడవిఁ జెంచు లొసంగునదియె కాని
కాంతల చనుదోయి కస్తూరి కా దిది
యాత్మభక్తు లొసంగునదియె కాని
గజగామినుల లొసంగు గంధంబు గాదిది
యల మౌను లర్పించునదియె కాని
వెలఁదుల సెజ్జల విరుల వాసన గాదు
మఘవ పూజితకల్ప మహిమగాని."

ఈవిధముగ నెన్నియో చెప్పును. కాని ఆరమాదేవికి సంశయము తీఱదు. ఆ వాతెఱపలుగంటేమియని యడుగును. ఆతఁడును—

"నను వెలిపింపఁగాఁ దలఁచి
  నవ్వుల కంటివి గాక నీవెలుం
గని పలుగంటు నాకెచటఁ
  గల్గె సమస్తమునీంద్ర దేవతా
జనములఁ బ్రోవ రాక్షసులు
  చంచల మందగఁ బాంచజన్య మొ
త్తిన నధరంబుపై కెంపులు
  దేఱె నయార మొయారి చూడవే."

అని జవాబిచ్చును. మఱియు శ్రీదేవి నారాయణుని కన్నులఁ గల వీఁపుఁ జిన్నెలు, వాలెఱఁ గాటుకవన్నె, చెక్కిలిఁ గస్తూరిసిస్తు, ఉరమునఁ గర్పూరపుఁ గూర్పు నెట్లు వచ్చిన వన నాతఁడవి భాగ్యవిధాన రత్నరేఖలనియుఁ, గౌస్తుభ రత్నకాంతి యనియు నేమేమో చెప్పును. లచ్చికి నచ్చదు. సాక్షులను గొని వచ్చినఁ గాని నమ్మదఁట. అతఁడు చెప్పిన సాక్షు లామెకుఁ బనికిరారు. అంత నారాయణుఁడు శాస్త్రపద్ధతిఁ బ్రమాణమొనర్చెద నని యందులకై "జలములఁ జొత్తుఁ గుంభగతసర్పముఁ బట్టుదు దీప్తవహ్నిలో వెలఁగొని నిల్తు నెట్టి ఘనవస్తువుతోఁ దులదూఁగియుండెదన్" అని పల్కును.

"కడలేని వెడగు పాల్కడలిపైఁ బవళింపఁ
  గల నీకు జలముపై నిలుచు టెంత?
కళల రాజిలు వేయితలల కుండలిమీఁదఁ
  బండు నీ కొక పాముఁ బట్టు టెంత?

అతి పరమాణు కృశానల తేజంబు
　　వెలయు నీ కగ్ని ప్రవేశమెంత?
కడుపులో జగములు గల నీకు నెట్టి వ
　　స్తువుతోడఁ దగఁ దులఁ దూగు టెంత?

అని త్రోసిపుచ్చును. ఇఁక లాభము లేదని నారాయణుఁడు—

"ఏహి విలసన్నితంబే దేహి ముదం పదవినమ్ర దివిజకదంబే
మోహిత శుకోష్ఠబింబే పాహి."

అని బతిమాలును. వెంటనే లక్ష్మి కటాక్షించి నారాయణుని వామాంకముఁ జేరును. నారాయణుఁడు లక్ష్మీనారాయణుఁ డగును. జగములు ప్రీతి నందును.

ఈవిధముగ నిందలి కథావస్తువు పవిత్రమైన లక్ష్మీనారాయణుల ప్రణయవిషయము. అందుచేతనే శ్రీరామతీర్థాది దేవస్థానములలోఁ బ్రతిసంవత్సరమును బుష్పయాగోత్సవమునందర్భమున లక్ష్మీనారాయణసంవాదమును స్వామి కభీష్టముగాఁ బారాయణ మొనరింతురఁట. ఇందలి కవితయు రసవంతమై హృదయంగమముగా నున్నది. అందుచే నిది యొక చక్కని ఖండకావ్య మని పేర్కొనవచ్చును.

రెండవదగు చోరసంవాదము పన్నిద్దరాళ్వారులలో నొకఁడును, "పరకాలుఁ"డను బిరుదాంకితుఁడు నగు తిరుమంగయాళ్వారుల చరిత్రము. ఈతఁడు చోళరాజునకు సామంతుఁడై యుండి యొకపరి కారణజన్మమందిన యొక త్రిదశ

వేశ్యను — కుముదవల్లి యనునామెను - వివాహమాడఁ గోరెను. ఆమె పెంపుడుతండ్రి యగునొక వైష్ణవుఁడు "ఒక సంవత్సరపరిమితకాలము ప్రతినిత్యము నష్టోత్తరసహస్ర సంఖ్యాకులైన వైష్ణవోత్తములఁ దనుపుచు నారాధింతువేని నాకూఁతును నీకిచ్చి వివాహమొనరింతు" నని నియమ మేర్పఱచెను. అందుల కంగీకరించి తిరుమంగయాళ్వారు తన రాజ్యమును సమస్తమును వ్యయపఱచి వైష్ణవసమారాధన మొనరించెను.

తుదకు—

"ఇంటిలోనున్న సొమ్ములు చెల్లిన వైష్ణ
  వారాధనాపేక్ష నాఘనుండు
నీలికాసె బిగించి డాలుకత్తి ధరించి
  కేల విల్లమ్ముల లీలఁ దాల్చి
దొంగ బంట్లకు నెల్ల దొరయయ్యె ఘోరకా
  భూరికాహాళములం భోరుకోనఁగఁ
ద్రోవలలోఁ గాచి దొరల సంపన్నులఁ
  దెలిపాటుగొని కొట్టి తెచ్చినట్టి
నవధనంబు సహస్రవైష్ణవుల కనుది
నంబు సంతర్పణము చేయు"

నాపరమవైష్ణవుని భక్తితాత్పర్యము లరయుటకై నారాయణుఁడు లక్ష్మితోడను, పరివారసమేతుఁడుగను బయలుదేఱి తిరుమాంగయాళ్వారు దారులుకొట్టు వనమునకు సాయంసమయ మగుసరికి వేంచేసెను. ఆచార్యాగ్రణియు

దూరమున నాపరివారమును జూచి లక్ష్మీనారాయణులను నూతన వధూవరులనుకొని విచ్చలవిడి తన తోడిభటులతోఁ గొల్లగొట్టెను. తుదకు తిరుమంగయాళ్వారు విష్ణుసైన్యము నకుఁ బట్టువడి లక్ష్మీనారాయణులకడకు వచ్చి నిలువంబడెను. నారాయణునకు, నాతనికి జరిగిన సంవాదమే యీచోర సంవాదము. ఆచోరనాయకుఁడు జగదీశ్వరుఁడగు హరియే తనకు రా జనియు, వైష్ణవాగ్రణులే తన కాప్తులనియు నా రాజు వెన్నదొంగ కనుక, 'యథారాజా తథాప్రజ' యన్నట్లు తాను దొంగయైనట్లును, దన యాప్తులు విష్ణుపదమును గొల్ల గొన్నవారగుటఁ దానును వైష్ణవార్చనకై ధనవంతులఁ గొల్లగొట్టుచుంటి ననియు నివేదించుకొనెను. తుదకు స్వామి యాతనిఁ గటాక్షించి లక్ష్మీసహితముగా నాతనికి నిజరూప మునఁ బ్రత్యక్షమై యాతని భక్తికి మెచ్చి వర మొండుఁ గోరుకొమ్మనుటయు, నాతఁడు——

> "కమలామనోవినోదములు పాపాపనో
> దములైన నీదుపాదములె గొలుతు
> తాపత్రయీవిభేదములై నిరస్తభే
> దములైన నీదు పాదములె గొలుతు
> కరుణాబ్జకృత వివాదములు భక్తి ప్రమో
> దములైన నీదుపాదములె గొలుతు
> వేదాంత నూపుర వితతనాదములు శ్రీ
> దములైన నీదు పాదములె గొలుతు."

ననియు, నంతకన్న మిన్నయగు వరమున్నదే యనియుఁ దన నిష్కామభక్తిని వెల్లడించినాఁడు. శ్రీహరి

యు, నంతతో విడువక యేదేని వరము కోరుకొనక తప్ప దనఁగా "తావక దాసదాసజనదాస్యం బిచ్చి రక్షింపు"మని కోరినాఁడు. అంత విష్ణుమూర్తి యాతని కోరికయను గ్రహించి దీవించి సపరివారముగా నదృశ్యుఁడగును. తిరుమంగయాళ్వారును ధన్యచిత్తుఁడై నిరంతరాయమానముగా వైష్ణవార్చన మొనరించుచుఁ గుముదవల్లిని బరిణయమై యాదర్శగృహస్థ రత్నమై మని తుదకుఁ బరమభాగవతపదమును జూఱగొనెను.

ఇట్టి భక్తిప్రభావవిలసిత మగు నీ ఖండకావ్యమును శ్రీరామతీర్థాదిక్షేత్రముల స్వామివారి కళ్యాణసమయములఁ జోరోత్సవమునాఁడు నేఁటికిని బఠించుచుందురఁట. "ప్రప న్నామృత" మను వైష్ణవపురాణమునఁ బేర్కొనఁబడిన—

"తదాప్రభృతి వేదాంతిన్ హరిణాంగీ కృతం భువి
పరకాలకృతం హ్యేతద్ధనాపహరణోత్సవం
సర్వస్థలేషు సర్వత్ర చోత్సవేష్వ శ్వవాహనే
అత స్సర్వేశ్వర స్సర్వస్థలేషు చ మహోత్సవే
తురంగ వాహదివసే కృపయా భక్తవత్సలః
సర్వస్వదానమద్యాపి కరోతి కలివైరిణే
ఏవం చోరోత్సవం చిత్రం యే సేవంతే నరోత్తమాః
తేషాం రంగేశ్వర శ్శీఘ్రం సుప్రసన్నో భవిష్యతి."

అను గాథ ప్రస్తుత తిరుమంగయాళ్వారుచరిత్రమే యని స్పష్టము. ఈవిధముగాఁ గవి "చోరసంవాదమును" భక్తితత్త్వ పతిపాదకముగాఁ జిన్నస్వతంత్ర కావ్యముగా రచించినాఁడు.

వీనిని బట్టి పందొమ్మిదవశతాబ్దారంభమున బయలు దేఱిన సంవాదకావ్యము లనుచిన్నకావ్యములు పరిమితిలో నేమి, పరిణతిలో నేమి ప్రాచీనకావ్యముల కేవిధముగ నీడు గాకపోయినను నీచోరసంవాదమువలె భక్తభగవత్సంభాషణ రూపముగనో, జగదాధారులగు జగన్మాతాపితల సంభాషణ రూపముగనో (గౌరీసంవాదము, రాధామాధవ సంవాదము, లక్ష్మీనారాయణ సంవాదము, మున్నగువానివలె), ప్రియ మిత్ర సంభాషణరూపముగనో (కృష్ణార్జునసంవాదమువలె) యున్న స్వతంత్ర ఖండకావ్యములు నిర్దిష్టప్రయోజనమున కుద్దేశింపఁబడి యుండెనని గ్రహింపవచ్చును. ఈ కావ్యశాఖ యంతగా విస్తరింపకనే వెనుకఁ బడినది.

పరిణతహస్తులగు కూర్మనాథాదులే యీశాఖకుఁ బ్రాణముపోసి వన్నె గన్నవారు.

---

# ౭. సాంబోపాఖ్యానము

ఆంధ్ర సాహితీమాత నపూర్వకావ్యభూషణములచే నారాధించి యఖండయశ మార్జించిన కవిరాజులలో సుత్తమ శ్రేణికిఁ జెందిన రాజకవి రామరాజు రంగప్పరాజు. ఈతఁడు నిఖిల విద్యావిధాన మగు విద్యానగరమనునే విజయనగర రాజులకు సామంతుఁడు, బంధువునై 'సాంబోపాఖ్యాన' మను నైదాశ్వాసముల యద్భుతప్రబంధమును రచియించి విజయ నగరరాజులే కాక వారి సామంతులు, బంధువులు కూడ విఖ్యాతకవీశ్వరులై వెలసియుండి రన్న విషయమునకుఁ దార్కాణ మగుట విశేషములకెల్ల విశేషము. ఈతఁడు క్రీ.శ. ౧౫౫౦ ప్రాంతమువాఁడనియు, శ్రీకృష్ణదేవరాయల కాలమున కించుక చిన్నవాఁ డనియు శ్రీ కట్టి సాంబమూర్తి శాస్త్రిగా రేతత్కావ్యపీఠికలో సోదాహరణముగాఁ దెల్పి యున్నారు. కావున, నాంధ్రసారస్వతమున విశ్రుతప్రబంధ యుగమునకుఁ గడపట బయలువెడలిన యీ 'సాంబోపాఖ్యానము' నందలి విశేషముల మాత్రము దిక్ప్రదర్శనముగా నిట సంభావించుట కీవ్యాస ముద్దేశింపఁబడినది.

### కథావిధానము

శ్రీకృష్ణునకు జాంబవతియందు జనించిన సాంబుని చరిత్రమగుటచే నీకావ్యమునకు 'సాంబోపాఖ్యాన' మను పేరు కలిగినది. కాని, యిందే ప్రారంభమున శ్రీకృష్ణుని

బాల్యక్రీడలు, పరాక్రమము, ద్వారకాపురవర్ణనము, రుక్మిణీ కృష్ణుల శృంగారక్రీడలు, ప్రద్యుమ్నజననము, సత్రాజిత్తు తపశ్చర్య, స్యమంతకమణి వృత్తాంతము, జాంబవతి పరిణయము, మున్నగు వివిధ వృత్తాంతములు సమకూర్పఁబడినవి. అందుచే నీకావ్యకథ శ్రీకృష్ణ సంబంధియగుట పరమ పవిత్రము. ఈకావ్యమును శ్రీరంగపతికిఁ గృతియిచ్చి కవి ధన్యచరిత్రుఁడగుట మఱియొక విశేషము. ఈరాజకవి :

"రంగప్పరాజు వైష్ణవ పుంగవ పూజావిధాన పూతాత్ముఁడ శ్రీ
రంగపతికి నొనరించెద మాంగలికతర ప్రచారమణి హారంబున్"

అనియే తన్ను గుఱించి చెప్పుకొనియెను. దీని ననుసరించి కవి విశిష్టాద్వైత మతానుయాయి యైనను బరమత సహానమునను, గవితావైభవమునను గృష్ణరాయనికి దీటు రాగలుగు టిందు విస్పష్టముగా గానవచ్చును.

## కవితారీతి

రంగప్పరాజు ప్రాచీనదైవతములపైఁ బరమభక్తిగలిగి తన కావ్యమును బరమేశ్వరాంకిత మొనర్చినట్లే ప్రాచీన కవితల్లజులపైఁ గల పరమతాత్పర్యమున నాయాకవుల పోకడలనే పుణికి పుచ్చుకొని తన కావ్యకన్యకను దీర్చిదిద్దినాఁడు. అస లాతని ప్రతినయే యిది :

"అభివందన సహాస్ర మమరించి నన్నయ
భట్టుమార్గము కొంత పరిఢవిల్లఁ
దిక్కన మఖినూక్తి ఫక్కిక యొక కొంత
పెనుపొంద నెఱ్ఱనప్రెగడ ఫణితి

యొక కొంత తిలకింప నొకకొంత నాచన
సోమగీర్విభవంబు సొగసు మీఱఁ
ద్రిపురాంతకుని వచస్స్వనంబు నొక కొంత
కొఱల శ్రీనాథోక్తి కొంత నిగుడ

మఱియుఁ దక్కిన సుకవుల మధురవచన
రచనలును గొంత రాణింప రసనిబంధ
బంధురము గాఁగ నే నిచ్చు భవ్యకావ్య
హారమునకు గథాక్రమం బెట్టిదనిన"

ఈ కారణమున నుత్తమకవుల నుత్తమవిధమున ననుకరించి యుత్తమకవిత వెలయించుటయే యీకవి ప్రతిభయు, నీకావ్యవైశిష్ట్యమును. ఈతని యనుకరణకళావిభవ మాయా చోటుల నద్భుతముగా వెలివిరిసియుండుట పరిశీలింపఁదగును.

కృష్ణప్రీతి

రంగప్పరాజు కృష్ణభక్తుఁడు. కావుననే తన కావ్యశ్రేణి విస్తృత మొనర్ప నారంభముననే కృష్ణలీలలు వర్ణించినాఁడు. 'సాంబోపాఖ్యాన' మను నామమేల, శ్రీకృష్ణలీలల నింతగా వర్ణించుటేల యని యడుగ నాతఁ డవకాశమీయక—

"ఆ బృందావన వీథికావిహరణం
బా వాంశికావాదనం
బాబంధు ప్రియ కార్యనిర్వహణ మా
హంసోద్భవాఖేలనం
బాబిబ్బోక పతి సతీష్టతర నే
త్రాగ్ర ప్రసూనార్చనం
బాబాల్యోచితచర్య లీశ్వరున కా
హా యెంత యిష్టంబులో!"

యని చెప్పి తనదైవమున కిష్టమైన క్రీడలు తన కిష్టమగుటంగుశంకలు గల పాఠకుల కైన నిష్టమే యగునట్లు కవి వర్ణించుచు ననుక్షణ మాకృష్ణుని నిజరూపమును మనకుం జూపుచునే యుండును.

"కల మయ్యు మేటియేకల మయ్యు విలయాబ్ధిఁ
క్రీడింప నేర్చిన జాడవాని
ధన మయ్యు మోక్షసాధనమయ్యు నిజభక్త
జనములఁ బోషింపఁ జాలువాని
సవ మయ్యు విధులతాసవమయ్యు యాయజూ
కాచార ఫలదాత యైనవాని
ఘన మయ్యు నూత్మోపఘనమయ్యు నరుల నె
య్యది యామహిమ తాన యైనవాని"

నిట్లు కవి మృదుమధురఫణితి వర్ణించుటలో ననౌచిత్యమే లేదు. రసపుష్టి నొనగూర్చు వర్ణనాంతరములైనను గావ్యరస స్ఫోరకములే యగుఁ గదా !

అనుకృతి విశేషములు

ఆయావర్ణనముల పట్టునఁ బూర్వకవుల ననుకరించుచు స్వాతంత్ర్యమును వహించుచు నీకవి తనకావ్యమును రస బంధుర మొనర్చుట కొనియాడఁదగిన విషయము. ఋష్యా శ్రమ వర్ణనముపట్టున :

"దరి బట్ట జిఱుమీాల దఘు చంచువులు బట్టి
యొచట క్రౌంచలు నించు నేటినీటి
కేని కన్నులు గుట్ట గాన మంగలు దెచ్చు
వ్యాఘ్రికి నెచ్చట హారిణ గృహిణి

జరఠసింహమునకు గరదండ మెచ్చటఁ
  గైదండ నవరించు గరికలభము
పోఁగాఁడుపులుఁబాలు పొనుపు నెచ్చట నెమ్మి
  యపు డప్పు డవ్వని నహిశిశువుల
గదుపుఁ బెడఁబాయు ప్లవగపాకముల నెచట
నిండుమదిఁ బ్రోచుఁ దల్లియై కొండగోఁటియ
యట్టి పుణ్యాశ్రమస్థలి ... ... ... "

అనియు, శ్రీకృష్ణుఁడు తప మొనర్చు సమయమున :

"అభిషేకసమయ మాటరసి తీగలనుండి
  జోరునఁ బూదేనెసోన గురిసెఁ
గాషాయములు గట్టుకందువ పరికించి
  ప్రాఁకె సానుస్థలి రత్నరుచులు
భూతిఁ బూయఁగఁ బూనుపూనిక యారసి
  యలమె నేడాకు పొన్నల రజంబు
మానస బంధంబు మదిలోపల నెఱింగి
  సారంగ చర్మమై జలద మమరె
సకలలోకేశునకు గిరిస్థావరములు
జంగమంబులు దగు సేవ సలుపఁదొడఁగె."

నని వర్ణింపఁబడుటను నన్నయసోమనల ననుకరించియుఁ గవి స్వతంత్రించి రసస్ఫోరకత తన కావ్యమున కినుమడింపఁజేయుటయుఁ గాననగును. ఇదేవిధమున :

"కౌస్తుభచ్ఛాయయుఁ గంఠంబు కప్పను
  నైరికాంబుద సమాక్రాంతిఁ బెనుపఁ
గనకాంబరంబును గరటిచర్మముఁ ద్రుణ
  జ్యోతిర్వ్రణావృతిస్ఫూర్తిఁ బొదువ

వైజయంతియు భోగిరాజహారము హారి
తాళసానువు సురస్థలము గాఁగ
నెమ్మోము తేటయు నిటలాక్షదీప్తియు
వలగొను చంద్రార్కవలయములుగఁ
జేసి లీలకై నీల కైలాసయుగముఁ
గూడియుండినకైవడి జోడుగూడి
యుల్లసిల్లిరి రుక్మిణీ వల్లభుఁడును
వసుమతీధర నందినీ వల్లభుండు.”

అని సోముని యనుకరణమును ;

“వారణవల్లభావన సముత్సాహాయ
వారణదైత్య నివారణాయ
గోరాజభంజనోదార ప్రతాపాయ
గోరాజ వినుత సుగుణగణాయ
భోగీంద్ర శోషణాద్భుత పదన్యాసాయ
భోగీంద్ర మణిమయ భూషణాయ
పర్వతోద్ధరణ నిర్భర బలోత్తంసాయ
పర్వతావాస వైభవ పరాయ
యాదవేంద్రాయ పారిషదాధిపాయ
బర్హభూషాయ తారకాపతిధరాయ
నమ...... ”

అను తావున “అభ్రంకషంబైన యాలపోతు నితండు పెంచినాఁ డీతండు త్రుంచినాఁడు” అను సోమన పద్యాను కృతిని సంస్కృతీకరించి రచించుటయు నీతని యనుకృతికళా నిపుణతను జాటుచున్నవి.

మఱియు నిందలి యుద్ధవర్ణనములఁ దిక్కనయుద్ధవర్ణనము కన్నులఁగట్టిన ట్లగపడుచుండును. సాంబదుర్యోధనులయు, కర్ణసాంబులయు యుద్ధవర్ణనము తిక్కన ఫక్కిని మిక్కిలి యనుసరించి వన్నెకెక్కినది. ఇదే విధమున నెఱ్ఱన హరివంశ నృసింహ పురాణములకుఁ జక్కని యనుకరణములిం దెన్నని చూపవచ్చును. ఇవికాక, శ్రీనాథుని శృంగారనైషధచ్ఛాయలును బెక్కులిందుఁ గలవు. "అస్తినాస్తి విచికిత్సా హేతుశాతోదరిన్" అను శ్రీనాథుని 'అస్తివాదము మాన్పనసదు నెన్నడుమును' అను నీకవియనుకరణమువంటి యనుకృతులే కాక వైతాళికగీతములు, విందులు, మందేమేలములు మున్నగునవెల్ల చక్కని యనుకృతులు. ఇంతే కాదు. రామరాజభూషణుని యద్భుత కవితారీతు లెంత చక్కగా నిందుఁ దల దాచుకొన్నవో యీక్రింది యుదాహృతివలనఁ దేటతెల్లము కాఁగలదు ;

"అలయాలసవిహార మలయానిలాంకూర
సలయాహతరసాల వలయితంబు
కౌలాగురులతాళి లీలాగతకపాలి
బాలాగణ విహార లాలితంబు
గంగావనాభంగ భంగావళీతుంగ
శృంగాభి నిర్ఝరాలింగితంబు
భంగీతతోత్సేక సంగీత పరిపాక
భంగీతరంగిత ప్రాంగణంబు

కటక తట పర్యటద్యోగి కటకతనయ
కటసముత్కట దానశీకర సుగంధ
గంధవాహకిశోర సంఘాతముదిత
హరిదిభేంద్ర కపోలాళి యచలమాళి''

మతపరిజ్ఞానము, రాజనీతి

రంగప్పరాజు కావ్యారంభముననే 'వైష్ణవపుంగవ పూజావిధాన పూతాత్ముఁడ'నని చెప్పుకొనుటచేఁ దన వైష్ణవ మతసిద్ధాంతములఁ గూడ సందర్భోచితముగ వెల్లడించుటకు సిద్ధాంతదర్పణ గురుప్రసంగమును సృష్టించి తిరునాళ్ళయుత్స వాదికమును వర్ణించి కృతకృత్యుఁడయ్యెను. ఈ సిద్ధాంత దర్పణుఁడు కౌరవులకు, భీష్మద్రోణ విదురాదులకు సైతము ''మురారిపరమతత్త్వంబుఁ దెలిపి పంచసంస్కార సంస్కృతు లం గావించి యభిగమనోపాదాన విద్యాస్వాధ్యాయభక్తి ప్రకారంబులు సుధాకరకరపోషక భాగ్యస్వరూపంబులును స్వజ్ఞానప్రాపకప్రాప్యజ్ఞానంబును ఆనుకూల్య సంకల్ప ప్రాతి కూల్య వివర్జన భావిరక్షణ విశ్వాసగోప్తృత్వ వరణాత్మ నిక్షే పణ కార్పణ్యంబులును శరణాగత ధర్మంబుల మర్మంబులును భాగవతవాత్సల్యంబును బరమపూరుషు పూజానుమోదనం బును ... ప్రాకృత సంసర్గపరిత్యాగంబును మంత్రాసనస్నా నాసనాలంకారాసనశయ్యాసనంబు లను నవయంబులం గలుగు తిరువారాధనా మర్యాదలు నాదిగా గల పరమ వైష్ణవసిద్ధాంతములు బుద్ధిగోచరంబుగఁ'' జేయించుట వైష్ణ

వాచార్యులపైఁ గవికిఁ గల గురుభక్తి, తత్సిద్ధాంతములు బ్రకటింపఁబడినవి.

ఇదేవిధమున నీసిద్ధాంతదర్పణాని చేత నే, స్వయముగా రాజగు కవి రాజలోకశిఖామణి, అనఁగా కృష్ణరాయఁడు తన ప్రబంధమున నాచరణమునఁ జూపిన చక్కని రాజనీతులే సాంబునకుఁ జెప్పించి తన రాజనీతి పరతను, రాజధర్మమును నిర్వర్తించెను. ఆయా రాజనీతులు మృదుమధురఫణితిఁ జెల్పి సాంబుని నిజకార్యనిర్వహణమునకుఁ బురికొల్పిన సిద్ధాంతదర్పణుఁ డాధ్యాత్మికగురువే కాక రాజనీతివిశారదుఁడు నయి విజయనగరసంస్థాపకు డగు విద్యారణ్య మహాత్ముని స్మృతికిఁ దెచ్చుచుండెను.

"సామము దానము భేదము
నామీఁదట దండనియతి యనునయములలో
భీమప్రతాప లక్ష్మీ
వ్యామోహితులకును నాల్గవదియే యొప్పున్.

అరిఁ దఱితో నొకసింధు
స్ఫురణముమై నొత్తవలయు భూపతి చంచ
త్తర వారిధారఁ దద్బల
తరు మూలము లెల్లఁ బెకల దర్పము దివియన్.

అరి విత్తాహరణస్పృహ
ధరణీపతి కనుపఁ దగు సదా హృదయమునన్
వరవిద్యావరణాదృతి
పరిణతి విప్రులకుఁ బోలెఁ బౌరుషశాలీ!"

మున్నగు రాజనీతులేకాక మఱికొన్నిటిఁగూడ గాం తోపమాన సమ్మిశ్రితములుగ బోధింపఁబడుట గనఁదగును :

"అరి వర్గము సమరీతుచ
గిరి దుర్గము లెక్క బనుపు క్షితినాధున కి
ద్ధర దుర్గ చతుష్టయ సం
భరణము గావలె జయాను భావాయతికిన్.
వనితా ధరసుధ పలుసో
కున జారుపట్టించి ప్రియుఁడు గ్రోలుకరణి భూ
జనము మదిఁద్రాస మించుక
గనిపించుచు నొయ్య దివియఁగాఁ దగుఁ బతికిన్."

ఈవిధముగఁ జక్కని నీతులు బోధించుటేకాక వీర త్వము నెరపవలసిన సాంబుఁ డనుమానించుచుండఁగా నాతనికి రణప్రీతి గలిగించి మహోత్సాహమున విజృంభించి జయము వడయఁ బ్రేరేచిన యీక్రింది వాక్యములు మిక్కిలి ప్రశంస నీయములు. ఆధ్యాత్మవిధులేకాక ఆర్యధర్మప్రబోధకులు, వమయఁ మేతెంచినపుడు వీరాధివీరులై విజృంభించు మహా త్ములే మనప్రాచీనార్యవరులన్న విషయమునుఁ గవి స్మృతికిఁ దెచ్చుచున్నాఁడు. సాంబుని యుద్ధోన్ముఖుని జేయు నీ ప్రబో ధముఁ గనుఁడు :

"ఏల విచారము జయమున
భూలోక సుఖమ్ములెల్లఁ బొందఁగవచ్చున్ ?
వాలిక శరవిధి నీల్గిన
గేలుగమియు రంభ నృపతికిన్ గుశల మతీ !"

"సీరి పెదతండ్రి తండ్రి లక్ష్మీవిభుండు
సాత్యకి సుతుండు పినతండ్రి శంభుమాలు
బొందె వీవు రణాంగణ భూమి నిన్నుఁ
దాకి గెలుచునె దివిజ బృందంబులైన."

ఈ ప్రబోధమును విన్న సాంబుఁడు బయల్వెడలి విజయ లక్ష్మితోపాటు లక్ష్మణాకన్యను బడసి తండ్రికన్న మిన్న యైనాఁడు :

"హరి మును రుక్మిణీజలరు హోవన నోర్తునె తెచ్చెఁగాని యా
హరి తనయుండు లక్ష్మణ బ్రియాళియుతంబుగ వేగఁ దెచ్చి ట
ట్టరదము మీఁదఁ బెట్టి నది యట్టిద పుత్త్రుఁడు తండ్రికన్న ని
ర్భర బలశౌర్య ధైర్యగుణ భాగ్యరమన్ ఘనుఁడైనఁ జెన్నగుణ్."

ఈవిధముగ 'సాంబోపాఖ్యానము' ను గవిరాజగు రంగప్పరాజకవి యాంధ్రానుకృతికావ్యములలో నెన్నికగన్న దానినిగాఁ జేయఁగలిగెననుట సారాంశము. లోకవృత్తాను కృతియేకాక ప్రాచీనకావ్యానుకృతికూడఁ గావ్యధర్మములలో నొకటి యగును. కావుననే 'పూర్వకవీశ్వర వాక్ప్రయోగ దక్షత' సుకవిలక్షణములలో నొకటిగా నప్పకవి పేర్కొనెను. అందుచే నుత్తమకవుల యుత్తమాకృతులను స్వతంత్రరీతుల సమ్మిళితమొనర్చి కావ్యకర్తయై, ఋష్యాశ్రమమందలి శుక ములు సైతము వేదములుచదువు నన్నట్లు, శ్రీకృష్ణదేవ రాయల సామంతులు సైతము సత్కావ్యకర్త లన్నవిషయ మును రంగప్పరాజీప్రబంధమూలమునఁ జాటియున్నాఁడు.

## ౮. సంస్కృతనాటకకర్తలు - విషాదాంతరచన

జీవితము తద్వ్యాపారమును జూచునాతనికి విషాదకర మగను, దానిని విమర్శించి సారమును గ్రహించునాతనికి ఆహ్లాదకరముగను నుండునని యొక యాంగ్లోక్తి కలదు. ఇం దెంతయు సత్యమున్నది. విషాదసౌఖ్యములు రెండును జీవిత విమర్శను బట్టియు, సాధారణధర్మముల కధిక ప్రాధాన్యము నిచ్చుటచేతను గలుగుచుండును. విషాదము ముఖ్యముగా మూఁడు విధములు - బాహ్యము, మానసికము, కర్మసంజని తము. మొదటిది దౌష్ట్యముచేతను, రెండవది ప్రవర్తన చేతను, మూఁడవది కర్మచేతను దెలియఁబడుచున్నవి. ఇందు విషాదము ఆయాశక్తులను ప్రజ్వలింపఁజేసి, కారుణ్య, భయ ములనుండి యాత్మను పరిశుద్ధము చేయును. కనుకనే న్యాయ మున కన్యాయముతో సంఘర్ష సంభవించినపుడు కాక, న్యాయమునకు న్యాయముతోడనే సంఘర్షణ కలిగినపుడు విషాదము జనించునని హెగెల్ పండితుఁడు వక్కాణించి నాఁడు. ఈ సంఘర్షణమున న్యాయపరిమాణ మసమానముగా నుండును. కానినాఁడు ఆశ్చర్యమే జనించునుకాని విషాదము జనింపదు. ఇట్టి విషాదము భయోన్మీలిత మగునని కొందఱి మతము. అందుచే విషాదాంతనాటకము బాధాసమన్విత మగు పాపపుంజములను విశదీకరించి, మానవానుభవమును సమన్వయము చేయుటచే, అందచందములతో నలరారును.

ఈ విషయములను మన సంస్కృత నాటకములపట్ల సమన్వయించి చూడవచ్చును. మృచ్ఛకటికమునందలి తుది రెండంకములును మొదటి యంకములందలి విషాదపరిణామమును సౌఖ్యాంతముగా మార్చివేయుటకే అని తోఁచక మానదు. ఆనాటకమందలి నాయకుఁడగు చారుదత్తుఁడు తాను చేసిన మహాపాపములచేఁ గాక, ఒడలు తెలియని సుఖజీవనముచేతను, నిర్లక్ష్యప్రవర్తనముచేతనే ప్రతిఫలమనుభవించును. అతనికి వ్యతిరేకముగనున్న సుగుణముచేఁ గాక, అధికారమున నున్న యొక దుర్మార్గుని దౌష్ట్యముచేతనే యాతని కిక్కట్లు సంభవించినవి. నాయిక యగు వసంతసేనకు చారుదత్తునిపై అమితమగు ప్రేమకలదు. ఆతని మహోన్నతాశయముచే నాతఁడెట్టి త్యాగమైనను జేయ సిద్ధపడెనే కాని. పిఱికిపందవలె వెనుదీయలేదు. ఆతని యౌదార్యముచేతనే యాతని ధనమంతయు వ్యయమైపోయెను. ఆతని నిజవస్తువులన్నియు దొంగలపాలాయెను. ఇంతలో నాతఁడు తృణీకరించిన భార్యయే యాతనినిమిత్త మెట్టి త్యాగమైనఁజేసి, యాతని దారిద్ర్యమును బంచుకొన నిచ్ఛగించును. రాజుగారి బావమఱఁది కౌఁగిట బంధింపబడవలసిన యామె తప్పించుకొనును. కాని, హత్యానేర మామె భర్తపైఁ బడును. కర్మసముద్రమునఁ గొట్టుకొనిపోవు తృణమాత్రుఁడుగా మానవుఁడు వసంతసేనకు గోచరించును. ఇంతలోఁ జారుదత్తుని కుమారుని త్యాగబుద్ధిచే మన యౌదార్యము

జాలి వారిపైఁ బడును. ఇంతకు, చారుదత్తుని యదృష్టము ఫలించుటయు, హత్యానేరము తప్పుటయు సంభవించును. ఇచ్చట మానవావేశములపై కవి ప్రదర్శించిన కల్పనాపాటవము ప్రత్యక్షము.

పురాణకథలను నాటకములుగా వ్రాసినవానిలో కూడ నీవిధముగా నాటకాభివృద్ధిఁ గాంచవచ్చును. భాసుని "యూరుభంగము"న, భట్టనారాయణుని "వేణీసంహారము" న దుర్యోధనుని పతనము చిత్రింపఁబడినది. వీని యన్నిటి యందును విషాదాంతచిహ్నములు స్పష్టముగాఁ గాన్పించును. 'ఊరుభంగము' న దుర్యోధనుని తొడలు విఱిగినను నాతఁడు చింతింపలేదు. పాండవులు పరిపాలనార్హులు కారని యాతని యూహ. ఈ చిన్న నాటకము విషాదాంతము గావలసినది. కథానాయకునిపైని, రాయబారి శ్రీకృష్ణుని మీఁదను కవికిఁగల యౌదార్యము విస్పష్టముగా గోచరించుచున్నది. ఇందలి సంఘర్షణ న్యాయమునకు న్యాయమునకు నడుమనే. ధర్మమార్గమున నెందఱుక్షత్త్రియవీరు లాతని పక్షమున తుదివఱకు యుద్ధముచేసిరో మన కవగాహన మగును.

రామాయణమున సీతాదేవి యరణ్యవాసము కూడ విషాదాంతమే. కాళిదాసు రఘువంశకావ్యమునను, భవభూతి ఉత్తరరామచరిత్రము నందును రసయుక్తముగనే కథాగమనము జరిగినది. కాళిదాసు నుద్దేశము రామునిది తప్పు లేదనియే. సీతాదేవిని విడిచిపుచ్చుటలో నాతని మహా

త్యాగమే వెల్లడియగును. అది ఘనకార్యమే కాని స్వల్ప కార్యము కాఁ జాలదు. నిర్దోషిణి యగు సీతయుఁ దన జీవిత మున దాఁగియున్న యేపాపఫలమో యని నిశ్చయించు కొన్నది. ఇచ్చటి సంఘర్షణమును న్యాయమునకు న్యాయ మునకుఁ గలిగిన వైరుధ్యమే. ముందు జన్మమందును వియో గములేని రాముఁడే తన పతియగుఁ గాక యని సీత ప్రార్థిం చెను. లక్ష్మణుఁడు సీతను విడిచి రాఁగానే రాముఁడు దుఃఖ వార్ధి మునిగినాఁడు.

భవభూతి 'ఉత్తరరామ చరిత్రము' న నిది కరుణరస పూరితమై, సీతారాముల ప్రేమ మనోవాక్కాయ కర్మలచేఁ బ్రదర్శింపఁబడినది. త్యాగబుద్ధి రాముని హృదయమును కరఁగఁజేసినది. చంటిపిల్లవానివలె విలపించునట్లు భవభూతి రామునిఁ జేసి వైచినాఁడు. జరుగవలసినదాని నాతఁ డనుస రించెనే కాని రాముఁడు తదతీతుఁడు కాలేదు. సీతవైపున నే ధర్మము నిలచియున్నది.

రామాయణమునందలి 'వాలివధ' కూడ విషాదాం తమే. కావలసిన ఒకనాటకమున కనుకూలముగ నున్నది. వాలివధను న్యాయసమ్మతముగాఁ జేయుటకు వాల్మీకి యొక చక్కని సంభాషణమును సృష్టించినాఁడు. వాలికిఁ దన్నిత రులు నిందించుటకుఁ గారణములు కాని, యితరులకుఁ దాను సిగ్గుపడవలసిన విషయములు కాని లేవు. సుగ్రీవుఁడు తన్నుఁ జంపు నని భయపడుట యందర్థ మున్నది. సుగ్రీవుని భార్య

నాతఁడు గ్రహించుటలో నాతని జాతిమత విరుద్ధము లేవియు లేవు. రాముఁడు, సుగ్రీవుఁడు నెదురుగా వచ్చుచున్నారనియు, వారిని దలపడ వలదనియుఁ దార చెప్పినను వాలి వినలేదు. ఆతని భక్తి, ధైర్యములు న్యాయవంతుఁ డగు రామునివలన భయము లేదని యాతని సంబోధించినవి కాని యాతఁడు సోదరునితో ముష్టియుద్ధము చేయుచుండఁగా రాముఁడు వృక్షమూలమున నుండి సంహరించినాఁడు. ఇందలి యీసోద రులసంఘర్షణ యాశ్చర్యమును ప్రదర్శించినంతగా విషాద మొసఁగదు. కాని,. వాలికి దురదృష్టము సంభవించినది. బలహీను లగువారు న్యాయముగా జీవించుటకు, సుగుణవం తులైనను బలవంతుల బలగమును హరించు టీవిషయమునఁ గాంచవచ్చును. మఱియు విషాదాంత నాటకమున కనుకూ లమే యైనను, సంస్కృతనాటకకర్త లెవ్వరు నిద్దానిని గ్రహిం పలేదు.

ఆయావిషయములఁ బరికించి చూచిన నిందుఁ దేలిన దేమనఁగా, విషాదాంతనాటకముల కనువగు విషయములెన్ని యున్నను సంస్కృతనాటకకర్తలు వానిని విషాదాంతములు కాక, సుఖాంతములుగానే మార్చివైచుచు వచ్చిరి. దీనికిఁ గారణ మనూహ్యము కాదు. జీవితవిషయముననేమి, సార స్వత జీవనమున నేమి హిందూధర్మపద్ధతి పూర్తిగఁ జూపఁ బడినది. సర్వదా న్యాయమే తుదకు విజయమందవలెను. దానివలననే కర్మ పరిపక్వమగును. సమస్తవిషయములును

శాంతమున కాధారములు. శాంతముననే యవి యంత మందును. విఫలమైన విషయము లన్నిటియందును దైవ భక్తిపైఁ బ్రబలవిశ్వాసమే నెలకొల్పఁబడును. కరుణ పరిశుద్ధ మొనర్చుటకే యుపకరించును. భయోన్మీలితమగు విషాదమునకు సంస్కృతనాటకములందు స్థానమే లేదు. సత్కర్మయందే దుష్కర్మ మాయమైపోవును. ఆత్మ పారిశుద్ధ్యము కరుణరసమూలముననే సంభవించును. తత్సంజనిత మగు శాంతి, అంతమున న్యాయముగాంచిన విజయము చేతనే స్థిరముగా నిలిచిపోవును. మానవుఁడు పరిస్థితులకు జోహారొనర్చుచో, అతఁడు సర్వశక్తిమయుఁ డగు భగవంతుని న్యాయస్థిరపాలన కంగీకరింప వలసివచ్చును. సంస్కృత నాటకకర్తలకు మతనైతికబోధన వ్యాప్తియే పరమావధి. జీవితనాటకమున, సమస్తవిషయములందును ధార్మికపతాకమే యెగురవేయుచు, దానికి వినమ్రుఁడైనవాఁడే నిజమైన వీరాగ్రేసరుఁడు. అట్టియాతని జీవితము విషాదాంతము కానేరదు.

—

## ౯. కళాపూర్ణోదయము: శాలీనపాత్రపోషణము

పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయమందలి సుగాత్రీశాలీనులకథ పాతివ్రత్యమహత్త్వము, భక్తితత్త్వము, నాత్మసంయమన మాహాత్మ్యము వేనోళ్లఁ జాటునదై కడుం గడు ప్రఖ్యాతి వహించి యున్నది. అందుచేతనే యీకథ సరస్వతీదేవియే రచించినట్లు సూరనార్యుఁడు తన్ను శ్లాఘించుకొనె నన్నను సమ్మతింపవలసినదే; అంత సరసముగా నీకథ విరాజిల్లుచున్నది.

ఈ సుగాత్రీశాలీనులకథలో నున్న చిత్రమేమనఁగా స్థూలదృష్టి గల పాఠకులలో సుగాత్రిని మెచ్చనివారును శాలీనుని ప్రవర్తన మన్న నచ్చినవారు నుండు టరుదు. కాని సూక్ష్మదృష్టితోఁ బరికించితిమేని సుగాత్రికన్న శాలీనుఁడే యధికుఁడన్న సూరనార్యుని యభిప్రాయము విస్పష్టమగును. దీని ననుసరించియే యాతఁడు శాలీనపాత్ర మద్భుతముగాఁ బరిపోషించినాఁడు. మఱియు సుగాత్రివంటి పతివ్రతాతిలకము నకు మూర్ఖుఁడు కఠినహృదయుఁడు నగు భర్త నంటఁగట్టునట్టి యరసికుఁడు కాఁడు సూరనార్యుఁడు.

అనసూయామహాసాధ్వి కత్రిమహర్షియు, సీతామహాసాధ్వికి శ్రీరామచంద్రుఁడు, సావిత్రికి సత్యవంతుఁడు, అరుంధతికి వసిష్ఠమహర్షియు భర్తలైరి. కాని యన్యులు కాఁ జాలుదురా? ఈదృష్టితో సూరనార్యుఁడు శాలీనపాత్రపోషణ

మెట్లు నిర్వహించినదియు గ్రహించుట కీవ్యాస ముద్దేశింపఁబడి
నది. శాలీనుఁడు, సద్బ్రాహ్మణుఁడు, నితాంతాచరిత స్వజాతి
ధర్ముఁడగు కర్మవీరుఁడు. కర్మసూత్రమునందుఁ బరమవిశ్వా
సము కలిగి యేది యనుభవింపవలెనో దాని ననుభవింపక
తీరదను దృఢనిశ్చయము కలవాఁడు. కావున నే సుగాత్రి
నాతఁడు వివాహమై యిల్లటపుటల్లుఁడై నిశ్చింతుఁడై మనఁ
గల్గినాఁడు. ఆతని మనస్తత్త్వ మట్టిది. కానినాఁ డెంత
దారిద్ర్య పీడితుఁడైనను నత్తింటనుండి యత్తగారి చీవాట్లు
దినుచు నొకక్షణమైన నుండఁగలఁడా? మఱియు శాలీనుఁడు
సహజ సౌందర్యాస్వాదనలోలుఁడు, ప్రవీణుడును, అంతియ
కాక, కృత్రిమసౌందర్యమునందు నలక్ష్యభావము కలవాఁడు.
ఇట్టి శాలీనుని కడఁ బ్రథమ సంగమవేళ సుగాత్రి యలం
కారకలితయై రాత్రులు వట్టి రాకపోక లొనర్చుట శాలీనుని
యౌన్నత్యమును జాటుచున్నది. ఆతఁడలోలుఁడు, నిగ్రహ
శక్తియుతుఁడు, స్వాభీష్టపాలనానందుఁడు.

సుగాత్రి తల్లిదృష్టిలో నీతఁడు 'నిరర్థుఁడు' 'వట్టిగొడ్డు
కాకట్టు' ఈదృష్టి పరమపామరదృష్టి. అజ్ఞానవిలసితము.
ఈమె దృష్టిలో సుగాత్రి మగమొల్కఁగనుటయే శాలీనుని
ప్రయోజనము. కాని శాలీనుని దృష్టి యట్టిది కాదు. ఆతఁడు
నిర్వహింపవలసిన విధు లనేకము లున్నవి. తన మనస్సున
కంగీకారము కాని విషయములలోఁ జొరఁ జూచెడి పరమ
లోలుఁడు కాఁడాతఁడు. సహజసౌందర్యలోలుఁ డగుటయాతని

లోపము కాదు. అట్టి సహజసౌందర్యాస్వాదనము లభింపనినాఁడాతఁడెట్టివానినైనఁ ద్యజింపఁగల సాహసికుఁడు. కావుననే సుగాత్రివంటిమహాసౌందర్యవతినైననుపేక్ష చేయఁగలిగినాఁడు.

తన్నుఁ బోషించు నత్తగారు తోటపనికి నియోగింపఁగా శాలీనుఁడు మహాప్రసాదమనినాఁడు. 'దివిజనుతమైన శారదా దేవిపూజ, కుపకరించు కార్యంబిది యొప్ప' నని తనకుఁ దీర్థము స్వార్థము కలిసి వచ్చినట్లు సంతోషించినాఁడు. అనఁగా నేస్థితియందైనను నానంద మనుభవించి మనోవైకల్యమునందని స్థితప్రజ్ఞుఁడు శాలీనుఁడు.

విధ్యుక్తమగు క్రియల నిర్వహించుటలో శాలీనుఁడు వెనుకంజ వేయువాఁడుకాఁడు. అత్తగారి పూదోఁటఁ బెంచుట ప్రస్తుత మాతని విధి. అందుచే 'నధిక మోదంబుతో' 'తదేక నిష్ఠ' నాతఁ డాపూవుదోఁట ననిశముఁ బెంచినాఁడు. ఆపనిలో నాతని కావంతయు విసువులేదు. అంగపరిఖేదము నెఱుఁగఁడు. స్వధర్మనిర్వాహణలో నాతఁడు చూపిన శ్రద్ధాభక్తులు నిరుపమానము లనుటలో సందియము లేదు. వీనివలన శాలీనుఁడెంతటి పరిణతచిత్తుఁడో సూక్ష్మదృష్టికి గోచరింపకమానదు. ఇఁక స్థూలదృష్టికిఁ దగులున దాతని నైచ్యము.(అత్తమాటల యం దాదరణ, పౌరషములేని నీచసేవ.)

తోటపనులు చేయుచు నంతకు మించిన స్వజాతిధర్మముల నాతఁడుల్లంఘించినవాఁడు కాఁడు. ఈవిషయమును సూరనార్యుఁ డిట్లు వర్ణించినాఁడు :

"ఎంతయుఁ బ్రొద్దునలేచి ని
తాంతాచరిత స్వజాతి ధర్ముఁడగుచు ని
శ్చింతుఁడయి గురుపరంపరఁ
జింతించి తదుక్తజపము చేసి ముదమునన్.
నియమమునఁ బుష్పములు కోసి నేర్పు మీఱఁ
బలు తెఱంగుల వింత వింతలుగ మాలి
కలును బొందులుఁ గందుకంబులు రచించి
బ్రహ్మయిల్లాలికిని సమర్పణముచేయు"

వీనివలన సూరనార్యుఁడు శాలీను నెంత యుత్కృష్ట జీవిగాఁజిత్రించినాఁడో విదితమగుచున్నది. శాలీనుఁడు స్వజాతి స్వధర్మముల నుత్సాహముతో నెఱవేర్చు మహాత్ముఁడు. ఏపరిస్థితులనైనను నిశ్చింతుఁడు. ఇతని గురుభక్తి యద్వితీయము. వీనికిఁ దోడీతఁడు శారదోపాసకుఁడు. తులసి దళములు, చెంగలువలు, చంపకములు మున్నగు నుత్తమ కుసుమములచే నిత్యమును సరస్వతీపూజ చేయు నుత్తమతపస్వి. తన ధర్మ నిర్వాహణమున నేమఱిక, యాలస్యము లేకుండుటకై 'యెంతయుఁ బ్రొద్దున' లేచువాఁడు. ఇట్టి మహర్షి కల్పుఁడగు శాలీనుఁడే సుగాత్రి భర్త.

శాలీనుఁడు కఠినహృదయుఁడు కాఁడు. అరసికుఁడు కాఁడు. కృత్రిమాలంకార విముక్తయై తోఁటపనులు చేయు సుగాత్రిని గాంచఁగనే 'వెఱ్ఱిపడుచ! యెంతమాన్పిన నెఱంగెడు దానవుగావు నీకు దోఁటపనుల కెంత దూరమకటా!' యని

తనయుత్తరీయపు మునికొంగుతో నామె ఘర్మబిందువులఁ దుడిచి నాఁడు. ఆహా! శాలీనుఁడు కుసుమపేశల హృదయుఁడు కాఁడా! ఆతని నోటినుండి వెలువడిన యామాట లెంత దాక్షిణ్యా యుతములు, కరుణామయములు నోకదా!

శాలీనుఁడు సుగాత్రి పతిభక్తి నెఱుఁగనివాఁడు కాఁడు. 'నాబడలిక చూడలేక కిడుమ పాల్పడుఁ జొచ్చి నలంగి' తని యామెను గౌఁగిట జేర్చికొన్నాఁడు. మదనమహారాజ్య భోగ మహిమఁ దేల్చినాఁడు. సూరనార్యుఁడిట్టి విషయమును జిత్రిం చుటలో నెంతయు నర్థ మున్నది. సుగాత్రితల్లితోపాటు తత్సదృశు లగు పాఠకులును శాలీనుఁ డరసికుఁడు, మూర్ఖుఁడు, కఠినుఁడు, క్రూరుఁడని యెంచకుండఁగా నీయుదంతమును దెలిపి శాలీనుని పాత్రపోషణమునకు వన్నె గల్పినాఁడు.

శాలీనుఁడు తనహృదయమును సుగాత్రికి విప్పి చెప్ప నంగీకరింపలేదు. తనకు సహజసౌందర్యముపైఁ గల మక్కువయుఁ గృత్రిమ సౌందర్యముపైఁ గల యసహ్యమును నామెకుఁ దెలుపుటయు నసహజమే. ఏలన, సుగాత్రివంటి పతివ్రతామణి భర్త తెలుపకుండఁగనే యాతని మనస్తత్వ మును దెలిసికొనవలెనని సూరనార్యుని యభిమతము. ఉత్తమ పతివ్రతలు నడచుకొన్న విధ మది. శాలీనుఁడు దన యభిమత మును దెలుపుట రసహీనము, సుగాత్రిశీలమున కింతగా వన్నె గానిరానిదియు నగును. శాలీనుఁ డట్లుపేక్షించుటచేత సుగాత్రి పాతివ్రత్యప్రకటనమున కవకాశము లభించినది

లేని నాఁడామె మాహాత్మ్యమంతగాఁ బ్రకటింపఁబడకనే పోయెడిది.

శాలీనుఁడు సహజసౌందర్యాభిలాషి యేకాక యుత్తమమగు నింద్రియనిగ్రహముకల పుణ్యపురుషుఁడు. అనురూపవతియగు సుగాత్రి, మహాపతివ్రతయగు సుగాత్రి, సత్ప్రేమనిలయమగు సుగాత్రి తనపాదములొత్తుచుఁదననాటపుఁగూర్మిఁ దెలుపుచు నాతని కటాక్షమర్థించుచుండు టెఱిఁగియు శాలీనుఁడూరకుండుట సామాన్యవిషయము కాదు. అతఁడొక మహాయోగపురుషుఁడు. ఇంద్రియాశ్వముల నధిరోహించి కళ్లెములు చేతఁ బుచ్చుకొని స్వారిచేయు యోగాశ్వారూఢుఁడాతఁడు. తన భార్యయగు సుగాత్రి తన మనస్తత్త్వము నెఱింగి కృత్రిమాభరణముల వీడు సహజసౌందర్యవతియై తన హృదయామోదముఁ గూర్పవలెనని యాతని యభిలాష. సుగాత్రి వివేకహీన కాదు. నాఁడో మఱునాఁడో యాతని యింగితమును గ్రహింపకపోదు. అంతవఱ కాతఁ డుపేక్షించుట యాతని నిగ్రహశక్తి, యలోలత, సతీప్రేమమే వెల్లడించునుగాని యన్యము కాదు. ఈవిషయమున సూరనార్యుఁడు శాలీనపాత్ర పరిపోషణమునఁ జూపినప్రతిభ నిరుపమానము. 'ఏకోర్కెని వచ్చితి' వన్న శాలీలునికేక సుగాత్రీ పతివ్రతాస్వర్ణమణి కొకనికషోపల.

శాలీనుని మనస్సు నపహరించినవి సుగాత్రి ప్రథమంపుఁదదాకృతియొప్పిదములు, ఆ చెదరినవన్నె, యాపనులు చేయు

ఘనతర, యావినీతి, యాపదిలపుఁ బ్రేమ యారతులభంగులు. పతిమతిఁ జూఱకొనఁజాలునవియే శాలీనుని దృష్టిలోని పరమాదర్శములు ఆయాదర్శసంసిద్ధికై శాలీనుఁడద్భుతమగు నాత్మసంయమనముఁ జూపినాఁడు. సుగాత్రి యాతని తత్త్వమును గ్రహించినది. కృత్రిమ భూషణము లావలఁబాఱవైచి భర్తృహృదయమును జూఱకొని యానంద పరమావధి నందఁగన్నది.

ఈవిధముగాఁ బింగళి సూరనార్యుఁడు శాలీను నొక లోకోత్తరపురుషునిగా నద్వితీయ స్వజాతి స్వధర్మావలంబిగా, నుత్తమాదర్శవిరాజితునిగా, నిరుపమాన నిగ్రహునిగాఁ జేసి శాలీనపాత్ర పరిపోషణము నద్భుతముగా నొనర్చి సుగాత్రీ శాలీనుల నొకరిని మించినవారి నొకరిగాఁ జూపి పుణ్యదంపతుల యీకథ యాంధ్రసారస్వతమున నొక యమూల్యరత్నముగా నర్పించి జేగీయమానుఁడు కాఁగలిగినాఁడు.

# ౧౦. ప్రాచీనాంధ్ర శతక పరిశీలనము

౧

పరమపావన మగు నాంధ్రసారస్వతారామమున నత్యంత రమణీయములై దివ్యపరిమళమును వెదచల్లినవి శతకసుమములు. తోడి ప్రబంధ సుమసౌరభమును మించ లేకపోయినను వానితో సమానముగ విరాజిలఁ గలిగిన శతక ప్రసూనములు లెక్కకు మిక్కిలిగా వెలసినవి.

ప్ర థ మ శ త క ము

ఆంధ్రసారస్వతమున నన్నయభారతము జనించిన నూఱు సంవత్సరములకే ప్రథమశతకము పొడచూపినది. అంతకుఁ బూర్వము సైతము శతకము లున్నట్లు వినుటయే కాని తగిన దృష్టాంతములు లభింపని కారణమున నాఁటి నుండియే శతకోద్భవమైనదని నిర్ణయింపవచ్చును. ఈకాలమే క్రీ. శ. 12 వ శతాబ్దముగాఁ జరిత్రజ్ఞు లెంచియున్నారు. అంతకుఁబూర్వము ప్రాకృత సంస్కృతశతకము లుండియుండవలె ననుట సమంజసమే యైనను మన దురదృష్టవశమున నవి కాలగర్భమునఁ గలసియుండుటచే నూరకొనవలసి వచ్చినది. కావునఁ, బండ్రెండవ శతాబ్దమే శతకోద్భవమునకుఁ బ్రారంభ మనుకొందము.

ప్రప్రథమునఁ బుట్టిన శతకము మల్లికార్జున పండితారాధ్య ప్రణీతము, శైవభక్తి ప్రతిపాదకము నగు శివతత్త్వ

సారము. ఈ శైవమత ప్రతిపాదకమగు శతకము పుట్టునాఁటి కాంధ్రదేశమునందలి మతస్థితి యెట్లున్నదియు దిక్ప్రదర్శనముగానైనఁ దెలిసికొనవలెను.

### నాఁటి మతస్థితి

అనేక శతాబ్దములకుఁ బూర్వమునుండియు ననఁగా క్రీస్తు జన్మింపని క్రితమునుండియు శైవవైష్ణవ మతములు కర్ణాటాంధ్ర ద్రవిడదేశములందు సుప్రతిష్ఠములై యున్నవి. అందు ముఖ్యముగా, శ్రీరంగక్షేత్రమునఁ గల దక్షిణదేశమున వైష్ణవమతమును శ్రీశైల పుణ్యక్షేత్రము గల కర్ణాటాంధ్ర దేశములందు శైవమతమును వ్యాపించియున్నవి. కాని, నాఁటి యాంధ్రదేశమందలి శైవులు పాశుపత, కాలాముఖ, కాపాలికాది భిన్నపద్ధతులలోనుండి యైక్యముఁ గోల్పోయిరి. ఈ యైక్యసూత్ర నిబద్ధులు కాని శైవు లన్యోన్యకలహములతోఁ బరస్పర మనస్స్పర్థలతో విరోధించుకొనుచుండిరి. ఈ సమయమును గనుపట్టి తమ జైనబౌద్ధమతములు వ్యాపింపఁజేయుటకును, శైవమత ప్రాబల్యము నణఁచుటకును సిద్ధనాగార్జునాది జైనబౌద్ధ ప్రచారకులు శ్రీశైలమును జేరి స్వమతవ్యాప్తికి సర్వతోముఖముగఁ బాటుపడఁజొచ్చిరి. శైవుల మతవిభేదములకుఁ దోడు జైనబౌద్ధమతము లహింసాతత్త్వ ప్రతిపాదకము లగుటచేతను, జాతిభేద విరహితము లగుటచేతను గర్మసిద్ధాంత తృణీకృతము లగుటను జనాళిమనముల నాకర్షింపఁ జొచ్చినవి. పైఁగా శ్రీకంఠుని యద్వైత శంఖానినాదముతో

జైనబౌద్ధమతములతోఁపాటు శైవమతమును నొక్కసారిగ సన్నగిలఁ జొచ్చినవి. బసవన్న స్థాపించిన వీరశైవమతమునఁ గల బ్రాహ్మణద్వేషము, వేదభూషణము స్వమతాఘాతములై శైవమత సంస్కరణల కావశ్యకతఁ గూర్చినవి.

అట్టి సమయమున నాంధ్రదేశమున వెలసి చక్కని సంస్కరణము మూలమున స్వమతవ్యాప్తిఁ జేసిన మహానీయుఁడు మల్లికార్జున పండితారాధ్యులు. ఈతఁడు బ్రాహ్మణులను వేదములను నిందింపకుండ నద్వైతమును ఖండించి, తన మతవ్యాప్తికి శతకము విరచించెను.

## మల్లికార్జున పండితారాధ్యులు

మల్లికార్జున పండితారాధ్యులు క్రీ శ. 1160–70 ప్రాంతమునకుఁ జెందినవాఁడు. గోదావరీమండలమునఁగల భీమేశ్వరమున భీమేశ్వరున కర్చకుఁడైన భీమనపండితునకును గౌరాంబకును బుట్టిన ఋగ్వేదశాఖీయుఁడు. గౌతమస గోత్రుఁడును, వీరమాహేశ్వరాచారముల ననుసరించినను బ్రాహ్మణత్వమును గార్హస్థ్య ధర్మములను విడువనొల్లక ఆచరణరూపకమైన సత్యములనే శతకమున వెల్లడించి యున్నాఁడు. 'భక్తిమీఁదివలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయలేను నేను బసవలింగ' యని బసవనికిఁ బంపిన వాక్యమే దీనిని ధ్రువపఱచును.

శివతత్త్వసారము శతకమగునా ? కాదా ? యను సంశయ మొకప్పుడు కలిగినది. కాని, యొకే మకుట మెల్లెడ

లేకపోవుట శతకారంభదశనే సూచించును గాని శతకము కాదనుట కుపకరింపక పోవుటచేతను,

"శతకంబు శివతత్త్వసార మాదిగను... "

అని పండితారాధ్య చరిత్రమునఁ బర్వతప్రకరణమున నుండుట చేతను 150 పద్యములకుఁ బైఁగా 'శివా' యను మకుట ముండుటచేతను, కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు గారును వారి ననుసరించి కీ. శే. వంగూరి సుబ్బారావు గారును దీనిని శతకమనియే పరిగణించుటచేతను, నిది ప్రథమ శతకముగా గ్రహింపఁబడినది.

ఈ శతకము కేవలము శివాధిక్యము నుద్ఘోషించుచు నాఁటికే ప్రాబల్యముఁ గాంచిన యద్వైతమును ఖండించు టకుఁ దగిన యుక్తియుక్తులతో శైవమతప్రాబల్యమునకును, పండితారాధ్య చరిత్రాది శైవగ్రంథములు జనించుటకును, మూలకందమైనది. నన్నయతిక్కనల నడిమికాలమున జనిం చిన దగుట సారస్వత దృష్టి ననుసరించినను దీనికిఁ జాల ప్రాముఖ్య మున్నది

శతక విషయము

ఇందు ముఖ్యముగా పశుపాశ పతిజ్ఞానము, అద్వైత మత ఖండనము, జగత్కర్తృత్వవిచారము, భవాది శబ్ద వివృతి, జగత్కర్తృ లక్షణము, శివభక్తి వివరణము, భక్తుల మహిమము, శివనిర్మాల్యము, శివదీక్షితుఁడు, శివాభక్తుఁడు, భక్తిప్రాశస్త్యము, బాహ్యపూజామహిమము. శివాపచారదో

షము, దక్షాధ్వరధ్వంసము, ప్రళయ వర్ణనము, శివగణ వర్ణ
నము, సద్భక్తుల మహిమము, భక్తప్రశంస మొదలగు విషయ
ములు వివరింపఁబడినవి.

"శ్రీపతి వాక్పతి ముఖ్య మ, హా పురుషులు నెఱుఁగనోప రతి
వాఙ్మనస
వ్యాపారమైన నీ నిజ. రూపము నే నెట్టిదని నిరూపింతు శివా."

అని శ్రీ కారముతోడనే గ్రంథారంభము చేసి
యపంతములైన వేదములు, సమస్తవేదాంతములు, శ్రీపతి
వాక్పతి ముఖ్యులును శివునిఁ బొడఁగాన లేరనియు నట్టి యవా
ఙ్మానసగోచరుని 'దురితహర మనియు శుభములు, దొర
కొను ననియుఁ' దలఁచి ప్రణుతించుట కారంభించినాఁడు,
శివమార్గమునకు శివసంహితులకు, శివపంచాక్షరికి, శివగణ
ములకు, శివునికి సంబధించిన సమస్తమునకు జయ మపేక్షించి
కవి తన యనన్య భక్తిని వెల్లడించినాఁడు.

పిమ్మట పాశుపతశైవ సంప్రదాయముల ముఖ్య
సిద్ధాంతముల నిట్లు నిరూపించినాఁడు.

"జీవు లశేషులు పశువులు, భావింపఁగఁ బ్రకృతి వికృతి బంధము
పాశం,
బావృతము లగు బసువులు, నీ వారెంటికిని బతివి..."

అనియు, బ్రహ్మోక్త సమస్త హరిబ్రహ్మాది పిపీలి
కాంత పశువుల కందఱకును శివుఁడే పతి. ఆపశుపతిని వేదోక్త
మార్గమున గొల్చి దేహపాశ బంధచ్ఛేదనమునఁ బసువులు

ముక్తము లగు ననియుఁ దత్సిద్ధాంతము. పాశుపతు లద్వైత మును గర్హింతురు. సన్న్యాసమును నిందింతురు. ఈపాశుపత సిద్ధాంతము విశిష్టాద్వైత సిద్ధాంతములతో సమముగా నుం డును. వీరును శ్రౌతస్మార్త కర్మలతో సమానముగా ఆగ మోక్తములైన కర్మల నాచరింతురు. ఈవిషయములెల్ల నిందు సువ్యక్తములై యున్నవి.

## అద్వైతమత ఖండనము

ఇఁక, నద్వైత ఖండన విషయమున కవి మాయా వాదమును దన యుక్తులచే ఖండింపఁ జూచినాఁడు. మాయా వాద ఖండనమున విశిష్టాద్వైతమును గ్రహించి తదితరములఁ గేవల ద్వైతమతాభిమానమును జూపినాఁడు. అతని మత మిది: "జీవుఁడు శివుఁడను వాక్యము ప్రతిపాదకము. జీవునకు బంధమోక్ష దశావస్థలు గలవు. శివునకు లేవు. పరమేశ్వరు నకు జీవునకు మహాధాత్రీధర పరమాణువుల యంతరము కలదు. అందుచే జ్ఞాని యగువాఁడు భక్తిహీనుఁడేని మోక్షమున కనర్హుఁడు."

ఏతన్మతానుసారముగా నద్వైతపరము లగువానిని ద్వైతపరములుగాఁ బ్రతిపాదించుట చిత్రముగాఁ గాన వచ్చును.

ఈ శతకమున మనము గ్రహించి యానందింపవలసి నది ఇందలి భక్తిప్రాశస్త్య వివరణమే.

"స్వర్గాపవర్గ సుఖము ని,
రర్గళసామ్రాజ్యసుఖము నాత్మజ విద్యా
వర్గాదిలోక సుఖములు,
భర్గ! భవత్పాదభక్తి ఫలములు రుద్రా!"

అనునదియే యెల్లెడల విస్తరింపఁబడినది. తద్భక్తిభావము లిట్టివి: భక్తితోఁ గొల్చిన గాని ముక్తి లేదు. భక్తి ధర్మము వలన జనించును. ధర్మము వేదోక్త సదాచారమునలనఁ గలుగును. ఈ ధర్మాధిక్యముచే, నతి నిర్మలబోధయు, విరక్తి, నిష్ఠ గలుగును. దీన భక్తి వృద్ధియగును. శివభక్తి నరసుర తిర్యక్సచరాచరజీవులకు, నరతిర్యగ్గర్భ యౌవనస్థాది పరూత్కారములకు సిద్ధి నిచ్చును. శివభక్తి లేని వివిధాధ్వర ముఖ్య సకల వేదపురాణాది విహితకర్మము లన్నియు నిష్ఫలములే.

ఇఁక, శివభక్తుఁ డెట్టివాఁడైనను బాకజమురీతి సమాదరణీయుఁడే. శివభక్తునకు హరిపద్మజ వాసవ విస్తర విభవములు తృణప్రాయములు. "ఆకాశము పొడగీసిన, భూకంపం బైనఁ బంచభూత ప్రళయ వ్యాకులమైనను, కులగిరులు జిఱ్ఱి దిరిగిన, జలరాసులు మేరదప్పి చనుదెంచినను, దిక్కులు పీడ్పడి కలిసినను, దిక్కరులు మదం బుడిగి తిరిగినను, భూతములు తల్లడిల్లినను, పాతాళము బయలుపడినను బ్రహ్మప్రళయ మేతెంచినను—వేయేలఁ ప్రాణములు పోయినను [illegible]ల తెగినను శివభక్తుఁడు" జంకఁడు.

శివభక్తుఁడు తలఁచిన నాయుధములు కుసుమములగు; అబ్ధులు మెట్టలగు; మహామదగజములు గండశిలలగు; ఆతనికి క్షుత్తృష్ణాది విపత్తులు, జలతపన శీతబాధాదులు కలుగవు. పరపరివారత్వము, నిష్కారుణత్వము, మరణపునర్భవాదులు నుండవు. అందుచే, శివభక్తులు త్రిజగత్పావనులు; భవాంధతమస పటల విఘటనోద్భావిత నిజమహిమార్క విభాసులు.

శివనిర్మాల్యము భక్తులకుఁ బ్రబలోపయోగి; అభక్తుల కంటరానిది; శివభక్తురాలైన స్త్రీ పతి శివభక్తుఁడు కాఁడేని ఆమె భర్తకు బుద్ధి చెప్పవచ్చును. బుద్ధి తలకెక్కదేని ఆమె యాతని మీఱవచ్చును. భర్తను దృణీకరించినను శివపూజా ధురంధరమగు స్త్రీ యోగ్యురాలే. ఇందుల కుదాహరణము లనసూయ, ఆలాయని యను మునిభార్యలు.

శివభక్తుఁడు విడినడని శివజ్ఞానముచే సమస్తమును విడిచి దురహంకారము పోనాడి తన్ను దాను మఱచువఱకు శివునకు బాహ్యాభ్యంతరపూజ చేయవలయును.

శివభక్తుల కర్తవ్య మిట్లు వివరింపఁబడినది; వారు జీవహింస చేయరాదు; శివనింద చేయువారిని చంపవలయు; శివాపచారముచేయు గ్రంథములు కాల్పవలయును. శివతీర్థములోఁ గాని, శివాజ్ఞచేఁగాని జీవత్యాగము చేసికాని ముక్తిని పొందవచ్చును. శివునికై గాని శివభక్తార్థముగాని శివవిద్యాచార్య విషయమునఁగాని జీవిత మర్పించిన ముక్తి కలిగి

తీఱును. అట్లు శివాజ్ఞ మనువుల పడినవారికి బరలోక విధు లవసరము, వారికి ముక్తి సిద్ధము.

మానసికముగాఁ గాని కాయికముగాఁ గాని వాచిక ముగాఁ గాని, యేవిధముగాఁని, శివాపచారము చేసిన యాతఁ డెంతటివాఁ డైనను మహా దుర్గతిని పొందును. దక్షాధ్వర ధ్వంస మిందుల కుదాహరణము.

క్షయము లేకపోవుటచే మోక్షములేదు. కావునఁ బరమ కరుణాంతరంగుఁడగు నీశ్వరుఁడు మానవుల దుఃఖ నివారణకై లయ మొనర్చుచుండును.

శివాభిలాషానుసారము లోకాలోకము, సురపతిలోక ముతోఁ గూడి బ్రహ్మలోకము, వైకుంఠలోకము చేరి లోక త్రయమెల్లఁ బ్రమథలోకమైనది. ఈ ప్రమథులు మహావీరులు, వీరవ్రతులు, వీరావతారులు. వీరు సర్వజ్ఞులు, సర్వగతులు, సర్వశుభాగములు, సర్వ సంగత్యాగులు, సర్వ పరిపూర్ణ లును. కావుననే కవి యీ భవ్యగణములలోఁ జేర్పనలసినదిగాఁ బరమేశ్వరునిఁ బ్రార్థించినాఁడు.

తన్నుఁ గన్న తండ్రి తల తెగదునిమినవాఁడు, తన కన్నిచ్చినవాఁడు శివనింద విని ప్రాణత్యాగ మొనరించిన వాఁడు, తన తలలు తఱిగి శివున కర్పించినవాఁడు—వీరే మహా శివభక్తులు; వీరి త్యాగము, వీరి మోక్షాసక్తి శివ భక్తులకు నిత్యధర్మములు. దీని ననుసరించియే శివభక్తి.

"శివునకుఁ దనువును మనువును, శివభక్తులకును ధనంబు జిత్తప్రీతిన్
భువినిచ్చి యెల్లవారికి, శివుఁడను నేననకయునికి శివభక్తియగుఁ—"

అని నిర్వచింపఁబడినది. ఆ భక్తికల "ఆతఁడె స్వరూప సుందరుఁ, డాతఁడె సౌభాగ్యవంతుఁ డాతఁడె గుణవి, ఖ్యాత యశుండు..."

మహాభక్తుఁ డంత్యజుఁడైనను నగ్రజన్ముఁడే. అభక్తుఁ డగ్రజన్ముఁడైనను నంత్యజుఁడే. కావుననే చెన్నయ మాలఁడు తన మహాభక్తిచే నగ్రజన్ముఁడయ్యెను. దక్షుఁడది లేనికారణమునఁ బచ్చి మాలఁడయ్యెను. ఇది ఈశతకవిషయ సంక్షిప్త వివరణము.

శ్రుతి స్మృతి భాష్య జ్ఞానము

ఈ శతక కర్త పండితారాధ్యులు దివ్యమహిమో పేతుఁడు. ఈమహిమలెల్ల శివతత్త్వసార పీఠికలోఁ గలవు. ఈతఁడు వేద ప్రామాణ్యము కలవాఁడు. వేదవాక్యములు ద్వైతమునే బోధించుచున్నవని ప్రతిపాదించినాఁడు. "వేదో క్తమార్గమున నత్యాదరమున నిన్నుఁగొలిచి...ముక్తులగుట సిద్ధము రుద్రా!" "వేదోక్త సదాచారా పాదనమున... పురా పాదిత దురితక్షయమై..." మొదలగుచోట్ల నీతని వేద ప్రామాణ్యబుద్ధి గోచరించును.

మాయావాదమును. ఖండించుచోట ననిర్వచనీయా ద్యనుపపత్తులు గ్రహించి ప్రయోగించుటచే నీతని భాష్య జ్ఞానము వెల్లడియగుచున్నది.

మఱియు నద్వైత ప్రతిపాదకములగు పరమసత్యముల నీతఁడు ద్వైత ప్రతిపాదకములుగాఁ బ్రతిపాదించుటలోఁ

జూపిన యుక్తు లీతని ప్రతిభావ్యుత్పత్తులు చాటుచున్నవి. వేదవాక్యములు ద్వైతమే బోధించుననుటయు, "తత్త్వమసి" యను సూత్రమును 'తస్యత్వం అసి' యని యర్థము చేయుటయు మొదలగున వెందుల కుదాహరణములు. ఈయూపట్టుల నీతని బోధకతాశక్తియు నద్భుతముగాఁ గానవచ్చును.

> "కల దలనోపక లేదని, పలుకఁగ నేరకయు మూకబధిరులక్రియని మ్ములఁ నద్వైతులు తమ లో, పల వగతు" రట !
>
> "నిత్య మహాజన దూష్యము, ప్రత్యక్షాది ప్రమాణ బాధా బాహ్యం బత్యనుచిత మద్వైత" మనియు ;
>
> "మాతయు మానము మేయము, భాతిగ మిథ్యయని పల్కు పాతకు లాత్మ, ద్వైతులు ప్రమాణసూన్య" లనుటలోను,

పండితారాధ్యుల వాదశక్తికంటె వాదిశక్తియే గోచరించును.

తన వాదమును శక్తివంతిముగాఁ జేయుటకై శ్రుతుల్యుక్తులనే పద్యముల వాఁడియున్నాఁడు : 'మద్భక్తా నవినశ్యంతి,' 'నమే భక్తాః ప్రణశ్యంతి,' 'లింగద్వయం సమాఖ్యాతమ్,' 'తేనసహ సంవసేత్,' 'తస్మైదేయమ్ తస్మాద్గ్రాహ్యమ్,' 'సచపూజ్యో యథాహ్యహమ్' 'నకర్మణా నతపసా నజపైర్న సమాధిభిః' 'రజ్జుః కూపాద్ఘటం యథా,' 'పథవర్తిని తేషాయామయథా తథా,' 'సుదూరమపి గంతవ్యమ్' మున్నగున వనేకము లిందుల కుదాహరణములు.

## లోకోక్తులు

ఈ శతకమునఁ బండితారాధ్యులు చక్కని లోకోక్తులనేకములను వాడియున్నాఁడు. 'పువ్వుల కతమున నారలు తలకెక్కినట్లు 'పలమేఁడు ప్రత్తికినైనను గులమమ్మ్రాడు వోవునట్లు' 'పిండ గూడు వెట్టిన మెరయల క్రియ' 'పుట్టనని చచ్చిచానని పుట్టెడు పువ్వులవిధమున' 'ఓడునఁబోసిన జలంబు యుక్తి' 'పరిమళము లేని కుసుమము కరమొప్పని భంగి,' 'మసి కప్పడమునఁ బొదవిన యసదృశమాణిక్యమట్లు,' 'పసిఁడి గమ్మగ వలచిన విధమున' (బంగారునకుఁ దావి యబ్బినట్లు) మొదలగున వనేకములు విరాజిల్లుచున్నవి.

నన్నయ తరువాత మనకు బాగుగాఁ దెలిసినవాఁ డితఁడే యైనను నన్నయ కావ్యలక్షణములు వ్యాకరణాను సారమయిన సలక్షణ భాషాసంపద యీతని కృతిలో స్పష్టముగాఁ గానవచ్చుచున్నవి.

## శబ్దార్థ విచారము

ఈతని గ్రంథమున నేఁడు కానరాని కొన్ని మాఱుమూల పదములును గలవు: పానలు, మేలిల్లు, వలచు (=పరిమళించు), నిరాణ (క. నిరాళ=స్వచ్ఛమైన.) వక్కండు. (కృశించు) బత్తళి (క. నగ్నత్వము) పలమేఁడు, కట్టడి, పినుగు, బడపండు (కు. సం. 7. 70.) అన్నఁడు, తోడుకొను, ముద్దటలు, పాదటి (పాదలి), నూడుపట్టెలాడు, హావి, అటిమెల్లాడు, పొసపోరు, మడఁది మొల్లమురియలు, బిలిబిలినిష్ఠలు, మొదలగునవి.

భా షా వి శే ష ము లు

వ్యాకరణమున, 'మను' ధాతువుపై మం(డేయేనిన్, ఆనాఁటికి అన్నఁడు అనురూపము, ఒక్కచోటనే డఢ(ప్రాస, (440.) 'కర్మ (కమ్ర) నిర్మా (నిమ్రా) తమ్ముల, ఇమ్ముల తోడి ప్రాస, (3॥7.) 'కర్మ (కమ్ర) నిర్మల (నిమ్రల) తమ్ముల, నిర్మింతు (నిమ్రింతు.) (320.) 'నమ్మిన' 'ధర్మము (ధమ్రము) అను ప్రాసలున్నవి. ఇవి కర్ణాట సంప్రదాయా నుసారము రావచ్చుననియు వీనినే 'వలపలగిలుక ప్రాస' మందు రనియు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు వ్రాసి యున్నారు.

పైఁజూపిన రీతిగాఁ బ్రథమమున జనించిన శివతత్త్వ సార మను శతకము లక్షణయుక్తమై చక్కని నిగ్గుదట్టమైన శైలిలో శైవమత ప్రచారమునకై నిర్మింపఁబడినది. ఇది శతక వాఙ్మయమునఁ దొలి శతకమగుటే కాక నన్నయ తిక్కనల నడిమికాలమున జనించిన యాంధ్ర కావ్యరత్న మనవచ్చును. ఈ శతకచ్ఛాయలే శైవశతకములకును నను కరణ సాధనమై, మూలమై చిరస్థాయితఁ గాంచఁగల్గినవి. మకుటవిషయమునఁ బహుమకుటము లుండుటయు లభ్యమైన పద్యములు నాలుగువందల యెనుబది తొమ్మిదుండుటయుఁ దప్పించినచో నిది ప్రథమ శతక ప్రసూనమని యానందింప వచ్చును. పిమ్మట, శతకలక్షణము పూర్ణముగాఁగల వృషా ధిపశతకము నరయుదము. శైలీకాఠిన్యము, సంస్కృతభాషా

ప్రయోగము, లధికముగాఁ గల యీ శతకము పామర జన వ్యాప్తము కాలేదు. అందులకే ఈ శతకము పండితులకే యుద్దేశింపఁబడిన దనవచ్చును. శతకములు పామరజనోపయోగమునకే యుద్దేశింపఁబడినవను నపప్రథకుఁ దావులేదు. ఇందులకీ ప్రథమ శతకమే ప్రమాణము.

౨

గత ప్రకరణమునఁ గాంచిన శివతత్త్వసారమునకు సుమారు వెనువెంటనే బయలుదేఱిన సంపూర్ణ శతకము వృషాధిప శతకము. ఇదియును శైవమత గ్రంథమే. బసవన్నచే స్థాపింపఁబడి మల్లికార్జున పండితారాధ్యులచే సంస్కరింపఁబడిన శైవమతమునకు మహోద్ధారకుఁ డగు పాల్కురికి సోమనాథుఁ డీ శతకకర్త. ఈతఁడును బంద్రెండవ శతాబ్దమునకుఁ జెందినవాఁడు. కాకతీయరాజ్యమును బాలించిన మొదటి ప్రతాపరుద్రుని కాలమువాఁడు. ఈతఁడు

'బసవపురాణాది బహుకృతుల్ చెప్పి,
వసుమతి వీరశైవముఁ బ్రతిష్టించి,
సకల మాహేశ ప్రసన్నతఁ గన్న,

వాఁడని పిడుపర్తి బసవన్న వ్రాసిన 'వీరశైవ దీక్షాబోధ'లో నున్నది. ఈతఁడు బసవపురాణము, సోమనాథ భాష్యము సంస్కృతము అనుభవసారము, పండితారాధ్య చరిత్రము, చతుర్వేదసారము, వృషాధిప శతకము, చెన్నమల్లు సీసములు, రుద్రభాష్యము, బసవరగడ మొదలగు ననేక గ్రంథములే

కాక సోమేశ్వర శతకాదులు కర్ణాటభాషలో విరచించి యున్నాఁడు.

ఈ సోమనాథుఁడు మహాభక్తుఁడై తన గురువగు బసవేశ్వరునే శివస్వరూపునిగా నెంచి "బసవేశ్వర తనయ!, బసవేశ్వర గోత్రకః, అని చెప్పుటకు గర్వించి "బసవా! బసవా! బసవా! వృషాధిపా!" యను మకుటముతో నీ యుత్కృష్ట శతకమును వ్రాసియున్నాఁడు. (ప్రాచీన శతకములలో శివతత్త్వసారము పరిపూర్ణ శతకము కాదన్నచో నియ్యదియే ప్రథమ శతకమగును.) ఈతఁడు

"ధర నుమా మాతాపితా గురు వనఁగ
వర పురాణోక్తి నీశ్వరుఁడలరుచుండ."

నని చెప్పుకొన్న భక్తాగ్రేసరుఁడు; మఱియు, "గురుర్దేవో మహేశ్వరః" అనునది మన ప్రాచీన సంప్రదాయము.

ఈ వృషాధిప శతకమును వ్రాయుటకుఁగల కారణములు రెండని కవి యిట్లు తెలుపుచున్నాఁడు:

"నోరికి వచ్చినట్టు లొక నూఱువిధంబులఁ బ్రస్తుతింతు నే
నేరుతు నేరఁ బొమ్మనక..."

యనునదొకటి.

"బసవఁడు ప్రీతిఁ గైకొనియె భక్తి మెయిన్ విరచించినాఁడు మున్
బసవపురాణమంచు ననుఁ బ్రస్తుతిచేయుదు రట్లుగాన నీ
యసమ దయాధురీణతకు నంకిలిపాటు ఘటిల్లకుండ..."

నను నది రెండవ కారణము.

ఇందు భక్త్యావిష్టుఁడై కవి చేసిన బసవేశ్వర స్తోత్రము మొదటిభాగముగాను బసవేశ్వర ప్రశంసలు ద్వితీయ భాగ

ముగను మనము గ్రహింపవచ్చును. మొదటిది డెబ్బదిపద్య ములును బసవేశ్వర సంబోధనపూర్వక పూర్ణస్తోత్రమును మిగిలినవి భక్తలీలా భక్త ప్రశంసాపూర్వకముగను నున్నవి. ద్వితీయ భాగమున బసవఁడు 'అఱువత్తురు ముప్పూఱ కూర్మి బంటుగా షోడసుల సుతుఁడుగా తేరసుల భృత్యుఁడుగాఁ' త్రివిధముల స్తుతింపఁబడినాఁడు.

దీనిలో మొదటిభాగమున ప్రధానమకుటమే కాక దానికిఁ బూర్వము 'నీవె దిక్కు' 'శరణ్యమయ్య' 'నీవంగడ మేఁ జుమయ్య' మున్నగునవి 'బసవా బసవా బసవా వృషా ధిపా' యను మకుటమునకుఁ బూర్వమం దున్నవి. ఇందు భగవంతుని భక్తిభావనచే 'మహోత్సుకత' దీనగతి' 'గౌరవ లీలఁ' బ్రణుతించి యన్నివిధముల చేతను 'సంతతముఁ' బ్రార్థింతునని చెప్పుకొన్న భాగ మద్భుతభక్తి సమన్వితమై యున్నది.

> "ఖ్యాత యశః ప్రపూరిత జగత్త్రితయాయ నమోనమో మహా
> పాతక ఘాతుకఘ్న పద పద్మయుగాయ నమోనమో సము
> ద్ద్యోత వృషాయ తేయనుచు నుత్సుకతన్ బ్రణుతింతు..."
> "ఆప్తగణ ప్రవిష్ట సకలార్తి హరాయ నమోనమో సుఖా
> వాప్తికర స్మితాంచిత కటాక్షదయాయ నమోనమో సము
> ద్దీప్త గుణాయతే యనుచు దీనగతిన్ బ్రణుతింతు..."
> "కల్పిత జంగలింగము సుఖ స్ఫురణాయ నమోనమో యసం
> కల్ప వికల్ప మార్గకథిత ప్రథితాయ నమోనమో గుణా
> కల్పవరాయతే యనుచు గౌరవలీల నుతింతు..."

"చూర్ణిత మన్మథాయ పరిశోభిత భస్మవిలేపనాయ సం
పూర్ణ మనోరథాయ గతపూర్వ భవాశ్రిత నర్తనాయ తే
వర్ణనిరాసకాయ సశివాయ నమోయని సంతతంబు నిన్
వర్ణన చేయువాఁడ..."

మఱియు, నీతఁ డెనిమిది భాషలలో బనవని స్తుతించి తన యష్టభాషా పాండిత్యముతోపా టనన్యభక్తిని వెల్లడి చేసినాఁడు.

"హృన్నళినే స్మరామి భవదీయ పదద్వితయం భవాటన
స్విన్న తనుశ్రమాపహ మశేషజగత్ప్రణుతం సదేశ ని
ష్పన్న దయానిధే..."

యని సంస్కృతమునను,

"పరమనె యెన్నె యాండవనె పన్నగతానె యనాథనాథ నే
పెరియవనే పుళిందవనె పేరుడయానె పిరాన యప్ప నే
తిరిమురి యయ్యనే..."

అని ద్రావిడభాషయందును,

"హసులెయ యెన్న రక్షిసువు దారయ దెన్నవనీత వెందు మ
న్ని సువుదు నిమ్మడిం గెరగు నిమ్మప్రసాదియె నిమ్మతొత్త నే
కసిగతి..."

అని కన్నడభాషయందును,

"దేవవరా తుమ్హిచ గురుదేవ మ్హణూను తణ మ్హాద గో
పావతురా తుమ్హిచ త్తుమసాచ ప్రసాద అమీ కృపాకరా."

అని ఆర్యభాషలోను,

"అనయముఁ జేతులందు భవదంఘ్రి సరోజయుగం నమామి నె
మ్మనమున సంస్మరామి యను మాటల నిట్ట వరివస్యరోమ్యహ
మ్మనుచు..."

మణిప్రవాళమునను, అరుదుమణి ప్రవాళమునను, వాగ్ధ్యేయమణి ప్రవాళమునను, జాను తెనుంగునను, పెక్కు భాషలు కలిపి యొక్క పద్యమున స్తుతించి సోమనాథుఁడు తన యష్టభాషావైదుష్యమును పరమేశ్వర స్తోత్రమునకై వినియోగించి ధన్యాత్ముఁడైనాఁడు.

పై ప్రకార మాతఁడు శివస్తోత్రలహరిలో నోలలాడి, ద్వితీయభాగమున శివభక్తుల లీలలను సంస్మరించినాఁడు. ఈతఁడు స్మరించిన శివభక్తులు వీరు : శివనాగయ్య, బిజ్జలుఁడు, ఫణిహారి, సంగయదేవుఁడు, మడివాలు మాచన్న, కిన్నరయ్య, కక్కయ్య, చోడిలదేవర బాచిరాజు, వల్ల ప్రభుఁడు, మాదర చెన్నలింగము, మోళిగ మారయ్య, కలికేత బ్రహ్మయ్య, ముసిడిగ చౌదరాయఁడు, కన్నడ బ్రహ్మయ్య, సుంకర బంకిదేవుఁడు, తెన్గు బొమ్మయ్య, చెన్న బసవన్న, సురియ చౌడయ్య, శృంగి బొప్పయ్య, మొఱటద వెంకదేవు, హాలినహాళ్ళి కల్లిదేవుఁడు, అరియమరాజు మొదలగువారు. వీరిలోఁ గొందఱకు శివుఁడు కూర్మి బంటుగను, కొందఱకు సుతుఁడుగను, మఱికొందఱకు భృత్యుఁడుగను గానవచ్చినట్లు విదితము చేసినాఁడు.

ఈ శతకమునఁ బాల్కురికి సోమనాథుని పాండిత్య వైదగ్ధ్యములు, అభిరుచులు, నధికముగాఁ గానవచ్చుచున్నవి. సోమనాథుఁడు సంగీత శాస్త్రపారంగతుఁడగుట బసవేశ్వరుని "గానరస ప్రవీణునిగా" 'సముదంచిత నాదకళా కలా

పునిగా' 'నాదకళా వినోదునిగా' 'వినుత నవీనగాన గుణ విశ్రుత భక్తవిధేయకాయు'గాఁ బ్రస్తుతించి యున్నాఁడు.

మఱియు, సోమనాథుఁడు జంగమలింగార్చనావిశారదుఁ డగుట దన గురుదేవుని 'శ్రీ గురులింగమూర్తి' గా 'జంగమోత్తుంగు' గా 'జంగమ వితాన దయావిహితావగాహుని' గా 'జంగమ సమీహితకారి గుణావకాశునిగా' 'శ్రిత జంగమ పాద కిరీట కూటుని' గా స్తోత్రము చేసి యున్నాఁడు.

ఈతఁడు మహావిరాగ సంపన్నుఁడై యీశ్వరుని 'భవపాశ వితాన ముక్తుని' గను ఈ భవవ్యాధికి నీవె మం' దనియు 'భవాదిరోగ సద్వైద్యుఁడనియుఁ బలువిధములఁ గొనియాడినాఁడు. విశిష్టాద్వైత సంప్రదాయానుసారము శివ భక్తి కళత్రుని' గాను 'పరిరంభిత భక్తి కళత్ర గాత్రుని' గను—ప్రార్థించియున్నాఁడు.

సోమనాథుఁ డష్టభాషాకవి; అనేకోత్కృష్ట గ్రంథ కర్త. కవితాచార్యుఁడు, యతీశ్వరుఁడు, శైవదేశికుఁడు, వేదవేదాంగవేత్త, వేదభాష్యకారుఁడు, గొప్ప తార్కికుఁడు, మహావిరాగి, విజ్ఞానశాలియని పిడుపర్తి సోమనాథుఁ డన్న వాక్యములకెల్ల నీ శతకమునఁ బ్రమాణములు కానవచ్చు చున్నవి.

సోమనాథుని శైలీరమ్యత ప్రశంసాతీతము. సంస్కృత పదభూయిష్ఠమైన యీతని కవితాలహరి గంగాప్రవాహ

వేగాతి వేగగమన వైఖరిగలది. ఈ కవికిఁగల యోజోగుణ సంపత్తికి;

"విరచిత శుద్ధ సాళగ నవీన మృదుస్వర మంద్ర మధ్యతా
రరుచిర దేశిమార్గ మధుర స్వరగీత సుధాతరంగిణీ
తరల తరంగజాల సముదంచిత కేళివిలోల..."

"అసమశిలీముఖస్ఫుర దహంకృతి కర్తన కర్మ కర్మఠా
భ్యసన ధురీణ విభ్రమ గణాధిప పాదసరోజ సంతత
ప్రసృమర సౌరభోరు మకరందక సిక్త వనక్రియాకళా
వ్యసన..." మొదలగు పద్యము లుదాహరణములు.

ఇందు మొదటిభాగమునఁ గల పద్యము లించుమించన్నియు సంత్యప్రాస నియమము కలవి. ముక్త పదప్రాసములకు శబ్దాలంకారములకు నీ శతకము పుట్టినిల్లు, వృత్త్యనుప్రాసములు శబ్దావృత్తులు ననేకములు గలవు.

"గురుపద పద్మసద్మ యవికుంఠిత జంగమశీల ఖేల సు
స్థిర మృదు పాదమోద సముదీర్ణ విశేష మహత్త్వతత్త్వ ని
ర్భర భుజశౌర్య ధుర్య పరిరంభిత భక్తి కళత్రగాత్ర..."

"ఇహపరసిద్ధ సిద్ధ బసవేశ్వర ఈశ్వరభక్త భక్త హృ
ద్గహన విలోక లోకహిత కారణ కారణజన్మ జన్మదో
షహరణ దక్ష దక్షరిపు సన్నిభ సన్నిభరూప రూప ని
ర్వహణ..."

"సురవర పూజ్య పూజ్య గుణశోభిత శోభితరూప రూపవి,
స్ఫురితరశీల శీల గుణపుంగవ..."

మొదలగున వనేకములు చూపవచ్చును.

సోమనాథుఁ డంతటి శైవమతోద్ధారకుఁడయ్యు శివ విష్ణ్వభేదము గలవాఁడనుట కొక్క పద్యముగలదు; ద్రౌపది మానభంగము కాకుండ వలువలొసఁగి కాపాడిన శ్రీకృష్ణుని బసవస్వరూపునిగా స్తుతించినట్లీ క్రింద పద్యము సాక్ష్యమిచ్చు చున్నది.

"వేఁడిన మిండజంగమము వెక్కసమందఁగఁ దత్సభాస్థలిన్
నాఁడట నారి వల్వలువ నైజపుమానము దూలకుండఁగాఁ
బోఁడిమిఁ బట్టుపుట్టములు ప్రోవులు పెట్టిన పుణ్యమూర్తి! నీ
వాఁడఁ జుమయ్య..."

వృషాధిప శతకము మహాభక్తి సంభరితము. జాతి వివక్షతఁ ద్రోసివేసి సకలజీవులకు తన స్వరూపమును బోధించున దీతని నూతన శైవజాతివ్యవస్థ. ఈతఁడు శివుఁడు :

"తంగెటి జున్ను ముంగిటినిధానము పండిన కల్పకమ్ము ముం
గొంగున ముత్తియంబు..."

ననియు నాతని :

"దీప్రము నీ మహామహిమ దివ్యము నీ మహనీయ విక్రమం
బ ప్రతిమంబు నీచరిత మాద్యము నీనిజరూపము..."

అని చేసిన స్తోత్ర మెంతయుఁ బ్రశంసనీయమై శివ భక్తులకు మహాకవచముపోలె నుపయోగించుచున్నది.

విషయవర్ణనమునందు నీ శతకము ప్రౌఢవర్ణనలతో నున్నది. కాలకూట విషమును గ్రుక్కిటనుంచిన శివుని వర్ణన మిందులకుఁ దార్కాణము.

"చిత్తజవైరి విక్రమము చెప్పుదు చెప్పుదు త్రావనోడి తాఁ
గుత్తుక నిల్పె నంచుఁ గడుఁ గ్రూరతరంబగు కాలకూటముఁ
గుత్తుకబంటి గ్రోలిన యకుంఠిత విక్రమచక్రవర్తి..."
శివుఁడు.

అనేక విధముల మహాశివస్తోత్రము నద్వితీయముగా జరిపి పిమ్మట భగవద్భక్తులగు వీరపురుషుల యారాధనమున మైమఱచి శివసేవయే కాక శివభక్తసేవ చేసిన మహాత్ముఁడు సోమన. తుద కీతఁడు మహోద్రేకపూరిత మహాభక్తి హృదయముతో బసవేశ్వరు నెట్లు మైమఱపునఁ బిల్చుచున్నాఁడో :

"బసవనిధానమా! బసవభవ్యనిధీ! బసవామృతాంబుధీ!
బసవ మహానిధీ! బసవ బ్రహ్మగిరీ! బసవామరద్రుమా!
బసవ మహాబలీ! బసవ బండరువా! బసవోల్లసన్మణీ!
వసిగని ప్రోవుమయ్య! బసవా! బసవా! బసవా! వృషాధిపా!"

ఇంతియే కాక, తాను స్త్రీరూపాను సంధానముచేసి కొని బసవేశ్వరుని నిజభర్తగా నెంచి యాతనికై యోగ సమాధిలోఁ బడి తేటి యెట్లు పలవించుచున్నాఁడో :

"నా యొడయండ! నా విభుఁడ! నా హృదయేశ్వర! నా మనోరమా!
నా యిలవేల్ప! నా వరుఁడ! నా గురులింగమ! నాదు జంగమా!
నాయధినాథ! నా వరద! నన్నుఁ గృపామతిఁ బ్రోవుమయ్య! దే
వా! యమిబృందవంద్య! బసవా! బసవా! బసవా! వృషాధిపా!

ఇదియేకదా జీవేశ్వరులకు విశిష్టాద్వైతులు కల్పించిన నాయక నాయకీభావము!

పైని బేర్కొనినరీతి నీతని కవిత్వము రమ్యాతి రమ్యము నిర్దుష్టము; శైలీరమ్యత నిరుపమానము; వర్ణన వైదగ్ధ్యము వర్ణనాతీతము. పాండితీగరిమ మపారము.

నిజముగా శైవమతస్థాపకుఁ డగు బసవాచార్యుఁడు మహావీరపురుషుఁడు. ఈతని చరిత్రమునకు జవజీవముల నొసఁగి దివ్యతేజస్విగాఁ జేసినవాఁడు సోమనాథుఁడు. మఱియు, నిజసేవాతృప్తికన్న నిజభక్తజన సేవాభాగ్యము గన్న యుపభక్తులవలన నెక్కువ తృప్తినందు నీశ్వరతత్త్వము వెల్లడించి నిజమతావలంబకులైన మహాభక్తుల స్మరణ పూర్వకముగాఁ దన వీరారాధనపరత్వమును వేనోళ్ళఁజాటి యత్యంత శ్లాఘనీయముగాఁ జేసిన యీతని వృషాధిపశత కము శతకములలో ద్వితీయమే యైనను నిజమున కద్వితీయమే ఈ వృషాధిప శతకము శతక వాఙ్మయారామమున వెల సిన—ఎన్నఁటికిని వాడిపోని—దివ్యసౌరభ విలసితమగు రమ ణీయ ప్రసూనము.

ఇంతవఱకును బంద్రెండవ శతాబ్దమున జనించిన శివ తత్త్వసార వృషాధిప శతకములఁ జూచితిమి. ఇంతకు మించి ద్వాదశ శతాబ్దమున శతకవాఙ్మయమునఁ గల విశే షము లేమియును గానరావు, కాని, పంద్రెండవ శతాబ్దాంత మున బద్దె భూపాలుఁడు నీతిశాస్త్ర ముక్తావళికిఁ బూర్వము 'సుమతి శతకము' లిఖించినట్లు (శ్రీ) వంగూరి సుబ్బారావుగా రాతని చరిత్రమును పంద్రెండవ శతాబ్దమునకుఁ జెందినట్లు

వ్రాసియున్నారు. బద్దెన 'సుమతిశతక కర్త' కాకపోవుటచే నీ శతకమును గొంచె మవలవైచి పదుమూఁడవ శతాబ్దమునకుఁ జెందిన 'సర్వేశ్వర శతకమును' ముందు పరీక్షింతము. ఇందుఁ జాలవఱకు కిష్టదైవరూప లీలావిభవ స్తోత్రమే యుండుటచే భాషావిషయమునఁ బరమ నిర్దుష్టమగు శైలియం దున్నదనుట తక్క, ప్రాఁతపదములు, కవితా లోపములు మచ్చున కొక్క టైనను గానరావు. సలక్షణమైన జీవభాష కలదు.

౬

పండ్రెండవ శతాబ్దమునందు వలెనే పదుమూఁడవ శతాబ్దమునందును మనకు లభించినవి రెండుమూఁడు శతకములే కానవచ్చుచున్నవి. కాని, యనేక శతకము లింకను నుండి యుండవలె ననుటకు దేవకీనందన శతకమునఁ గల యీ క్రిందిపద్య మాధారమగుచున్నది.

"కొండల్వంటి కవీశ్వరుల్ శతకముల్ గూర్పంగఁ గోటానఁగో ట్లుండన్ ..."

ఈ శతకము మొదటఁ దలఁచినట్లు పదుమూఁడవ శతాబ్దమునకుఁ జెందకపోయినను బదునాల్గు పదునైదు శతాబ్దముల మధ్యనుండియుండవలె నన్నను నప్పటికే శతకములు 'కోటానకో' ట్లుండవలెఁగదా! దీనినిబట్టి యొక పదునాల్గవ శతాబ్దముననే కాక పదుమూఁడవ శతాబ్దమునందు ననేకములు పుట్టియుండవలెను. కాని, మనకు లభించినది 'సర్వే శ్వర శతక' మొక్కటే. శివదేవ మంత్రి 'శివదేవధీమణీ'

యను మకుటము గల శతకము వ్రాసినాఁడనుట కాధారము లున్నవి. కాని గ్రంథము లభించుటలేదు.

ఏది యెట్లున్నను పదుమూఁడవ శతాబ్దమున లభించిన దొక్కటేనైనను నదియొక మహారత్నము; వజ్రపుఁ దునుక; అమృతఘుటిక. సర్వేశ్వర శతకము శైవసంప్రదాయాను సారియు భక్తితత్త్వ ప్రతిపాదకము నగు నుత్కృష్ట శతకము. ఇష్టదేవతా లీలా విభవాదులతో నిండి పరమేశ్వర సంబోధనములతో నున్న వృషాధిప శతకమునందువలెఁ గాక యిందు నామరూప లీలాతీతుఁడైన సర్వేశ్వరుని భావారాధన మద్భుతముగా వెల్లివిరిసినది. భాగవత గుణాభివర్ణనము వైశిష్ట్యమును గాంచినది.

ఈ సర్వేశ్వర శతకమును రచించి నాతఁడు దివ్యమహిమోపేతుఁ డగు యథావాక్కుల అన్నమార్యుఁడు. ఈతఁ డారాధ్య బ్రాహ్మణుఁడు; యజుశ్శాఖాధ్యాయి; ఆత్రేయస గోత్రుఁడు. గోదావరి తీరస్థ పట్టిసగ్రామాంతర్గత వీరభద్రస్వామిని సేవించుచుఁ గొంతకాల ముండి శ్రీశైల యాత్రకు వెడలి తిరిగి వచ్చుచుఁ గృష్ణాతీరమున విశ్వామిత్రాశ్రమ మనఁబడు సత్రశాల యను పుణ్యస్థలమున శ్రీ మల్లికేశ్వరస్వామిని సేవించుచు సర్వేశ్వర శతకమును విరచించెను.

ఈతని శతకావిర్భావావసరమున నొక యద్భుతగాథ ప్రచారమున నున్నది. ఇది యమానుషమని తీసివేయ నవ

సరము లేదు. మహాభక్తుల విషయమున నిట్టి వనేకములు నేఁడును గానవగుచున్నవి.

ఈతఁడు కృష్ణానదీతీరమునఁ గూరుచుండి యొక్కొక్క పద్యము నొక తాటియాకుపై వ్రాసి దానిని గృష్ణానదిలోఁ బడవైచువాఁడు. అది ప్రవాహమునకుఁ గొట్టుకొనిపోక యెదురీది వచ్చినా యది గ్రాహ్య మనియు, నట్లు రానిపక్షమునఁ దనశిరమునకు గండకత్తెర వైచుకొనుటకును నాతని నిర్ణయము. ఈ ప్రకార మాతఁడు విరచించిన యెనుబదియాఱు పద్యము లటులనే యెదురీది రాఁగా, వాని నొక సూత్రమున గ్రుచ్చి యుంచిన పిమ్మట నెనుబదియేఁడవ పద్యము :

"తరులం బుష్పలు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హర మీపాద పయోజ పూజితములై యత్యద్భుతం బివ్విరుల్
కరులా నశ్వములా ననర్ఘమణులాఁ గర్పూరమా హారమాఁ
దరుణీ రత్నములాఁ బటీరతరులాఁ దథ్యంబు సర్వేశ్వరా."

అనునట్లు రచించి ప్రవాహమున వేయ నది యెదురీది రాలేదు. వెంటనే యాతఁడు శిరచ్ఛేదనమునకై గండకత్తెర వేసికొన నుంకించునంతలో నొక పసులకాఁపరి 'నాకొక తాటియాకు దొరికినది చూడుఁ' డని యిచ్చి యదృశ్యుఁ డయ్యెను. అందుఁ బై పద్యమునకు బదులు :

"ఒక పుష్పంబు భవత్పద ద్వయముపై నొప్పంగ సద్భక్తి రం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోప చారముల నిన్నర్చించుచోఁ బెద్ద నై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీవగుటఁ దాఁ జిత్రం బె
సర్వేశ్వరా!"

అనుపద్య ముండుటఁ జూచి సంతసించి యా రెండు పద్యములను గ్రంథమునఁ జేర్చి మిగిలిన పద్యముల నన్నిటి నా ప్రకారమే ప్రవాహమున వైవ నవి యన్నియు నెదు రీఁది రాఁగా వానినెల్లఁ దన గ్రంథమునఁ జేర్చి ముగింప నీ శతక పూర్తియైనది. తరువాతఁ గొంత కాలమున కాతఁ డా సత్ర శాలయందే సిద్ధినందెను.

సర్వేశ్వరశతకము సద్భక్తి ప్రతిపాదనమున నుత్తమ మైనదగుటే కాక శతకపరిణతిలో వృత్తరచనా విన్యాసమున నోజోగుణాదులచే నుత్కృష్ట కవితాపాటవమున నారి తేఱినదై యున్నది. తన కాలమును నామమును దానే చెప్పుకొన్న శతక కవులలో నీతఁడే ప్రథముఁడు.

ఈ శతకమున, పరమేశ్వర స్వరూప నిరూపణము ఈశ్వరాజ్ఞా శక్తిప్రభావము, అర్చన జపతీర్థముల యంతరా ర్థము, సద్భక్తి సద్భక్తుల మాహాత్మ్యము, పరమేశ్వర భక్త తత్త్వతత్త్వజ్ఞ నిర్ణయము, శివయోగానందము, చిత్తవశీ కరణము, భక్తి సంస్కారఫలము, మొదలగు విషయములు చక్కఁగాఁ బ్రతిపాదింపఁబడినవి.

నిర్గుణుఁడు నిరాకారుఁడునగు నీశ్వరుని కలయూ పెఱుఁ గుట సాధ్యము కాదు.

> "జలజాత ప్రభ వాచ్యుతాదులు మదిం జర్చించి చర్చించి (నీ)
> కలయూ పారయ లేక చిక్కులు పడంగా..."

నితరులకు సమర్థత యేది? అపౌరుషేయము లగు వేదములు సైతము:

"ఒకమా టీసకలంబు నీ మహిమగా నూహించుచున్ వెండియు
న్నొక మాటెద్దియు నీవు గా వనుచు నేయుక్తిం బ్రశంసింప నే,
రక...చిక్కువడ్డ వనినన్..."

ప్రవ్యక్తమైయుండు నిన్ను భావకుఁ డెవ్వఁడును గ్రహింపఁజాలఁడు. ఐనఁ బ్రయత్నించి చూతమన్నను నీశ్వర స్వరూప మగమ్యగోచరము. విశ్వేశ్వరునకు విశ్వప్రవృత్తి యందు వైరుద్ధ్యస్థితి గానవచ్చుచున్నది. అతఁడు సకలాధీశ్వర పట్టభద్రుఁడు. భిక్షాగామి. అత్యంతశాంత కళాత్ముఁడు, రౌద్రమూర్తి. అతిసౌందర్యాంబికా సంగమగాఢికలోలుఁడు దివ్యయోగి. ఇట్టి ద్వంద్వముల కాకరమైన యాతని స్వరూపముఁ దర్కింపఁ దొరఁకొనుట యజ్ఞానమే యైనను, యథాశక్తి భక్త్యావృత్తులతోఁ ద్రివిధములుగాఁ దోఁచు నీశ్వర స్వరూపానుసంధానము చక్కఁగాఁ జేయఁబడినది.

పరమేశ్వరస్వరూప నిరూపణము

మొట్టమొదట పరమేశ్వరావ్యయరూప మిట్లు నిరూపితము :

"ఏపారంగ నజాండభాండ నికరం బేరూపులోఁ బుట్టి యు
ద్దీపించుఁ మఱి రూపులెల్ల సమసు ప్తింబొంది యేరూపులో
లోపింపం గలయంగ నంతటికిఁ దా లోనై విజృంభించి యే
రూపం బవ్యయమై వెలుంగు నది నీరూపంబు సర్వేశ్వరా!"

తరువాత, సర్వేశ్వరుని స్థూలసూక్ష్మరూపము లిట్లు వర్ణితములు :

"ఆకాశానల చంద్రసూర్య పవమానాత్మజ్ఞ విశ్వంభరా
ప్రాకామ్యాంచిత మూర్తి భేదముల నీ బ్రహ్మాండ నానాఘటా
నీకప్రాకట జీవభావ విలసన్నిర్మాణ కర్మాద్భుతా
స్తోక శ్రీకరమూర్తియై వెలుఁగు నీ స్థూలంబు సర్వేశ్వరా!"

అనియు,

"అతివాగ్జాలమునై యజాండనిలయంబై యాదిమధ్యాంత వ
ర్జిత రూపాధిక నిష్కలంకపదమై సిద్ధాంత మధ్యాత్మ సం
యుతమై కోటిరవి ప్రకాశయుతమై యోంకారమంత్రాది సం
స్తుతమై యేచి యచింత్యమై వెలయు నీ సూక్ష్మంబు
సర్వేశ్వరా!"

అనియు వివరింపఁబడినవి.

పిమ్మట, ఈశ్వరుఁడు త్రైగుణ్యాశక్తిస్వరూపుఁడనియు భువనోత్పత్తి విధించుతఱి బ్రహ్మస్వరూపమున, తత్ప్రభవమున మృడస్వరూపమునను, కల్పాంత సంక్షోభ నటనమున హరస్వరూపమునను వర్తించునని వర్ణించినాఁడు.

ఈశ్వరాజ్ఞా శక్తిప్రభావము

ఈశ్వరాజ్ఞాశక్తియే పవన, హిమధామ, అనల, పానీయ, ఆత్మ, రవి, అంబర, మహీ నలయము లనెడి యష్టాంగములను భువనంబులయందుఁ దద్రక్షణాంగములుగాఁ బుట్టించును. ఈ యాజ్ఞాశక్తియే పుణ్యపాపావళి కారణములుగా మర్త్యులను సురలుగను, సురలను మర్త్యులుగను, నల్పుని ఘనునిగా, ఘను నల్పునిగాఁ గావించి యింద్రజాలము రీతి జీవులను లీలామాత్రముగా నాడించుచుండును. ఈ

శక్తియే రాజరూపమున భూలోకమున దుష్టశిక్షణ, శిష్ట రక్షణలు గావించుచుండును.

అర్చన జపతీర్థముల యంతరార్థము

ఈశ్వరార్చనకుఁ బ్రథమ పుష్పము సత్యము. ద్వితీయ సుమము దయ, విశిష్టము నేకనిష్ఠా సమోత్సవసంపత్తియుఁ దృతీయ కుసుమము. పరమేశ్వరసేవ, తద్భక్తసేవ—ఇవియే జపతపములు.

భవదుఃఖార్ణవయానపాత్రముగాఁ బంచాక్షరీ మంత్రముఁగొని చిత్తశుద్ధితో జపింపవలెను. ఈమంత్ర ప్రాశస్త్య మెట్టిదనఁగా:

"భవదీయానన పంచకంబు వలనం బంచాక్షరీ మంత్ర ము
ద్భవమై తత్పదవర్ణ పద్ధతుల కుంభత్పంచభూతంబు లు
ద్భవనంబై యఖిలంబుఁ బుట్టెను లసత్పంచాక్షరీ మంత్ర మీ
భువనాండంబులఁ దల్లియై మనుచు..."

సమస్త వేదములు శాస్త్రములు నీ పంచాక్షరీమంత్ర భాష్యములే యగును. ఈ పంచాక్షరియే ప్రణవాక్షరమగు నోంకారమైన విధ మిట్లు వర్ణింపఁబడినది:

"సంకీర్ణాతులితాక్షరత్రయము భాస్వన్నాద బిందుక్రమా
లంకార ద్వితయంబుతోఁ గలిసి లీలన్ దివ్యయోగీంద్ర హృ
త్పంకోద్భూతములందు రూఢమగుచున్ బంచాక్షరీ మంత్ర మ
య్యోంకారాత్మకమా..."

కావున, జపమనఁగాఁ బంచాక్షరీ మంత్రజపమే.

తీర్థము లనఁగా

"రమణన్ భక్త సమగ్ర దర్శనము తీర్థశ్రేణి తద్గోష్ఠి తీ
ర్థము తద్దివ్యదయావలోకనము తీర్థంబు..."

"...తత్త్వార్థ మూహింపఁ దీర్థము లందెల్లను దివ్య
తీర్థము భవద్భక్తుండు..."

వేయేల :

"పలుతీర్థంబులఁ గ్రుంకుకంటె మహిలో భక్తాంఘ్రి పానీయముల్
తల మీఁదం జిలికించుకోఁ దగును దీర్థం బాడ భారంబు త
త్ఫల మత్యల్పము భక్తపాద యుగళాం భస్స్పర్శ నిర్భారమై
యలరున్ శాశ్వత భుక్తిముక్తి నిలయంబై..."

అని తీర్థసేవ యంతరార్థము భక్తసేవయే యని ఘోషింపఁ బడినది.

సద్భక్తి సద్భక్తుల మహత్త్వము

సద్భక్తి యనంత మహత్త్వము కలది. అది మానవుని బెంచుటలోఁ దల్లియు, రుజాపటల దుష్పీడావిధిక్షోభ వారింప వైద్యుఁడును, కుమారక్రీడఁ జొచ్చుతటి రక్షింపఁ దండ్రియు సంపద్వృద్ధి యొసంగుటలో దాతయు నగును. అరివీర ప్రకరమును, మహారోగ మృగములను, సంసార వికార వేదనలను ద్రోలి, వజ్రపంజరమై రక్షించును. సూర్యోదయముతోఁ జీకట్లు మాయమగునట్లు సద్భక్తిభావోదయముతో సమస్త మాయాపటలమును విచ్ఛిన్న మగును. అందుచేతనే భక్తియోగ ప్రాశస్త్య మిట్లుగ్గడింపఁ బడినది :

"అరయం గర్మవిధాన దానవిధివద్ధ్యానోత్తమ జ్ఞానముల్
వరుసం జేర్చిన నాల్గుయోగములు తత్త్వంబెందు నీ భక్తి వి
స్తర బాహ్యక్రియలెల్లఁ బొల్లులగుటన్ దద్భక్తి యోగంబులోఁ
బరఁగం దక్కిన మూఁడు యోగములకుం బ్రాణంబు..."

ఈ సద్భక్తిభావమునకు బలవంతుఁడు : బలహీనుఁడు ; ప్రౌఢుఁడు : మూఢుఁడు ; కులజుఁడు ; నీచుఁడు నను భేదములు లేవు.

'ఒక పుష్పంబు భవత్పద ద్వయముపై నొప్పంగ సద్భక్తి రం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదు.'

ఇట్టి సద్భక్తుఁడు జలధులు మేరల నాక్రమించి పొంగినను గదలఁడు. జలజాతప్రియ శీతభానులు సంచారములు తప్పినను చొప్పు తప్పఁడు. అచలభక్తుఁడు పైకొనివచ్చు కర్మముల వారించి మాయామల జ్వరములు గూల్చి సంసారాబ్ధి లంఘించి పరమవ్యోమమును జేరును.

సద్భక్తుల మహిమ వర్ణనాతీతము. వారికి దయకలిగినచో రౌరవ పదగ్రస్తాత్ముని దేవేంద్రునిఁ జేయఁగలరు. వారికిఁ గోపమే గల్గినచో దేవేంద్రునైనను రౌరవోత్కర పంక ప్రవిలీన కీటకముగాఁ గల్పింపఁగలరు. సద్భక్తుఁ డింద్రుని చతుర్మాస క్రమాయుష్కుఁడే కదా క్షితిపాలుఁ డనియు, నజునాడికాద్వయము వాఁడే కదా యమరేంద్రుఁ డనియు, విష్ణున్నిమేషము వాఁడేకదా బ్రహ్మయనియు వారందఱఁ ద్రోసి రాజని యీశ్వర సాలోక్య సామీప్యస్థితి నందఁగలఁడు. ఆతఁడు భ్రమర కీటన్యాయమున పరమవ్యోమ తత్త్వమున నవ్యయలీల నుండును. అమరేంద్రాచ్యుతాదులకీశ్వరాజ్ఞ యనుల్లంఘనీయము. ఈశ్వరునకు భక్తునాజ్ఞ దాఁటరానిది. కనుక వీ రందఱకన్న భక్తుఁడే మిన్న. ఒక్క మాటలో :

"శివసాహిత్యుల సత్కారస్థలము కాశీక్షేత్ర మాహాస్త్రదే
శవిశాలోన్నత శాఖ లారయఁగఁ బంచక్రోశ మాపాణిసం
భవశోభాన్విత చిత్రరేఖలు మహాభాగీరథీ తీర్థముల్."

భక్త భగవత్సంబంధము

భక్తునకు భగవంతునకు భేదము లేదు. భక్తుల హృదయము భగవంతునిదే యగుటచే భక్తు నెంతటి శక్తివంతులగు ప్రతిపక్షులు హింసింపఁజూచినను, ఈశ్వరుఁడు వారలఁ జంపి భక్తుని రక్షించును. శ్వేతమునీంద్రుఁ జంపఁ గీనాశుఁడే తెంచి యీశ్వర క్రోధానలమున కాహుతి యగుటయు దధీచి శ్రీకృష్ణునిచక్రమును దుత్తుమురుచేసి యుప్పొంగుటయు నిందుల కుదాహరణములు. భక్తుఁ డున్నచోట భగవంతుఁ డెప్పుడు నుండును; ఈశ్వరధ్యాన చిన్మూర్తులై సన్మునులెల్ల నచ్చోటనే యుందురు; మంత్రాంగాక్షరయుతములై సర్వతీర్థములు నచ్చటనే యుండును. మఱియు, భక్తులకెల్ల నీతఁడే హృదయ మగుట వారిసౌఖ్య మాతని సౌఖ్యము, వారికూర్మి యాతనికూర్మి, వారికోప మాతని రౌద్రప్రభావము, వారల వాక్యనిర్ణయ మాతని వాక్యనిర్ణయము. ఆభక్తులకు నాతనిపై స్థిరభక్తిలబ్ధియు నాతని భక్తులతోడి గోష్ఠీ మహోత్సవ లీలావిభవము, నాతని యనుదిన ధ్యానానుమోదములు నిత్యస్థితులు. వారి శ్రీవత్సాంక రమావిశేషత, వాక్ఛ్రీనాథుచాతుర్యము, దేవాధీశ్వరువైభవాతిశయము, తిగ్మాంకు తేజము శ్రీదేవీనందను రూప విభ్రమమును దృణప్రాయములు.

తత్త్వ తత్త్వజ్ఞ నిరూపణము

ఈశ్వరార్చనము, సద్భక్త పుంగవగోష్ఠీవిభవము, విమలసూక్ష్మ ధ్యానయోగము నివియే సంపూర్ణసుఖము లనియు వీనికి స్వర్లోకాధిపత్య సుఖమెందును సీడుగా దనియు గ్రహించుటే తత్త్వము. ఈతత్త్వమెఱింగినవాఁడే తత్త్వజ్ఞుఁడు.

శివయోగానందము

చంచలస్వభావము గల దశప్రభంజనముల శిక్షించి సుషుమ్నమునఁ జేర్చి సూర్యచంద్రులఁ గట్టి మనస్సదనమున నీశ్వరు సుస్థితుఁజేసినఁ గల్గు శివయోగానంద మద్వితీయము, అనుపమము. ఆ శివయోగి లోపల, బయటఁ గలనైనను శివ స్వప్నమే కాంచును.

చిత్త వశీకరణోద్యోగము

పరమేశ్వరునకుఁ జిత్తము వశీకృతము చేయుట :

"అమితోత్సాహము నంది నీకుఁ దన సర్వార్థంబులుం గూర్చి నే
మముతో నిచ్చుటకంటె శౌర్యగుణ సామర్థ్యంబునం జేసి ప్రా
ణము నీకిచ్చుటకంటె దుస్తరభవోన్మాదంబు మర్దించి చి
త్తము నీకిచ్చుట పెక్కు భంగుల మహాదార్యంబు..."

"ఘనవైరి ప్రకరంబుఁ దాఁకి యనిలో ఖండించుకంటెన్ మృగేం
ద్రునిఁ జేపట్టుటకంటె దిగ్గజముతోఁ ద్రోపాడుకంటెన్ మహా
శనిఁదాఁ ద్రేయుటకంటె ఘోరభవదుశ్చారిత్ర వారించి రం
జనతోఁ జిత్తము శిక్ష సేయుట మహాశౌర్యంబు..."

అట్టివానికి !

"దివిజేంద్రత్వముఁ బద్మజత్వము జగత్సేవ్యస్థిరానర్గళో
త్సవరూపం బగు కేశవత్వమును నీసద్భక్తి సంవృద్ధిలో
లవ మాత్ర స్థితులు........."

భక్తి సంస్కారఫలము

భక్తి సంస్కారము కల మహాత్ముఁడు 'విదితోద్దండ ప్రతాపోత్కటస్ఫుటకోపానలమూర్తియై యముఁడు కొంపోకుండఁ గాచుకొనఁ గలఁడు. అతఁడు దారసమన్వితుఁడైనను గందర్పుని మిగుల నీఁడు, మోహాంబుఁ బైకొననీఁడు, రాజ్యవైభవము కల్గినను గర్వింపఁడు.

ఈశతకమునందుఁ దత్కర్త సద్భక్తపుంగవుఁడుగా, మహావిరాగ సంపన్నుఁడుగా, యోగీంద్రుఁడుగా, మహాకవిగాఁ గాననగుచున్నాఁడు. ఈతఁడు వైరాగ్యబోధఁ గావించుచు:

> "కాయం బన్నది వారిబుద్బుద సదృక్షం బందు రూపింప లేఁ
> బ్రాయం బన్నది శారదాంబుద తటి త్ప్రఖ్యం బగుం దత్సుఖ
> శ్రేయం బన్నది మాయ..."

యని యద్భుతముగాఁ దెలిపినాఁడు. ఈతని ప్రౌఢ వర్ణనలు శివయోగిని వర్ణించుటలోను, భ్రమరకీటన్యాయము, శివనామాంకము మొదలగు విషయబోధనములం దద్భుతముగా నొప్పినవి. ఈ శతకమందెల్లఁ బ్రౌఢవర్ణనములతో, నపూర్వ సాదృశ్యములతో భక్తిపూరిత హృదయముతోఁ గవి ప్రతిభావ్యుత్పత్తులు వెల్లడియగుచున్నవి. ప్రతి పద్యము నందును నచంచల భగవద్భక్తి, యపూర్వాధ్యాత్మిక విజ్ఞానము, నద్భుత కల్పనములు వెల్లివిరియుచున్నవి.

"అనురాగంబున నిన్నుఁజూచు దలపోయుం జొక్కుఁగాంక్షించు వ
ర్ణన సేయం దమకించు సిగ్గువిరియుం బ్రార్థించు శోషించు నం
త నిదిధ్యాసముఁ దాల్చుఁ దన్ను మఱచున్...

అను చోటను,

"సికతాధామముచేసి నీకు మదిలోఁ జెన్నొంది క్రీడించు బా
లకు లింద్రాధికు"

లనుటయు,

"వేడ్కం దన ప్రాణవల్లభునితో సంయోగ మర్థించుఁగా
కతనిం బ్రార్థనచేసి సొమ్ముఁ గొనిపో నట్టాడునే..."

యనియు నన్న చోటులను,

పంచేంద్రియోద్వృత్తమైన చిత్తమునకు నీఁగకును, భవపంక నిమగ్నమైన విలాసమునకు జీవికి, ఈశ్వరదివ్య శృంగారధ్యానమునఁ జిక్కిన చిత్తమునకు మహీయ జ్యోత్స్నానందమునందు చకోరపోతమునకు, ననలోత్పాదమున కాధారమైన కాష్ఠములు ననలము గాల్చుటను, దేహసత్కర్మమథనముచేఁ గలిగి, రెండింటిని జెఱచు సర్వేశ్వరభక్తి వహ్నిగాను, బోల్చిన పోలిక లద్భుతములు.

వృత్తరచనా విన్యాసమున నీకవి హస్త మారితేఱిన దనుటకు బూర్వోదాహృత పద్యములే సాక్షిభూతములు. ఈతని కవిత్వ మోజో ప్రసాద గుణసంభరిత మనుటకు వరుసగా రెండుదాహరణములు చూచినఁ జాలును. ఓజో గుణమునకు :

"ఉరుసంసార గజేంద్ర దర్పదళనవ్యూఢ ప్రతాపోగ్ర కే
సరి దుష్ప్రాపశరీరబంధ విపులక్ష్మాజ వ్రజచ్ఛేద వి
స్ఫురిత క్రూరకుఠారధార దురిత ప్రోద్భూత జీమూత దు
స్తర సంఘాత విఘాత మారుతము నీ సద్భక్తి సర్వేశ్వరా."

ప్రసాదమునకు :

"ఎచ్చోఁ నీ పదభక్తుఁ డుండు మది నింపెక్కం బ్రయత్నంబుతో
నచ్చో నీ వనిశంబు నుండుదు త్వదీయధ్యాన చిన్మూర్తులై
యచ్చో సన్మును లెల్ల నుండుదురు మంత్రాంగాక్షరాయుక్తులై
యచ్చోఁ దీర్థము లెల్ల నుండు నిది వేదార్థంబు సర్వేశ్వరా!"

ధారాశుద్ధికి గ్రంథమంతయు నుదాహరణములుగా నీయవచ్చును. ఈతని ప్రతి పద్యమును భాషామాతకొక నూతనాలంకారమే యగును.

మొత్తముమీఁదఁ గవి చెప్పికొన్న ట్లీతని శతకము భక్త జనాను రంజకముగాఁ జిత్రార్థాంచిత శబ్దబంధుర ముగా, సేవ్యమై సజ్జనశ్రోత్రానంద కరంబుగా, శుభాంచి తమై యున్నదనుటలో నతిశయోక్తి యించుకయు లేదు. శత కములలో నిది తృతీయమే యైనను, ప్రౌఢిమలో, భావ ములో, భాషా సౌందర్యములో నుత్త మోత్తమమైనది.

పదుమూఁడవ శతాబ్దిలో వెలువడిన శతకములలో నొక్క సర్వేశ్వర శతకమే మనకుఁ బూర్ణముగా లభ్యమయి నది. దాని పరిశీలనముతో నాశతాబ్దము పూర్తియైన దన వచ్చును. కాని, పదుమూఁడవ శతాబ్దాంతమున (క్రీ. శ.

1270) విశ్వేశ్వర శివదేశికు లనఁబడు శివదేవ మంత్రి యొక శతకమును విరచించినట్లు మనకుఁ గొన్ని యాధారములు లభించుచున్నవి. ఈ శతక మింతవఱకు నెవ్వరికిని లభ్యము కాలేదు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు త్రిపురాంతకోదాహరణ పీఠికలో నీ క్రిందిపద్యము శివదేవయ శతకము లోనిదని యుదాహరించిరి.

"అరయఁగఁ బిన్న నాఁట సిరియాలుఁడనై యెలఁ బ్రాయమందు సుం
దరుఁడను నంబినై పదను దప్పిన గుండయగారి చందమై
ధరఁ జరియింపఁ గల్గినఁ దథాస్తు వృథాపరిపాక రూప దు
ష్కర జననం బిదేమిటికిఁ గాలుప నే శివదేవధీమణీ!"

ఇంతకుమించి మఱియొక యాధారమేమియును లేదు. ఈశతకము శివదేవయ్యపై నితరులు రచించినదో శివదేవయ్యయే తన నామమకుటముతో విరచించెనో తెలియదు.

విశ్వేశ్వర దేశికులు వేదవేదాంగముల నెఱిఁగిన మహాజ్ఞాని యనియు శైవమతవ్యాప్తిలో పండితారాధ్యుని తరువాత నీతఁడంతటివాఁడై సుప్రసిద్ధి గాంచెననియు, కాకతి గణపతిదేవ చక్రవర్తికి మంత్రియై ప్రజారంజకముగ నుండి 'అనుభవసార' మను నుత్కృష్ట గ్రంథమును రచించెననియు శ్రీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసియున్నారు గ్రంథము లభింపనిదే గ్రంథ కర్తృ నిర్ణయము హాస్యాస్పదమే యగును.

అందుచేఁ బై ప్రకరణమున బద్దెనకాలమునకుఁ దరువాత జనించియుండునని యూహింపఁబడినది సుమతిశతకము. ఏతత్పరిశీలనకుఁ బూర్వము పండ్రెండు పదుమూఁడు శతాబ్దములలో జనించి మనకు లభ్యమైన శతక విమర్శనము ననుసరించి యేతద్విషయ మొకసారి సింహావలోకనము గావింతము.

ఆంధ్ర సారస్వతమునఁ బ్రాఙ్నన్నపార్యయుగమున జన్మించిన కావ్యవిషయములు స్పష్టముగాఁ గానరానట్లే శతక వాఙ్మయమునఁగూడ మల్లికార్జున పండితారాధ్యులకుఁ బూర్వమున శతక వాఙ్మయవిషయ మింతవఱకు గోచరము కాలేదు. నన్నయయే యొక శతకమును వ్రాసియుండెననియు, నాంధ్ర భారతాదిపర్వమునఁ బౌష్యమహాదేవి కుండలములు గొనితెచ్చుట కేఁగి యుదంకుఁడు చేసిన యాదిశేషస్తవము శతకరూపమున నున్నదనియు నన్నమాటలకు విశ్వాసము, విలువ, యెంతయున్నను జారిత్రకముగా నాధారము లేనపుడవి యంతగా నుపకరింపవు కావున, మల్లికార్జున పండితారాధ్యులోని శతకవాఙ్మయ బ్రహ్మగా నంగీకరింపవచ్చును.

పిమ్మట, శైవమత ప్రచారమునకై శైవకవులు మొదట శతక వాఙ్మయము నాధారముగాఁ జేసికొనినట్లు కానవచ్చుచున్నది. బౌద్ధ జైన మతవ్యాప్తికై ప్రాకృత

ములో బౌద్ధులును, జైనులును శతకములు వ్రాయుట నెఱిఁగి మతవ్యాప్తికి కావ్యరూపముకన్న శతకరూపమే యెక్కువ ప్రయోజనకారిగా నుండునని యెంచి కాఁబోలును శైవకవులును శతకవాఙ్మయమును ఆంధ్రమున సృష్టించిరి. వారి యుద్దేశ మేదియైనను, మహానుభావులగు వారి మూలమున మనకొక మహోన్నతవాఙ్మయము లభించినందులకు ప్రథమమున మన మా శైవకవులకు వందన సహస్రము లర్పింతము

ఆ శైవకవి పుంగవులనుండి వెలువడిన వానిలో మొదటిదగు శివతత్త్వసారము వేమన, భర్తృహరి మొదలగు శతకములవలె నూఱు పద్యములకన్న నధికముగాఁ గలిగి నంతమాత్రమున శతకత్వమును గోల్పోవఁ జాలదు. మకుట విషయమ్మునను 'శివా' యను మకుటము గల పద్యములు నూటనలుబదికి మించియున్నవి, మిగిలినవి కొన్ని 'అజా' 'రుద్రా' మొదలగు మకుటములతో నున్నవి. సమగ్రముగా గ్రంథము లభింపనవు డేమియుఁ జెప్పఁజాలము. కవి వివిధ మకుటముల క్రింద నొక యుద్దిష్ట సంఖ్యగల పద్యములు రచియించియుండ వచ్చును. అందుచే 'శివతత్త్వసార' మును 'శివశతక' మన వచ్చును.

శతకవాఙ్మయారంభమున వెలువడిన శతకత్రయము ఉత్తమోత్తమ పండితాఖండలులచే విరచింపఁ బడియుండుట గొప్పవిశేషము. ఈ శతకత్రయకర్తలు మువ్వురును ద్రిమూ

ర్తులే. వారి పాండితీగరిమ, భక్తిజ్ఞానవైరాగ్యసమృద్ధి, ఆచరణపూర్వకమైన బోధనాపటిమ బోధ్యవిషయమందలి సత్యసంధత నిరుపమానములు, నిత్యనూతనములు. అందును మొదటిశతకమునఁ గల మతావేశము, పరమతదూషణము, ద్వితీయ శతకమున లేదు. తృతీయ శతకమున నంతకును క్షీణించి యుత్తమ భక్తిమార్గమును వ్యక్తము చేయుచు, కవితాపాటవమున నారితేఱి యుత్తమ కావ్యముగా మాఱినది. అందుచే శైవకవులు శతకవాఙ్మయ బ్రహ్మలు, శతకవాఙ్మయాభివృద్ధి భిక్షాప్రదాతలు; చిరస్మరణీయులు.



# శ్రీ కాళహస్తీశ్వర శతకము

దివ్యర్షి సంకల్పసముద్భూత మగు మన పావనాంధ్ర సారస్వతారామమున మహాసౌరభవిలసితము లగు నిత్య నూతనప్రసవముల నీని శోభావంత మొనరించినది శతక వాఙ్మయలతానికుంజము. ఈ వాఙ్మయోద్యానమున పురాణేతిహాస ప్రబంధనాటకేత్యాద్యనేకలతా నికుంజముల నెన్నిరకముల సుకుమారకుసుమవ్రజమున్నను, విశిష్టసౌరల విలసిత మగు నీలతానికుంజ మొసఁగిన శోభాశ్రీ యవిరళము, నద్వితీయమును. అందును, శతకవాఙ్మయలతాంతముల నగ్రతాంబూలము నందినది ధూర్జటి యమృతహస్తముల నావిర్భవించిన శ్రీ కాళహస్తీశ్వరశతకము.

## ధూర్జటి మహాకవి

ఆంధ్రసారస్వతరంగమున భక్తాగ్రేసరు లగుకవిపండితులకుఁ దలమానికమై, తన కావ్యకన్యను మనుజేశ్వరాధముల కీయనోపక, శ్రీహరి కిచ్చి తన నిరంకుశత్వముతో పాటు పరమేశ్వరునిపైఁగల పరిపూర్ణవిశ్వాసమును బ్రదర్శించిన పరమపావన జీవుఁడు పోతనకవీంద్రుఁడు. ఈతని హరి భక్తి యద్వితీయము. భగవంతునిపై సమస్తభారమును వైచి, హాలిక జీవనమే గడుపుచు, రాజాశ్రయమున ధనార్జనమే

కాక తృణమైనను గ్రహింప నిచ్ఛగింపక, మహోత్కృష్ట జీవనము ననుభవమునఁ జూపి ప్రపంచమున కాదర్శపురుషుఁ డైనాఁడు పోతన కవియోగి. ఆతని తరువాత నట్టి వ్రతాణుర పరాయరనిగాని, యట్టి నిరంకుశ జీవననిరతునిగాని మన సారస్వత ప్రపంచమునఁ గానలేము; కాని తత్తుల్యుఁ డనఁ దగి పండితుఁడై, పండితుఁడేకాక కవియై, కవిమాత్రుఁడేకాక జ్ఞానియై, జ్ఞానియేకాక విరాగియై, సర్వజ్ఞుఁడునై తన కావ్యకన్య నీశ్వరునకుఁ దక్కనొరుల కొసంగక—

> "నీకుంగాని కవిత్వ మెవ్వరికి నే నీనంచు మీఁ దెత్తితిన్
> జేకొంటిన్ బిరుదంబు కంకణము ముంజేఁ- గట్టితిన్ బట్టితిన్
> లోకుల్ మెచ్చ వ్రతంబు........."

అని దివ్యనిశ్చయనినాద మొనరించిన యీశ్వర భక్తుఁడు ధూర్జటి. తాము జ్ఞానోదయమంది దానిమూలమున తరించి యితరులఁ గూడ తరింపఁజేయఁగల జ్ఞానులు మొదటితరగతి వారు. తా మొక్కరు మాత్రమే తరించి యితరులఁ దరింపఁ జేయఁ జాలక ప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచు నేపక్షి వాలినను మునిఁగి పోవు చిన్న కట్టెవంటివారు రెండవతరగతివారు. ధూర్జటి జ్ఞానియై లోకమునకు జ్ఞానభిక్ష పెట్టిన మొదటితరగతి లోని వాఁడు.

ధూర్జటి భరద్వాజ గోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, బాంధవస్తోత్ర పాత్రుఁడు, పాకనాటార్వేల వంశ ప్రసిద్ధుఁడు. కుమారధూర్జటి కృష్ణదేవరాయల విజయముఁ బట్టియు లింగ

రాజుకవి పెదకాళహస్తి మాహాత్మ్యమును బట్టియు, ధూర్జటి పదునాఱవ శతాబ్దమునఁ గృష్ణదేవరాయల యాస్థానము వాఁడనియు, నష్టదిగ్గజములలో నొకఁడనియుఁ దెలియు చున్నది.

ధూర్జటి రచించిన గ్రంథములు శ్రీకాళహస్తి మాహాత్మ్యమును, శ్రీకాళహస్తీశ్వర శతకమును. అందు శ్రీకాళహస్తిమాహాత్మ్యమునకు "ఈశ్వరుఁడు కాదా మత్ప్రబంధాదిపత్యాగణ్యాగ్రహ్యుఁడు, వేఱొకండు గలఁడే" యని యా 'శుభ కావ్యరత్నమున కీశు నధీశునిఁ' జేసినాఁడు. ధూర్జటి కవీంద్రుఁడు తెలుఁగు రాయలయాస్థానమునఁ గాంచిన విశిష్టస్థాన మీ క్రిందిపద్యముఁ బట్టి తెలియనగును.

> "శ్రీకాళహస్తి గౌరీనాథపదపద్మ సద్భక్తియుక్తి నిశ్చలతఁ గాంచి
> సారసుధాసార సరసోక్తి గుంభనఁ గాళహస్తిమహాత్మ్యకథ నొనర్చి
> కృష్ణరాయకిరీట కీలితమణిగణార్చితపదాబ్జ ద్వయశ్రీ వహించి
> యా సేతు కాశీతటావనీవిఖ్యాతసత్కీర్తి విస్ఫూర్తిఁ జాలవెలసి
> ధరణిఁ దెలుఁగొందె నేకవీశ్వరశతంబు,
> రత్నమ్ము మానీయు ధూర్జటిసుధీంద్రుఁ
> దలఁతు జలనిధివీచికాకల కలాను,
> కారి భూరికవిత్వవాక్పటిమ గులుక"
>
> (లింగరాజకవి, కాళహస్తిమాహాత్మ్యము)

ధూర్జటి కవి పౌత్రుఁడు వేంకటార్యుఁ డనఁబరగు కుమారధూర్జటి. కాని యాతఁ డెట్టిపౌత్రుఁడో తెలియదు. 'ధూర్జటిపౌత్రుఁ' డని యొకచోట, 'పెదతాత'యనియొక

చోట నుండుటచే సంశయాస్పదమైనది. రత్నావళీపరిణయ కర్తయు నతని వంశస్థుఁడుగనే తోఁచుచున్నాఁడు. కాని ధూర్జటి పుత్రునిగుఱించి యేమియుఁ దెలియదు. ధూర్జటి మాత్రము సింగమరమాజక్కయ తనూభవుఁడ నని తన కాళహస్తిమాహాత్మ్యమునఁ జెప్పుకొన్నాఁడు. దీనిఁ బట్టి యీతని వంశవృక్ష మిట్లుగా గ్రహింపవచ్చును.

సింగమ × జక్కయ
|
ధూర్జటి క్రీ.శ. 1530
|
├── కాళియుఁడు
│ |
│ వేంకటార్యుఁడు
│ |
│ లింగరాజకవి క్రీ.శ. 1651
│ |
│ వేంకటరాయకవి క్రీ.శ. 1700.
│
└── ధూర్జటిదుహిత × చెఱుకుమూడి వేంకన
 |
 చెఱుకుమూడి కృష్ణకవి (కుమారధూర్జటి) క్రీ.శ. 1600

ఈ వంశవృక్షమును బట్టి ధూర్జటికి స్త్రీసంతానమును గలదనియును, ధూర్జటి పుత్రుని చెఱుకుమూడి వేంకన కిచ్చినాఁడనియు నామె పుత్త్రుఁడే శృంగార రాఘవము, వాయు దేవ చరిత్రము, మున్నగు గ్రంథముల వ్రాసెననియు, నాతని గ్రంథముల మూలముననే దెలియుచున్నది. ఏది యెట్లున్నను ధూర్జటివంశమువారు కవిపండితులు. ధూర్జటిని గుఱించి వేంకటరాయకవి తనకావ్యమున నిట్లు ప్రస్తుతించినాఁడు.

"పటు గంగాలహరీ తరంగపటు శుంభత్ప్రౌఢతాంచత్కళా
ఘటనున్ బాదవిన ప్రమక్రృష్ణవరరాడ్గం భీరకోటీర వి
స్ఫుట రత్నద్యుతి పాటలీకృత పదాంభోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయకుల కర్తన్ భక్తి రంజిల్లఁగన్."

అందుచే ధూర్జటి సర్వజ్ఞుఁడై, శివభక్తాగ్రేసరుఁడై కృష్ణరాయలవంటి పుడమిరేఁడున్న యుగమునఁ గూడఁ దన కావ్యము నీశ్వరాంకితము చేసి యమరత్వము నందిన పరమయోగీంద్రుఁడు. ఈతని కాళహస్తిమాహాత్మ్యమును, పాండురంగ మాహాత్మ్యము, శివరాత్రి మాహాత్మ్యము మొదలగువానిఁ దలదన్ని వన్నెకెక్కినదానింగా నెన్నవచ్చును.

ఆ గ్రంథ విమర్శన మటుంచి ప్రస్తుత మాతనిపై బయలువెడలిన కొన్ని దుర్విమర్శముల నిట ఖండింపవలసి యున్నది.

ధూర్జటికవీంద్రుని జారునిగా నెంచినవారిలో కవి చరిత్రకర్త కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగము పంతులుగా రొకరు. ఆయన యభిప్రాయమున కాధార మీక్రిందిపద్యము:

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలఁ గల్గెనో
యతులితమాధురీ (చాతురీ) మహిమ... (హా తెలిసెన్ భువనైక
మోహనో

ద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సం
తత మధురాధరోదిత సుధారసధారలు గ్రోలుటం జుమీ.")

దీనిపై వారిభావ మిది

"పై పద్యముఁబట్టి చూడఁగా ధూర్జటికవి సంతత వేశ్యాప్రియుఁ డయిన రసికపురుషుఁ డైనట్టు కన్పట్టు

చున్నాఁడు. అట్టి యఖండ శివపూజాధురంధరుఁడైన భక్తాగ్రేసరు నిట్టి జారత్వదోష మేల విడువకుండెనో యూహింపఁజాలకున్నాము. మనదేశముయొక్క దౌర్భాగ్యముచేతఁ జిరకాలమునుండి యిచ్చట విశుద్ధచరిత్రము మతమునుండి విడిపోయినది." (క. వీ. కవులచరిత్రము.) ఈవిమర్శకుఁ దగిన సమాధానము (శ్రీ) వంగూరు సుబ్బారావుగారు తమ శతకకవుల చరిత్రమున నిచ్చియున్నారు. కృష్ణదేవరాయ లన్న మొదటి రెండుచరణములను కుమారధూర్జటి నుద్దేశించి యనె ననియు, "హా తెలిసెన్" మొదలగునది ధూర్జటి యన్నఁ గిట్టనిధూర్తులదే యనుటయు సమంజసము. కృష్ణరాజ విజయమున నిట్లు కలదు.

"మాధురీమహిమ నామును మీ పెదతాత చాల సన్నుతిఁ గనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభ న్నీను మీవుసట్ల మత్కృత బహుమానవైఖరులఁ గీర్తివహింపుము ధాత్రిలోపలన్." కనుక, నింతమాత్రమున ధూర్జటి జారుఁ డనుట సహింపరానిది.

ఈ విషయమునే శ్రీశేషాద్రిరమణకవులును శ్రీకాళహస్తీశ్వరశతకమునకుఁ బీఠిక వ్రాయుచు కాళహస్తీశ్వర శతకమే ధూర్జటి జారత్వమునకు నిదర్శనమని వ్రాక్రుచ్చిరి. ఇది యసంగతము నసంబద్ధమును. వీరి కాధారము 'కాయల్ గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్ రాయన్ రాపడె ఱొమ్ము' "అమరస్త్రీల రమించినన్ జెడదు

మోహాంబింతయున్" మొదలగు పద్యములంట. ఇందు కవి వర్ణించునది స్వానుభవమే కానక్కఱలేదనియుఁ దనతోడి సోదరజీవుల దురవస్థఁ గనియుఁ దదవస్థలు పద్యముల వెల్లడింప వచ్చుననియు వీరికిఁ దెలియదు. పైఁగా, వధూనఖాగ్రము లన జార కామినులన్న యర్థములేదే? స్వస్త్రీ సంభోగము దోషము కాదే? కనుక ధూర్జటివంటి భక్తాగ్రేసరునికి జారత్వదోష మున్న కృష్ణరాయలు సహించునా? అష్టదిగ్గజములలో నగ్రేసరుఁడై, "కృష్ణరాయ కిరీట కీలిత మణిగణార్చితపదాబ్జశ్రీ" వహింపఁ గలఁడా? కాన, ధూర్జటి ముక్తికామినీలోలుఁడే కాని, వారకామినీరతుఁడు కానేరఁడు, కాఁడు.

శ్రీ వంగూరు సుబ్బారావుగారు ధూర్జటి కాళహస్తీశ్వరశతకమున భారతపద్యములను, శివానందలహరి ననుకరించినాఁడని వ్రాసినారు. ఇది ఆధారరహితము. ఏలన; వారు చూపిన:—

> "మద మాతంగతురంగకాంచనలసన్మాణిక్య గాణిక్య సం
> పదలోలిం గొనితెచ్చి యిచ్చి ముద మొప్పం గాంచి సేవించిరి...."

అను పద్యమునకును, కాళహస్తీశ్వశతకమందలి

> "మదమాతంగము లందలంబులు హరుల్మాణిక్యముల్ పల్లకుల్
> ముదితల్ చిత్రదుకూలముల్ పరిమళంబుల్ మోక్షమీఁ జాలునే"

యను పద్యమునకు నెందును అనుకరణము కానవచ్చుట లేదు. పైఁగా ధూర్జటివంటి మహాకవి యీశ్వరతాదాత్మ్య

మునొంది గంగాప్రవాహ వేగమున రచించిన పద్యముల నొకరి ననుకరింపవలసిన యవస్థ యేమున్నది ?

ఇఁక ధూర్జటి కృష్ణదేవరాయనడుమఁ గల సంబంధముఁ గూర్చి కొందఱి కపోహ గలదు. అందు ధూర్జటి కృష్ణదేవ రాయలచే ననాదరింపఁబడి యభావవిరక్తినంది కాళహస్తీశ్వర శతకమున రాజుల నిందించినాఁడనియు నందుచేతనే యాతనికిఁ దనకృతుల నర్పింప లేదనియు ననువా రున్నారు. "ధూర్జటి శైవుఁ డగుట కృష్ణరాయలు సంపూర్ణదయ చూపలే" దని కొందఱు వ్రాసిచ్చిరి. ఇట్టి విమర్శము లాధారరహితములే కాక మహాకవి ధూర్జటికి మహారాజగు శ్రీకృష్ణదేవరాయలకు నీలాపనింద లొనగూర్చుచున్నవి. కుమార ధూర్జటియు, లింగరాజకవియు శ్రీకృష్ణదేవరా యలు ధూర్జటికిఁ జేసిన గౌరవాదరాభిమానములఁ గీర్తింప నిట్టి విమర్శములకు స్థానమే లేదు. అట్టి వ్యతిరేక భావమే యున్న ధూర్జటి శుణమైన నాస్థానమున నుండునా ? అష్టది గ్గజములలో నొకఁడగునా? కృష్ణరాయలు మతాంతరసహన మునకుఁ బేరెన్నికఁ గన్నవాఁడు. కనుక నిట్టి విమర్శన లాధారరహితములు. ఇఁక ధూర్జటి రాజుల నిందించుటకుఁ గారణ మాదినములలో రాజాస్థానముల జరగుదారుణములు నుత్తములు పీడింపఁబడుటయుఁ గాంచియుండుటే.

ధూర్జటి కాళహస్తీశ్వరశతక మాంధ్రసారస్వతమున గొప్పస్థాన మాక్రమించినది. ప్రాచీనకవులు సైతము కాళహ

స్తీశర శతకమునకు వాఙ్మయమున నున్నతస్థాన మిచ్చిరనుట కుదాహరణముగా వెచ్చ కస్తూరి రంగకవి తన యానందరం గరాట్ఛందో గ్రంథమున "నీకుంగాని కవిత్వమెవ్వరికి నేనీ నంచు మీఁదెత్తితిన్" అను పద్యమును నభేదయతి కుదాహ రించియున్నాఁడు. ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యమును రచిం పకపోయినను వాఙ్మయమునకు లోటులేదు; కాని కాళహస్తీ శ్వర శతకము లేనిచో గొప్పలోటే యగును. అల్లే తిమ్మకవి కుక్కుటేశ్వరశతకమును. దీనిని గుఱించి కీ. శే. శ్రీకాశీనా థుని నాగేశ్వరరావు పంతులుగా రిట్లు వ్రాసియున్నారు. "రసానుభవము కావ్యమునకుఁ బ్రయోజనము. నవరసము లందును శృంగార కరుణరసములు ప్రధానములు. శృంగారక రుణారసములు కామపరమైనపుడు బంధమునకు, దైవపరము లైనపుడు మోక్షమునకు మూలములగుచున్నవి. శృంగారక రుణామూర్తి యగు భగవంతుని శృంగారకరుణాలీలావిలా సము లనంతములు. అనంతమైన శృంగారకరుణావిలాసముల యానందానుభవమున కనన్యమైనభక్తి సాధనముగ నున్నది. అనన్యమైన భక్తిపారవశ్యానందమును వర్ణించుటకు శతక ములే యోగ్యములు. అందు,కాళహస్తీశ్వర శతకమొకటి." మఱియు నిందు ధూర్జటి కవిభక్తి పాండిత్యజ్ఞానవైరాగ్యముల నొక్కఁడై తనస్వానుభవ భక్తిముక్తిమార్గముల సందర్భోచి తముగా, మహానుభవపూర్వకముగాఁ జేసి వాక్రుచ్చియు న్నాఁడు. వివిధవ్యవస్థలలో వివిధవిషయ లోలురగు విశ్వజనా

వని సకలపరిస్థితుల కనుగుణముగా నిందలి పద్యము లున్నవి. మానవమానసముల వివిధకాలముల, వివిధవిషయములపై జనించు సమస్తసమస్యలకుఁ జక్కని పరిష్కారపద్ధతు లీశతకమున గలవు. అందుచేఁ గాళహస్తీశ్వరశతకము పరమపవిత్రము, భక్తిజ్ఞాన వైరాగ్యసంబోధకము, ముక్తికన్యాప్రదాత్రియు ననక తప్పదు. ఈ కాళహస్తీశ్వరశతకము ధూర్జటి చేతిలోఁ శతకము పరిపూర్ణస్థితికి వచ్చినదని నిరూపించుటకే గాక సమస్తవేదోపనిషత్సార మిందుఁ దేటతెలుఁగు మాటలలోఁ దేనెచినుకులుగాఁ జల్లఁబడిన వనుట కనేక నిదర్శనము లిందుఁ గలవు. అందుచే నిది యాంధ్రవాఙ్మయమున కాయువుపట్టు, నాధ్యాత్మికజీవనమున కాదర్శప్రాయము నని చెప్పకతప్పదు.

ధూర్జటి మహాకవి రచించిన కాళహస్తిమాహాత్మ్యము పైని పేర్కొన్నవిధమున నాంధ్రసారస్వతమునఁ గల మాహాత్మ్యముల కెల్ల మహోన్నతస్థాన మాక్రమించుననుట యతిశయోక్తి కాదు. ఈగ్రంథము నవరసాలంకార కవితామహాకావ్యము. ఇందు ధూర్జటి పరమభక్తుఁడుగా, రాజయోగిగా, సరస్వతీ ప్రసన్నుఁడుగాఁ గానవచ్చును. ఈమాహాత్మ్యమందలి శివభక్తాగ్రేసరు లీతని కాదర్శ ప్రాయు లగుట వారివల్లఁ దాబొందిన భక్త్యుత్సాహములకుఁ గృతజ్ఞతాపూర్వకముగా వారిని తన కాళహస్తీశ్వరశతకమునఁ గీర్తించి యున్నాఁడు. అందుచే ధూర్జటి గ్రంథములు అవినాభావసంబంధము

గలవి. కాళహస్తిమాహాత్మ్యము నందలి కథాక్రమము తెలిసి
ననే కాని శతకమందలి కథాసందర్భము లర్థముకావు. ఈ
రెండు గ్రంథములు శివుని మాహాత్మ్యము నుగ్గడించుటే కాక
కవితాసౌష్ఠవమున నేమి, పాండిత్యప్రకర్ష చే నేమి, భావగాంభీ
ర్యౌన్నత్యము చే నేమి, ఆంధ్రభాషాయోషామణి కమూల్యర
త్నహారములే. ఈరత్నహారద్యుతి యవిరళము, నదృష్టశ్రుతపూ
ర్వమును, ఇట్టి యమూల్యరత్నహారముల మనభాషామతల్లి
కొసఁగిన ధూర్జటి మహాకవియోగి కాంధ్రులాజన్మము బుణ
పడి యున్నారు. ఏతద్గ్రంథపఠన పారాయణాదికముచే నిసు
మంతైన లబ్ధినందఁ జాలనిచో మనజీవితము వ్యర్థము.

## శతకకర్త మానసము

ఈశతకమున ధూర్జటిమానసము సహజవికాస సంసిద్ధి
నంది, అతిక్లిష్టము లగు జీవితసమస్యలకు బహుచిత్రములు,
నదృష్టశ్రుతపూర్వములు నగు దివ్యసాధనలఁజూపి, చక్కఁగాఁ
బరిష్కరించినది. విషయప్రదర్శనమున విశిష్టతఁ జూపి,
సులభ గంభీర భాషాప్రయోగమున సొంపునింపి, వివిధవిష
యావిష్కరణమున వింతపోకడలు చూపి, భక్తిజ్ఞానవైరాగ్య
ముల ప్రాబల్యముఁ బ్రకటించి ప్రశంసాపాత్రముగా నీతని
శతకము సహృదయుల హృదయములఁ జూఱగొన్నది. అం
దుకే, విజ్ఞానవిషయమున, సారస్వతోన్నతిని, జ్ఞానప్రకాశమున,
నేవిధముగాఁ జూచినను నీతని శతకము ప్రధానస్థాన మాక్ర
మించితీఱును.

## శతక పరమావధి

క్షణికము లగు భౌతికవాంఛల సంసిద్ధికై దురహం కార మదమాత్సర్యావృతు లగు మానవులు చేయు వ్యర్థ ప్రయత్నములలో నాముష్మికసౌఖ్యాభిలాష, ఆధ్యాత్మిక పరిజ్ఞానము విస్మరింపఁబడుచుండును. అందుచే మానవప్రపంచ మపార మగు నికృష్టదుఃఖసముద్రమునఁ బడి యార్తిచెంద వలసివచ్చును. ఈయార్తి తీర్పశక్యముకానిదై సర్వవినాశన మునకు దారితీయును. కావున, ప్రాపంచిక ధనసంపాదనము పరమనీచ మనియు, నమూల్యమగు నాత్మస్వయంప్రకాశమే, యనశ్వర మగు నాత్మానందసింహాసనాధిష్ఠానమే మన పరమావధి యనియు మేల్కొలుపుటే యీ శతకముయొక్క పరమావధి.

## ప్రబంధయుగమున శతకపరిణతి

ఆదికవి యనఁబరగు నన్నయకుఁ బూర్వ మారంభమైన యాంధ్రవాఙ్మయము క్రమక్రమవికాసమునంది కవిత్రయ హస్తముల మహోజ్జ్వలమై, తదుపరి పెక్కురూపము లంది, రాయలయుగమునఁ బ్రబంధసరణిఁ బరిపూర్ణ మగు పరిణతి నందినట్లే, శతకవాఙ్మయమును పదునొకండు పన్రెండు శతాబ్దములకుఁ బూర్వమే ప్రారంభమై శివతత్త్వసార, వృషాధిపశతక రూపముల నంది, క్రమవికాసము పొందుచు, కృష్ణరాయలయుగముననే దిగ్గజశ్రేష్ఠుం డనఁదగిన ధూర్జటి యమృతహస్తమున మహోన్నతపరిణతి నందుట విశేషము.

రసాత్మక మైన వాక్యము కావ్యమై రసములఁ బ్రధానములు శృంగారకరుణము లగుట, నీ రెండును దైవపరములైనపుడు భక్త్యావేశము నొసఁగి మానవుని భగవంతుని వైపు త్రిప్పి సత్వరవిముక్తికి దారిచూపును. భావావేశము కల్గిననే భక్త్యావేశము కల్గి స్థిరభక్తి నిలుచునుగాన, స్వానుభవసమన్వితములై సత్యాత్మకము లగు శతకములే మానవ హృదయమును పవిత్రము చేయుటకు సమర్థములు. ఈ శతక మీవిషయమునకు నిదర్శనము.

కావ్యార్థ సూచనము

అత్యున్నతస్థానము నందిన ప్రబంధయుగమునకుఁ జెందినవాఁ డగుట ధూర్జటి తన శతకమున నెత్తుకొను ప్రధానవిషయములను శతకారంభ పద్యముననే సూచించుట యొక గొప్ప విశేషము.

> "శ్రీవిద్యుత్కలితాజవంజవమహా జీమూతపాపాంబుధా
> రావేగంబున మన్మనోబ్జసముదీర్ణత్వంబుఁ గోల్పోయితిన్
> దేవా! నీకరుణాశరత్సమయ మింతే చాలుఁ జిద్భావనా
> సేవం దామరతంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా!"

ఈ శతకారంభమునఁ గవి కావ్యప్రధాన విషయములుగాఁ బేర్కొనిన వివి: (శ్రీ) విద్యుచ్చంచలము, ఆజవంజవము నికృష్టము, పాపాంబుధారా ప్రభావ మనంతము, మనోబ్జసముదీర్ణత్వముఁ గోల్పోవుటవల్లఁ గల్గు దుఃస్థితి, భగవత్కరుణాశరత్సమయప్రయోజనము, సేవామాహాత్మ్యము—ఇవి

ప్రధానవిషయములు. వీని నుండి "తామరతంపరగాఁ" బుట్టినవే మిగిలిన పద్యములు. ఈరీతిగా కావ్యవస్తుస్వరూపము నేశతక కర్తయుఁ జూపియుండ లేదు. పై విషయముల దిక్ప్రదర్శనముగా నిటుఁ బరిశీలింతము.

శ్రీ విద్యుచ్చంచలము

అస్థిరములు, చంచలములు నైన సిరులాసించి, మానవులు చేయని దుష్కృతములు లేవు. "ధనమూలమిదం జగ" త్తను ప్రధానార్థికసూత్రము ప్రపంచము నేలుచున్నది. అందుచేఁ దద్గర్హణము ప్రధానము. ఆధ్యాత్మికదృష్టికిఁ బ్రధానమైన శ్రీగర్హణముఁ బ్రారంభించి దాని వ్యర్థత్వముఁ జక్కఁగా నిరూపించినాఁడు.

"తరగల్ పిప్పలపత్రముల్ మెఱుఁగుటద్దంబుల్ మరుద్దీపముల్
కరికర్ణాంతము లెండమావులతతుల్ ఖద్యోతకీటప్రభల్
సురవీథీలిఖితాక్షరంబు లసువుల్ జ్యోత్స్నాపయఃపిండముల్
సిరు లిందేల మదాంధు లౌదురు జనుల్ శ్రీకాళహస్తీశ్వరా!"

ఇంతకును,

"మదమాతంగము లందలంబులు హరుల్ పల్లకుల్
ముదితల్ చిత్రదుకూలముల్ పరిమళంబుల్"

ఇవియేకదా శ్రీమంతుల సంపదలు! ఇవి మోక్షమార్గజాలవుకాసనఁ ద్రోసిరా జనవచ్చును. ఇవన్నియు లక్ష్మీవిలాసిని మాయానటనలు కాని సౌఖ్యప్రదములు కావు.

పదునాల్గు మహాయుగము లేలిన శ్రీమంతుఁడు, అయ్యుదయాస్తాచలసంధి నాజ్ఞఁ జెల్లించిన యాయుష్మంతుఁడు

విస్మరింపఁబడి విస్మృతసాగరమునఁ గలసి రన్న నిఁక నల్ప శ్రీల కల్పులు "మత్తులై యేల చచ్చెదరు." వీని నాసించియే కదా!

"ఒకనిం జంపి పదస్థులై బ్రతుకఁ దా మొక్కొక్క రూహింతు రే లొకో తా మెన్నఁడుఁ జావరో తమకుఁ బో వో సంపదల్?"

అని సంకుచితదృష్టిని, స్వార్థమును నిరసించినాఁడు.

వేయేల, ఒక్కపద్యములో శ్రీమాహాత్మ్యమును దేట తెల్లముగాఁ జెల్పి మన మానసములను దానినుండి దూరీకృతము చేయఁజాలుచున్నాఁడు:

"జాతుల్ సెప్పుట సేవఁజేయుట మృషల్ సంధించు టన్యాయ వి
ఖ్యాతిం బొందుట కొండెకాఁ డవుట హింసారంభకుం డౌట మి
థ్యాతాత్పర్యము లాడు టిన్నియుఁ బర ద్రవ్యంబు నాశించి యీ
శ్రీ తా నెన్నియుగంబు లుండఁగలదో..."

సిరు లిట్టివని తెలిపి,

"రాజశ్రేణికి దాసులై సిరులఁ గోరం జేరఁగా సౌఖ్యమో
యీజన్మంబు తరింపఁ జేయఁగల మి మ్మేప్రొద్దుఁ జింతించు ని
ర్వ్యాజాచారము సౌఖ్యమో"

యిపుడు తెలిసికొని మీ మీ కర్తవ్యము లూహించుకొనుఁ డని మానవుల నుద్బోధించుచున్నాఁడు.

ఆజవంజవము నికృష్టము

కాంచనగర్హణ మైనపిమ్మట, ప్రధాన విషయము కాంతాసమ్మిత సంసారము. దీని ప్రాధాన్య మెట్టిదనిన: "సంసారకూప మతిఘోర మగాధమూల" మ్మనియు,

"సంసారే జనితాపరోగసహితే తాపత్రయాక్రందితే
నిత్యం పుత్రకళత్రవిత్తవిలసత్పాశైర్నిబద్ధం దృఢం."

అనియు, విష్ణుదేవుని :

"సంసారభీకరకరీంద్రకరాభిఘాత
నిష్పిడ్యమానవపుషః సకలార్తినాశ"

యనియు,

"సంసారసర్పవిషదిగ్ధమహోగ్రతీవ్ర
దంష్ట్రాగ్రకోటిపరిదష్టవినష్టమూర్తేః"

అనియు శ్రీశంకరులు ప్రార్థించినారు. అట్టి సంసారమును ధూర్జటి అతినికృష్టమైనదిగా, హృదయములకు నాటునట్లు వర్ణించియున్నాఁడు :

"కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్
రాయన్ డాపడె ఱొమ్ము మన్మథవిహారక్లేశవిభ్రాంతిచేఁ
బ్రాయం బాయెను బట్టకట్టె తల చెప్పన్ రోఁత సంసారమే
చేయంజాల విరక్తుఁజేయఁగదవే..."

సంసారమాహాత్మ్య మెట్టిదనఁగా, సంసారము దుఃఖజనక మనియు, సంపద్భ్రాంతి నీచమనియు, వాంఛ దుఃఖదమనియుఁ దెలియని మానవుఁ డరుదు. కాని, యీభావము తాత్కాలికముగాఁ గలిగి మఱుక్షణమున విస్మరింపఁబడును. ఈదుస్థితిని ధూర్జటి యెంత చక్కఁగా వర్ణించుచున్నాఁడో చూడుఁడు.

"రోసీరోయదు కామినీజనుల తారుణ్యోరుసౌఖ్యంబులన్
బాసీపాయదు పుత్రమిత్రజనసంపద్భ్రాంతి వాంఛాలతల్
గోసీకోయదు..."

ఇట్టి రోఁతలు నిష్ప్రయోజనము లని వెంటనే "రోసిం దేటిది రోఁత లేటివి మనోరోగస్థుఁడై దేహి" యని చాటుచున్నాఁడు. మఱియు, నీసంసారపాశము విడవడని గొలుసువలె నవిచ్ఛిన్నదుఃఖభూయిష్ఠము. అది యెట్లన:

"ఆలంచుఁ మెడఁ గట్టి దానికి నప త్యశ్రేణిఁ గల్పించి త
ద్బాలవ్రాతము నిచ్చి పుచ్చుకొను సంబంధమ్ము గావించి యా
మూలర్క్షంబున బాంధవం బనెడు ప్రేమం గొందరం ద్రిప్పఁగా
సీలన్ సీల యమర్చినట్లొసఁగితో..."

మానవుఁ డెంత ప్రయత్నించిన నీ సంసార శృంఖలలఁ ద్రెంపలేఁడు.

ఇన్నివిధములఁ జెప్పవలసిన యావశ్యకము లేదు—దీని వలన నేయొక్క సుఖమేని గల్గిన దీనిని గర్హింపకుండ నుండ వచ్చును. చూడుఁడు:

"కాసంతైన సుఖం బొనర్చునో మనః కామంబు లీడేర్చునో
వీసం బైనను వెంటవచ్చునో జగ ద్విఖ్యాతి గావించునో
దోసంబుల్ పెడఁబాపునో వలసినం దోడ్తోమిము జూపునో
ఛీ! సంసారదురాశ..."

యని నిరపేక్షతో ధిక్కరించినాఁడు.

పాపాంబుధారాప్రభావ మనంతము

అట్టిసంసారార్ణవమగ్నులైనవారు పాపాంబుధారావేగ నకు గుఱియగుదురు. వీరు:

"వీడెం బబ్బినయప్పుడుం దమనుతుల్ విన్నప్పుడుం బొట్టలో
కూ డున్నప్పుడు శ్రీ విలాసములు పై కొన్నప్పుడున్ గాయకుల్
పాడంగా వినునప్పుడున్ జెలఁగు దంభప్రాయ విశ్రాణన
క్రీడాసక్తులు..."

వీరు పాపాంబుధారా వేగంబునఁ బతనము నందుదురు. పరమేశ్వరుఁడే గతి యన్నవా "రపవర్గరాజ్యపదవీ సింహాసనాధిష్ఠాసు" లగు చున్నను, "ఆయురన్నం ప్రయచ్ఛతి"యని శ్రుతులు మొఱపెట్టుచున్నను, పాపప్రభావమువలన "సంసారాంధకారాభి దూషితదుర్మార్గులై" సంతతముఁ గూటికినై చరింతురు. మఱియు నట్టివారు "పాపరాజీజాతాతి మదాంధబుద్ధు" లగుటచే రాజశ్రేణికి దాసులై సిరులఁ గోరఁజేరుదురు. వారింకను, అంతయు మిథ్య యని యెఱిఁగియు నిత్యము :

"కాంతల్ పుత్రులు నర్థముం దనువు ని క్కం బంచు మోహార్ణవ
భ్రాంతిం జెంది చరింత్రు గాని పరమార్థం బైన నీయందుఁ దాఁ
జింతాకంతయుఁ జింత నిల్పరు"

మహాపాపాంబుధారానిహతుఁడైన యతియైనను, జీవశ్రాద్ధము చేసికొని కూడ,

"చావం గాలము చేరువౌ టెఱిఁగియున్ చాలింపఁగా లేక త
న్నే వైద్యుండు చికిత్సఁ బ్రోవఁగలఁడో యేమందు రక్షించునో
యేవేల్పుల్ కృపఁ జూతురో యనుచు ని న్నింతైనఁ జింతింపఁడు"

ఇట్టి దుస్థితిలోఁ బడఁగా నట్టివారి మనస్సులు చలించును. మనస్సంచలనమే పరమానర్థములకుఁ బ్రబలకారణము. కావున మనస్సముదీర్ణత్వముఁ గోల్పోవుటకు పాపాంబుధారయే ప్రధానకారణము.

### మనోజ్ఞ సముదీర్ణత్వ సంచలనమువలని దుఃస్థితి

మనోజ్ఞసముదీర్ణత్వమును గోల్పోయిన యాతఁడు భవకేళీమదిరామదంబున మహాపాపాత్ముఁడై శివుని వివేకిం

పఁడు. శివునందుఁ "జింతాకాంత చింత" సిల్పఁడు. "ఆలుఁ బిడ్డలు తల్లిదండ్రులు ధనం" బను మహాబంధనిబద్ధుఁడై కడు దుర్మోహాబ్ధిలోఁ గ్రుంకి, భగవంతు నెన్నఁడును జింతింపఁ జాలఁడు. "శ్రుతు లభ్యాసముచేసి, శాస్త్రగరిమల్ శోధించి, తత్త్వంబులన్ మతి నూహించి" నను "నిశ్చితచిత్తస్థిరసౌఖ్య" మందనే లేఁడు. పైఁగా, స్వేచ్ఛా భాషణ క్రీడల వదరుచుండఁగా, సంశయభీకరాటవులఁ ద్రోవఁ దప్పి వర్తింపఁగా, మదనక్రోధకిరాతు లందుఁ గని భీమప్రౌఢిఁ దాఁకఁగాఁ జిత్తము చెదరిపోవును. అట్టివాఁ డెన్ని నేర్చినను "గుమ్మడికాయలోని యావగింజంతైన" శంకపోఁగొట్టుకొనఁజాలఁడు. ప్రశాంతచిత్తస్థిరసౌఖ్య మెఱుఁగని పాపాత్ముఁడు తన్నెదుర్కొన్న కష్టములకుఁ గ్రుంగిపోయి, జీవనదశయందే చీకాకై చెడిపోవును. అట్టివాఁడు ఒకపూఁట టించుకకూడు తక్కువగుచో నోర్వలేఁడు; ఎండబాధ కోర్వఁజాలక యిల్లిల్లును దూరు; చలికిఁ గుంపల్లెత్తుకో చూచును. వాఁడు వేయని వేసము లేదు. ఇట్టి దుస్స్థితిలోఁ బడిపోయి :

> "స్తోత్రం బన్యులఁ జేయ నొల్లని వ్రత స్థుల్వోలె వేసంబుతోఁ
> బుత్రీపుత్రకళత్ర రక్షణకళా బుద్ధిన్ నృపాలాధమున్
> బాత్రం బంచు భజింపఁ బోదుగా."

భగవత్కారుణాశరత్సమయప్రయోజనము

పరమేశ్వర కరుణాశరత్సమయ సంప్రాప్త మహాభాగ్యసంపన్నులు భగవన్నామమును విడువలేరు. తన్నామ

నిరంతర సంస్మరణాభిరతి "నిప్పై పాతక తూలశైల మడఁచున్ ...తప్పన్ దవ్వుల విన్న నంతక భుజాదర్పోద్ధత క్లేశముల్ తప్పున్ దారును ముక్తులౌదురు."

ఇట్టి మహాత్ములే మున్ను పరమేశ్వరునిచే "నపవర్గ రాజ్యపదవీమూర్ధాభిషేకంబుఁ గాంచిన పుణ్యాత్ములు." వారు భవాంఘ్రిస్తుతిచే భవదుఃఖములు పాసి కైవల్య మంది వినోదింతురు. అట్టివారు నిర్భయులు, నిర్వికారపురుషులు. వారికి :

> "పవి పుష్పం బగు, నగ్ని మం చగు, నకూపారంబు భూమీస్థలం
> బవు, శత్రుం డతిమిత్రుఁ డౌ, విషము దివ్యాహారమౌ."

పరమేశ్వరుని కరుణాకటాక్షవీక్షణములు సోఁకిన మానవుఁ డేనీచాలయమును జొరఁడు; ఏకార్పణ్యపు మాటల నాడఁడు; మఱి యేయితరమతము నైనఁ దలఁపఁడు. ఆ కారణముచే, అతఁ డెట్టి క్లిష్టపరిస్థితులలో నైనను జీవనదశ యందుఁ జీకాకై చెడిపోఁడు.

మఱియు నట్టి పుణ్యాత్ముఁడు స్వామిద్రోహము చేసి వేఱొకనిఁ గొల్వఁబోఁడు; పరమేశ్వరప్రీతి కరము లైన శ్రుతి స్మృతి పురాణేతిహాసాదుల విన నొల్లకుండఁడు; ఈశ్వరుఁడక్క నన్యదైవముల దిక్కుగాఁ జూడఁడు. అతనికి :

> "క్షితిలో దొడ్డ తురంగ సామజము లే చిత్రమ్ము? లాందోళికా
> తతు లేలెక్క? విలాసినీజన సువస్త్ర వ్రాత భూషా కలా
> ప తనూజాదిక మేమి దుర్లభము ?"

అట్టివానికి లేమియే కల్గుచో

> "దివిజ క్ష్మారుహ ధేనురత్న ఘనభూతి ప్రస్ఫురద్రత్న సా
> నువు (నీ) విల్లు, నిధీశ్వరుండు సఖుఁ డన్నోరాశి కన్యావిభుం
> డు విశేషార్చకుఁడు..."

నైన ఈశ్వరుఁడే పాపును గాని యన్యు లెవరు సమర్థులు ?

పరమేశ్వరావ్యాజ కరుణాకటాక్షపాత్రుఁడు నిచ్చలాతనినే భజించి 'చిన్మయమహా నిర్వాణపీఠంబుపై రచ్చలు' చేయును. గ్రహదోషంబులు, దుర్నిమిత్తములు నాతని బాధింపఁ జాలవు. అట్టి మహాత్ముని వాత్సల్య లీలావచనంబులచేఁ బరమేశ్వరుఁ డనుగ్రహించును.

సేవామాహాత్మ్యము

జ్ఞానమునకుఁ బ్రధానము భక్తిసంభరిత మగు సేవావిభూతితక్క నన్యము కాదను విషయము శతకమునం దెల్లెడల వెల్లివిరియుచున్నది. ఈవిషయ మీక్రిందిపద్యమున విస్పష్టముగాఁ బేర్కొనఁబడినది:

> "ఏవేదంబు పఠించె లూత భుజగం బేశాస్త్రముల్ చూచెఁ దా
> నేవిద్యాభ్యసనం బొనర్చె కరిఁ చెం చేమంత్ర మూహించె బో
> ధావిర్భావనిదానముల్ చదువు లయ్యా కావు మీపాదసం
> సేవాసక్తియె కాక జంతువులకున్..."

మఱియు, "నీసేవ చేసి హతక్లేశు" లగుదు రనియు, "సంసేవ చేసి నినుం గాంచెద" ననియుఁ బలు తావుల వెల్లడించినాఁడు. ఇంకను, అమరస్త్రీల రమించినను విడని మోహము, బ్రహ్మపట్టము సిద్ధించినను దీరని యాశ, సర్వ

లోకములు మ్రింగినను దీరని కోపము పరమేశ్వర సేవామా
త్మ్యముచేఁ బటాపంచలు చేసి వేయఁగలుగుటే కాక, మహా
పాతకవారిరాశిని సైతము క్షణమాత్రమున దాఁటవచ్చు నని
ఘోషింపఁబడినది. "మిమ్మే ప్రొద్దు సేవించు నిర్వ్యాజాచా
రమే సౌఖ్య" మనియు,

"తనయుం గాంచి ధనంబు వాడి దివిజ స్థానంబు గట్టించి వి
ప్రున కుద్వాహముచేసి సత్కృతికిఁ బాత్రుండై తటాకంబు నే
ర్పునఁ ద్రవ్వించి వనంబు పెట్టి మననీ పోలేఁడు నీ సేవచే
సిన పుణ్యాత్ముఁడు పోవులోకమునకున్ శ్రీ..."

అనియు సేవామాహాత్మ్యమును శ్లాఘించినాఁడు.

ఈవిధముగాఁ గావ్యప్రధాన విషయములను గావ్యార్థ
సూచనగాఁ దొలిపద్యమునఁ దెలిపియున్నాఁడు. ఈప్రధానవి
షయములు 'తామరతంపరై' జనించినవే మిగిలిన పద్యములు.
ఆవిషయములఁ గొన్నిటి నిట సంక్షేపముగాఁ బరికింతము.

భక్తిజ్ఞానయోగవైరాగ్యములు

ఈశతకమున ధూర్జటి మహోన్నతవిషయములైన
భక్తియోగ జ్ఞాన వైరాగ్యములఁ బ్రశంసించి యున్నాఁడు.
ఇవన్నియుఁ గూడిన సేవావిభూతి మోక్షప్రద మనియుఁ
దెల్పినాఁడు. భక్తినిగుఱించి :

"సలిలమ్ముల్ జలుకప్రమాణ మొక పుష్పమ్ముల్ భవన్మౌళి ని
శ్చల భక్తిప్రతిపత్తిచే నరుఁడు పూజల్ సేయఁగా ధన్యుఁడో"

నని దివ్యకంఠనినాదముతో ఘోషించినాఁడు.

భక్తితోఁ గూడిన యర్చనప్రాశస్త్య మిట్లు తెల్పు చున్నాఁడు:

"జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచాబంధముల్ వాద్యముల్
కలశబ్దధ్వను లంచితాంబర మలంకారంబు దీప్తుల్మెఱుం
గులు నైవేద్యము మాధురీమహిమ గాఁ గొల్తు న్నినున్ భక్తి రం
జిల దివ్యార్చనఁగూర్చి నేర్చినక్రియన్ శ్రీ..."

మఱియు, భవభక్తు నిట్లు చిత్రీకరించుచున్నాఁడు :

"తలమీఁదం గుసుమప్రసాద మలిక స్థానంబుపై భూతియుం
గళసీమంబున దండ నాసికతుదన్ గంధప్రసారంబు లో
పల నైవేద్యము చేర్చు నేమనుజుఁ డా భక్తుండు నీ కెప్పుడున్
చెలికాఁడై విహరించు రౌప్యగిరిపై శ్రీ..."

అనియు భక్తిభావము నభినందించియున్నాఁడు.

జ్ఞానవిషయమున, కేదారాది సమస్తతీర్థములు చూడఁ బోవుటయు వ్యర్థమే యనియు, ముంగిలి వారణాసి కడుపే కైలాసశైలము పరమేశ్వరపాద సమారాధనయోగము కల్గి నపుడై తీఱుననియు, 'నజ్ఞానలక్ష్మీ దారిద్ర్యు' లగుట లోకులు తీర్థయాత్రాలోలు రగుదు రనియు తెలిపినాఁడు. మఱియు జ్ఞాని పరమేశ్వర భజన మున్నపుడు ఆపదలు పొడమినను, నిత్యోత్సవ మబ్బినను, జనమాత్రుఁ డన్నను, మహాత్ముఁ డన్నను, సంసారమోహము పైకొన్నను, జ్ఞానము కల్గినను, గ్రహాగ్రతులు కుందించినను, మేల్లు వచ్చినను, గీడు వచ్చినను నన్నియు భూషణములుగానే యెంచును.

యోగవిషయాభిజ్ఞతను ధూర్జటి కొన్నిపద్యముల వెల్లడించినాఁడు :

"అకలంకస్థితి నిల్పి నాద మను ఘం టారావమున్ బిందుదీ
పకళా శ్రేణి వివేకసాధనము లొప్పన్ బూని యానందదా
పక దుర్గాటవిలో మనోమృగము గర్వస్ఫూర్తివారించు వా
రికిగా వీడు భవోగ్రబంధలతికల్"

అనియు, ఓంకారవాచ్యుఁడు పరమేశ్వరుఁ డనియు నిట్లు వివరించినాఁడు :

"ఆరావం బుదయించెఁ దారకముగా నాత్మాభ్రవీథిన్ మహో
కారోకార మకారయుక్తమగు నోం కారాభిధానంబు చె
న్నారున్ విశ్వమనంగఁ దన్మహిమచే నానాదబిందు ల్సుఖ
శ్రీరంజిల్లఁ గడంగు నీ వదెసుమీ శ్రీ..."

అని యోగప్రాశస్త్యమును హృదయామోదకరముగాఁ దెల్పినాఁడు.

వైరాగ్యవిషయప్రబోధ మనన్యసాధ్యమగురీతి నీశతకమునఁ జూపట్టుచున్నది. మహాభావసంభరితమగు నీవైరాగ్యబోధ ధూర్జటియొక్క నిశ్చలవైరాగ్యస్థితిని దెల్పుచుండును.

"అంతా సంశయమే శరీరఘటనం బంతా విచారంబె లో
నంతా దుఃఖపరంపరార్జితమె మే నంతా భయభ్రాంతమే
ఆంతా నాంతశరీరశోషణమె దు ర్వ్యాపారమే దేహికిన్."

అనియు,

"సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ జాలుఁజాలు బహురాజద్వారసౌఖ్యంబులన్."

అనియు, మఱియింక నెన్నో రీతుల తన శతక మందంతటను వైరాగ్యబోధన మద్వితీయముగా సాగించినాఁడు.

భక్తియోగజ్ఞాన వైరాగ్యసమన్విత మగు సేవా మనీషయే బ్రహ్మానందము నొసఁగును గాని కేవల శాస్త్రజ్ఞానము నిష్ప్రయోజన మని, దానిని జక్కఁగా గర్హించినాడు.

కేవలశాస్త్రజ్ఞానము నిష్ప్రయోజనము

భక్తిప్రతిపత్తి లేని శాస్త్రజ్ఞానము వ్యర్థము. అంతియ కాక, బోధావిర్భావనిదానములు చదువులు కానే కావని విస్పష్టముగా బోధించినాఁడు. శాస్త్రజ్ఞానమే జ్ఞానప్రదాత్రి, ముక్తిదాయిని యగుచో ముక్తిశ్రీ నలంకరించినవారిలో :

"ఏ వేదంబు పఠించె లూత భుజగం బేశాస్త్రముల్ సేర్చె తా
నే విద్యాభ్యసనం బొనర్చెఁ గరి చెం చే మంత్ర మూహించె..."

నని పృచ్ఛించుచున్నాఁడు. మఱియు సమస్త శాస్త్రపారంగతుఁడైనవాఁడు వృథావచనములు చెప్పనే కాని నిర్జితచిత్త స్థిరసౌఖ్యు మెఱుఁగఁడు.

శాస్త్రము లభ్యసించువారికి నిత్యత్వమనీష దూరమగునని ముక్తకంఠముతో ఘోషించుచున్నాఁడు:

"శుకముల్ కింశుకపుష్పముల్ గని ఫల స్తోమం బటంచుఞ్ సము
త్సుకతన్ జేరఁగఁబోవ నచ్చట మహా దుఃఖంబు సిద్ధించు క
ర్మకళాభావలకెల్లఁ బ్రాపులగు శాస్త్రంబుల్ విలోకించువా
రికి నిత్యత్వమనీష దూరమగు నో శ్రీ..."

ఇదియే కాక, మంత్రతంత్రములు పరిశీలించి సాంఖ్యాదియోగరహస్యము లెఱిఁగినవారికి అవగింజంతయైన సంది

యము నివారణము కాకపోవుటే కాక, చిత్తచాంచల్యము కలి గించుననని యిట్లుదాహరించుచున్నాఁడు :

"చదువుల్ నేర్చిన పండితాధములు స్వేచ్ఛాభాషణ క్రీడలన్
వదరన్ సంశయ భీకరాటవులఁ ద్రోవ ల్దప్పి వర్తింపఁగా
మదన క్రోధకిరాతు లందుఁగని భీమ ప్రౌఢి వేదాఁకినన్
చెదరన్ జిత్తము..."

ఇంకను పారిభాషిక పదాభిమానుల, జ్ఞాన శూన్యులగు పండితుల నీరీతి నిందించి, పరమేశ్వర కరుణాకటాక్ష సంపాదనకు పాండిత్య మనపేక్ష్యమని నొక్కి వక్కాణించుచున్నాఁడు :

"పటవత్ రజ్జుభుజంగవత్ రజతవి భ్రాంతిస్ఫురచ్ఛుక్తివత్
ఘటవత్ చంద్రశిలాజపాకుసుమరు క్సాంగత్యవత్ అంచు వా
క్పటిమల్ నేర్తురు చిత్సుఖం బనుభవింపన్ లేక దుర్మేధసుల్
చిటుకన్నన్ దలపోయఁజాలరు రథముల్ శ్రీ..."

భక్త ప్రశంస

వ్యాజస్తుతిపూర్వకముగా భక్తప్రశంస చేయుచు నొక విశిష్టమార్గమును ధూర్జటి యవలంబించినాఁడు. భక్తులనామములు పేర్కొని స్తుతింపక భక్తసత్క్రియలఁ బేర్కొని శ్లాఘించు టిందలి విశేషము. ఉదాహరణ కొకటిరెండు :

"నీతో యుద్ధముచేయ నోప(బాణునివలె)కవితా
నిర్మాణశక్తిన్ నినుం
బ్రీతుం జేయఁగఁ జాల(పుష్పదంతునివలె) నీకొలఁదిఁ దం
డ్రిం జంపఁగాఁజాల నా
చేతన్ ఱోకట నిన్ను మొత్త వెఱతున్
చీకాకు నాభక్తి......"

యనియు,

"తాలన్ రక్షింపఁ జేతులాడవు కుమా
 రా రమ్మురమ్మంచు నే
చాలన్ జింపఁగ (చిలువలొండదనంబి) నేత్రములు దివియఁగా
 శక్తుండనేఁ గాను (కన్నప్ప)..."

ఇంకను జక్కఁగా...

"పవమానాశన భూషణప్రకరణముల్ భద్రేభచర్మంబు నా
టవికత్వంబుఁ బ్రియంబులై భుజగశుం డాలాటవీచారులన్
భవదుఃఖంబులఁ బాపు టొప్పు చెలఁదిం బాటించి కైవల్యమి
చ్చి వినోదింపఁగ నేమి కారణమయా..."

ఇంతయేల, నీభక్తు లెవ్వారైనను నాకుఁ బ్రశంసా పాత్రులేయని ధూర్జటి చక్కఁగాఁ దన భక్తవీరారాధన పరత్వమును జాటినాఁడు :

"భసితోద్ధూళనధూసరాంగులు జటాభారోత్తమాంగుల్ తపో
వ్యసనుల్ సాధితపంచవర్ణరసనుల్ వైరాగ్యవంతుల్ నితాం
తసుఖస్వాంతులు సత్యభాషణ సము ద్యద్రత్నరుద్రాక్షరా
జిసమేతుల్ కుడ నెవ్వరైనఁ గొలుతున్..."

ఇంకను ననేకుల శతకమునం దెల్ల నీరీతిగానే ప్రశంసించినాఁడు.

కొన్ని నిర్వచనములు

ఈశతకమునందలి విశేషములలో నిది యొకటి. సౌఖ్య మన నేమి? సిలుగు లెట్టివి? శ్రేయోదాయకు లెవ్వరు? చిత్త మెట్టిది? సద్బాంధవు లెవ్వరు? మొదలగు ప్రశ్నములకు సమాధానములను నిర్వచించి చక్కఁగాఁ జూపినాఁడు :

"దినమున్ చిత్తములో సువర్ణముఖరీ తీరప్రదేశాశ్రమకా
ననమధ్యోపల వేదికాగ్రమున నా నందంబునన్ బంకజా
సననిష్ఠన్ నినుఁ జూడఁగన్న నదివో సౌఖ్యంబు......"

"కల లంచున్ శకునంబు లంచు గ్రహయో
 గం బంచు సాముద్రికం
బు లటంచున్ దెవు లంచు దిష్టమనుచున్
 భూతంబు లంచున్ విషా
దు లటంచున్ నిమిషార్ధ జీవనము లం
 దున్ బ్రీతి పుట్టించి యీ
సిలుగుల్ ప్రాణుల కెన్ని చేసితివయా..."

మాయాజాండకరండకోటిఁ బొడిగా మర్దించిన వారు విక్రమాజేయుఁడగు కాయజుఁ జంపినవారు, కపటలక్ష్మీ మోహమును బాసినవారు, ఆయుర్దాయ భుజంగమృత్యువు ననాయాసంబున గెల్చినవారు—వీరు శ్రేయోదాయకులు.

"విత్తజ్ఞానము, పాదు చిత్తము భవావేశంబు రక్షాంబువుల్
మత్తత్వంబు తదంకురం బనృతముల్ మాఖాకు లత్యంతదు
ర్వృత్తుల్ పువ్వులు పండ్లు మన్మథముఖావిర్భూతదోషంబులున్
చిత్తాభ్యున్నతనింబభూజమునకున్..."

ఇట్టిది చిత్తము.

ఇఁక సద్బాంధవు లెవ రనఁగా, నీశ్వరునిపైఁ గావ్యము వ్రాయువాఁతఁడు, నాతనిపైఁ బద్యములు పాఠ మొనరించు వతఁడు, నాతని మంజుల ప్రబంధము నిష్ఠాపూర్తిగాఁ బఠించు వతఁడును.

ఈరీతిగానే భగవన్నామము, చనిపోయినవారి తోడి సంబంధము మొదలగు విషయములఁ జక్కఁగా నిర్వచించినాఁడు.

రాజదూషణము

శతక మంతయును స్వానుభవప్రదర్శనమునకు నిదర్శనమే యైనను, నిందుఁ బ్రధానముగా రాజదూషణమున నాఁటి రాజుల దుష్ప్రవర్తనను నిరంకుశముగా, నిర్భయముగా విశదీకరించి మిగిలిన రాజులకు గుణపాఠము బోధించినాఁడు. రాజులు మత్తు లనియు, వారిదానము లాత్మవ్యథాబీజము లనియు చంద్ర, కుబేర, కురుక్ష్మాపాలురే రాజులై దుష్కృతి చెందఁగా నిఁకఁ దక్కినవారిఁ బేర్కొన నేల యనియు, రాజకీటముల సేవింప లేననియు, రాజనఁగానే కృపాది సద్గుణంబులు తొలఁగిపోవు ననియు, వారు భూభృచ్చండాలు రనియు పలువిధముల నిందించినాఁడు.

అలంకారములు, లోకోక్తులు

సులభగంభీర భాషాప్రయోగమునఁ జక్కని యలంకారములు, వివిధములైన లోకోక్తులు నివియే శతకప్రాబల్యమునకుఁ, బ్రాచుర్యమునకుఁ బ్రధానములు. భాషావిషయ ప్రాశస్త్యమునకుఁ బూర్వోదాహృతపద్యములే ప్రమాణములు. ఇట్టి భాషాప్రయోగ నైపుణ్యమున విషయము వెంటనే హృదయమునకు హత్తుకొని ప్రత్యక్షప్రబోధకము **(Directness of appeal)** గా నుండును. ఇది యీశతకమున నెల్లెడల వెల్లివిరియుచునే యున్నది.

ఇఁక, అలంకారములకు, లోకోక్తులకు నాలుగై దుదాహరణముల నరసి ధూర్జటి విషయప్రదర్శనవైశిష్ట్యము నరయుదము. అలంకారములకు:

"భవకేళీమదిరామదంబున మహాపాపాత్ముఁడై వీఁడు న
న్నువివేకింపఁ డటంచు నేను నరకాగ్నోఘరాశిపాలైనఁ బ
ట్టవు బాలుం డొకచోట నాటతమితోడన్ నూతఁ గూలంగఁ దం
డ్రి విచారింపకయుండునా కటకటా..."

"భవదుఃఖంబులు రాజకీటముల నేఁ బ్రార్థించినన్ బాయునే
భవదంఘ్రిస్తుతిచేతఁ గాక విలసద్వ్యాలక్షుధాక్లేశదు
ష్టవిధుల్మానునె చూడ మేఁక మెడచం టన్ దల్లి కారుణ్యదృ
ష్టివిశేషంబున నిచ్చు చంటబలెనో ..."

మొదలగు నుదాహరణములు లెక్కకు మిక్కిలిగా నున్నవి. అతిసహజమైన ధోరణిలోఁ దలిదండ్రులు బిడ్డను లాలించునట్లు భగవంతుఁడు భక్తుఁడు కోరికలఁ గోర నిచ్చి లాలింపఁడా యను విషయము నిందుఁ జక్కఁగా నుదాహరించినాఁడు.

"పాలుం బువ్వయుఁ బెట్టెదన్ గుడువరా పాపన్న రాయన్న తే
లే లెమ్మన్న నరంటిపండుఁ గొని తే లేకున్న నేనొల్ల నం
టే లాలింపరె తల్లిదండ్రు లపుడట్లే తెచ్చి వాత్సల్యల
క్ష్మీలీలావచనంబులన్ మనుపవే..."

అనున దెంతసహజమును, కరుణరసపూరితమునో కదా! ఇట్టి విశేషము లీశతకమున ననంతముగా నున్నవి.

లోకోక్తులుకూడ నీశతకమునకు వన్నె తెచ్చినవి. "నియమం బెంతో ఫలంబు నంతియకదా, నీవీయ పిండెంతో

నంతియకా దళం బళనబుద్ధిం జూడ నేలబ్బు", "జలజ శ్రీఁగల మంచినీళ్ళు గలవా చట్రాతిలో", "వెలివాఁడలో బాపనిల్లు కలదా", "కాదాముంగిలి వారణాసి కడుపే కైలాసశైలమ్ము", "ఇత్వాడలఁ ద్రోచినఁ జూరుపట్టుకొని నే వ్రేలాడుదున్" మొదలగు చక్కని లోకోక్తులీశతకమహత్త్వమునకు నూతనశోభ నొసంగుచున్నవి.

విషయప్రదర్శన వైశిష్ట్యము

తాత్త్విక విషయప్రబోధమున నొక గొప్ప విషయ ప్రదర్శనవైశిష్ట్యమును జూపి యద్భుతముగా సత్వరమున హృదయములకు నాటునట్లు చెప్పఁగల సామర్థ్యము ధూర్జటి సొమ్ము. అగుటచే నీతని శతకము ఈవిషయమునకు గొప్ప నిదర్శనము. "ఆయు ర్నశ్యతిపశ్యతాం ప్రతిదినం" అనువిష యమును ధూర్జటి యెంత సహజముగా, మనస్సునకు ములు కులవలె నాటునట్లు చెప్పినాఁడో చూడుఁడు :

> "నిన్నం జూడరొ మొన్నఁ జూడరొ జనుల్ నిత్యంబుఁ జావంగ."
> "గడియల్ రెంటికొ మూఁటికో గడియకో కాదేని నేఁ డెల్లియో కడ నేఁడాదికొ యెన్నఁడో యెఱుఁగ మీ కాయంబు లీ భూమిపైఁ బడఁగా నున్నవి..."
> "తాతల్ తల్లియుఁ దండ్రియున్ మఱియుఁ బెద్దల్ చావఁగాఁ జూడరో."

మొదలగు వాక్యములు హృదయమున స్ఫుటముగా నాటును.

ఇతరశతకములతోఁ బోల్చి చూచి యీ శతకౌన్న త్యము నరయుటకు జగత్ప్రసిద్ధి గాంచిన యొక్క భర్తృహరి సుభాషిత త్రిశతిలోని నాలుగైదు శ్లోకములఁ బోలిన ధూర్జటి పద్యములఁ జూచినచో నిఁక మిగిలిన శతకములఁ బేర్కొను నావశ్యకము కలుగదు.

"స్తనౌ మాంసగ్రంథీ కనకకలశా విత్యుపమితౌ
ముఖం శ్లేష్మాగారం తదపిచ శశాంకేన తులితం
స్రవన్మూత్రక్లిన్నం కరివరశిరస్స్పర్ధి జఘనం
ముహుర్నింద్యం రూపం కవిజనవిశేషై ర్గురుకృతమ్."

అను భర్తృహరి శ్లోకమును పోలిన యీక్రింది పద్యమున ధూర్జటి యోగసమ్మిళితము చేసి, ఇట్టి యుపమానము నకు వన్నె దెచ్చినాఁడు. చూడుఁడు :

"మలభూయిష్ఠ మనోజధామము సుషుమ్నా ద్వారమో నాగకుం
డలియో పాదకరాక్షి యుగ్మములు షట్కంజంబులో మోము తా
జలజంబో నిటలంబు చంద్రకళయో సంగంబు యోగంబొ గా
సిలి సేవింతురు కాంతలన్ భువి జనుల్..."

తరువాత యాఞ్చా దైన్యదూషణము చేయుచు :

"కింకందాః కందరేభ్య, ప్రళయ ముపగతా నిర్ఝరావాగిరిభ్యః
ప్రధ్వస్తావా తరుభ్య! సరసఫలభృతో వల్కలిన్యశ్చ శాఖాః
వీక్ష్యంతే యన్ముఖాని ప్రసభ మపగత ప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖోపాత్తాల్పవిత్త స్మయపవన వశా న్నర్తితభ్రూలతాని."

అని భర్తృహరి వ్రాసిన శ్లోకమునుబోలిన యీ పద్యమున :

"లేవో కానల కందమూలఫలముల్ లేవో గుహల్ తోయముల్
లేవో యేరులఁ బల్లవాస్తరణముల్ లేవో సదా యాత్మలో
లేవో నీవు విరక్తులన్ మనుప జాలిం బొంది భూపాలురన్
సేవల్ చేయఁగఁబోదు రేలొకో జనుల్..."

అనియు, లేనిచో

"ఊరూరన్ జనులెల్ల బిచ్చమిడరో ఉండన్ గుహల్లేవో
చీరానీకము వీథులన్ దొరకదో శీతామృతస్వచ్ఛవాః
పూరం బేరులఁ బారదో తపసులన్ బ్రోవంగ నీ వోపవో
చేరం బోవుదు రేల రాజుల జనుల్..."

అనియు, నట్టివారిఁ గాపాడ భగవంతుఁ డున్నాఁడు సుమా యని ధైర్యము చెప్పుటే కాక, క్లేశముల కోర్చి పైఁ జెప్పిన రీతి వర్తించిన ప్రతిఫలమును వెంటనే చూపి వేసినాఁడు. ఈభావము భర్తృహరిశ్లోకమున లేదు.

మఱియొకటి :

"స్ఫురత్స్ఫారజ్యోత్స్నా ధవళితతలే క్వాఽపి పులినే
సుఖాసీనాస్సంతః ధ్వనిషు రజనీషు ద్యుసరితః
భవాభోగోద్విగ్నా శ్శివశివశివే త్యుచ్చవచసః
కదా స్యామానందో ద్గతబహుళ బాష్పాప్లుతదృశః"

అను చక్కని శ్లోకమును బోలిన—

"దినమున్ జిత్తములో సువర్ణముఖరీ తీరప్రదేశామ్రకా
ననమధ్యోపల వేదికాగ్రమున నానందంబునన్ బంకజా
సన నిష్ఠన్ నినుఁజూడఁ గన్న నదివో సౌఖ్యంబు లక్ష్మీవిలా
సినిమాయానటనల్ సుఖంబు లగునే..."

ఈపద్యమునందు శాంతారావ నిశీథకాలముల మాత్రమే కాక ప్రతినిత్యము బ్రహ్మనిష్ఠాగరిష్ఠత పరబ్రహ్మ స్వరూపముఁ గాంచి యానందింపవలె నని పై భావమునకు మెఱుఁగిడినాఁడు. ఇట్టి సౌందర్యము లెన్నియైన నీశతకమునఁ జూపవచ్చును.

పరమేశ్వరుఁడు స్త్రీపురుషుల సృష్టించి వారి నెందు లకు సృజించినాఁడో యాపనులే పాతకవ్యవహారము లని శాసించినాఁడు. ఈస్థితిని ధూర్జటి విశిష్ట నైపుణ్యముతో :

"చవిగోఁ జూడ వినంగ మూర్కొన తనూ సంఘర్షణాస్వాద మొం
ద వినిర్మించెద వేల జంతువులనే తత్క్రీడలే పాతక
వ్యవహారంబులు సేయు టేమిటికి..."

అని ప్రశ్నించుకొని, సమాధానము దొరకక, "మాయావిద్యచేఁ బ్రొద్దుపుచ్చి వినోదింపఁగ దీన నేమి ఫలమో" యని వాపోయినాఁడు.

మఱియుఁ, గరుణరసము తొలుకాడఁ దాను భగ వంతుని బిడ్డగా' నెంచుకొని ప్రార్థించినాఁడు.

"నీ పేరున్ భవదంఘ్రితీర్థము భవన్నిష్ఠ్యూతతాంబూలమున్
నీపళ్ళెంబుఁ బ్రసాదమున్ గొనికదా నీబిడ్డఁ డైనాఁడ న
న్నీపాటిం గరుణింపు మోప నీక నే నెవ్వానికిన్ బిడ్డగాఁ
జేపట్టందగుఁ బట్టి మానఁదగదో................."

'నీబిడ్డను', 'నీపట్టిని' అను పదములలోని స్వారస్యము, నందు వెల్లివిరియు కరుణరసము నొకదాని నొకటి మించు చున్నవి.

శతకకర్త దృఢనిశ్చయము

ఈశతకము భావప్రధానము, స్వానుభవసమన్వితము నగుట పై యుదాహరణములఁబట్టి కవి పండితుఁడుగా, యోగిగా, జ్ఞానిగా, భక్తుఁడుగా, విరాగిగా, లోకజ్ఞానిగా, సర్వజ్ఞుఁడుగా నిందు మన కనులకుఁ బ్రత్యక్ష మగుచున్నాఁడు.

అంతటివాఁడుకనుకనే కవి నిరంకుశుఁడై, "నిను సేవింపఁగ నాపదల్ పొడమనీ నిత్యోత్సవం బబ్బనీ..." యన్నాఁడు. "నిన్నునమ్మినరీతి నొరుల నమ్మ"నన్నాఁడు. "నీపంచఁ బడి యుండఁగాఁ గల్గిన భిక్షాన్న మే చాలు"నన్నాఁడు. "నిన్నే నిష్ఠ భజించెద" నని తన కవిత్వముసైతమీశ్వరునికేకాని యన్యుల కీయనని కంకణము కట్టుకొని సంకల్పసంసిద్ధి నంది ధన్యుఁడైనాఁడు.

శతక ఫలము

ఒక్కమాటలో నీశతకపఠనముచే జీవితప్రయోజన మిట్లుగాఁ గ్రోడీకరించి తెల్పి, తన్మార్గముఁ జూపి యొక్కసారిగా నుద్బోధించుచున్నాఁడు :

"సంపద్గర్వముఁ బాఱఁద్రోలి రిపులన్ జంకించి యాకాంక్షలన్
దంపుల్వెట్టి కళంకముల్ నఱికి బంధక్లేశదోషంబులన్
చింపుల్ చేసి వయోవిలాసముల సంక్షేపించి భూతంబులన్
చెంపల్వేయక నిన్నుఁ గాన నగునా..."

ఈపను లెన్నఁడో చేతు మన్నఁ గాదు :

"దంతంబు ల్పడనప్పుడే తనువునం దారూఢియున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు కానప్పుడే
వింత ల్మేనఁ జరింపనప్పుడె కురుల్ వెల్వెల్ల కానప్పుడే
చింతింపన్వలె నీపదాంబుజములన్..."

అను బ్రహ్మజ్ఞానోద్బోధముతో తన శతకము ముగించినాఁడు.

మ న వి ధి

ఈవిధముగా ననంతగుణ విశిష్టసంపన్న మగు నీశతకమున నింకను గ్రహింపవలసిన వెన్నియో కలవు. ఇంతటి మహోన్నతభావసమన్వితము లగు శతకము లాంధ్రవాఙ్మయమున నే విలసిల్లుట మన యదృష్టము. ఇట్టి శతకపరిశీలనమువలన శతకములు వాఙ్మయముగా భావింపఁజనదన్న కవిచరిత్రకారుల వాక్యమును, శతకము లాయాకవులు బాల్యమున పద్యము లల్లనేర్చుకొనుటకే వ్రాయఁబడిన వను దుర్భ్రాంతియుఁ ద్రోసిరాజని కొన్ని ప్రబంధములకంటెఁ గొన్నిశతకము లత్యంతస్తుతిపాత్రము లని ఘంటాపథముగాఁ జాటి, యిట్టి మహోన్నతశతకపఠనపారాయణము సద్విమర్శనములవలని యుపలబ్ధి నందుట మనవిధి.

---

౭

# సుమతిశతకము - కర్తృత్వము

ఆంధ్రదేశమునం దాబాలగోపాలమున కామోద సంధాయకమై చిరకాలమునుండి స్థిరకీర్తి నంది ప్రస్తుతము సైతము మిక్కిలి వ్యాప్తిలో నున్న సుమతిశతకమును విరచించిన విజ్ఞుఁ డెవఁ డన్న విషయ మింతవఱకును నిర్ధారణము కాలేదు. ఒక్క సుమతిశతకమే కాదు: ఉత్తమ గ్రంథము లెన్నియో కర్తృనామరహితము లైన వున్నవి. దీనికిఁ గారణ మానాఁటి యాంధ్రకవిపుంగవులు స్వలాభాపేక్ష లేక నామప్రకటనలాలసతకు లోనుగాక దాము నేర్చిన విషయములఁ బ్రజోపయోగకరముగాఁ జేయ సమకట్టుటయుఁ గావచ్చును. లేక, అనంత మగు కాలవాహినిలో నఖండము గాక ప్రయాణముచేయుచు నేఁటికి మన దురదృష్టవశమున నాయాభాగములు నష్టములై కవినామాదులు మనకు లభింపక పోవుటయుఁ గలదు. అట్టివానిగుఱించి ప్రబలాధారములను నిష్పాక్షికదృష్టితో సంపాదించి యాయా కవికాలకర్తృత్వములను నిర్ణయింపఁబూనుట సద్విమర్శకుల విధి.

ఇంతవఱకును సుమతిశతక కర్తృత్వమును గూర్చి మూఁడువాదము లున్నవి. సుమతి యను జైనముని కర్తృకమని యొక వాదము; వేములవాడ భీమకవి కృతమని యింకొకవాదము; బద్దెనకృత మని మఱియొక వాదమును. వీని

విషయమై కొంత పరిశీలనము చేసి వివిధ విషయములలో ప్రబలసందేహములను వెలిబుచ్చి యే నిర్ణయమునకును రాలేక శతకకవిచరిత్రకారులు కీ. శే. వంగూరి సుబ్బారావు గారు భావివిమర్శకులకు విడిచి యుంచినారు. వీరి మతమున నిలచినది మూఁడవ వాద మొక్కటియే. కాని తుదకు దాని విషయమునను గొన్ని సందేహములు వారికే కలుగఁగా నింతవఱకీవిషయనిర్ణయము జరుగలేదు. ఇచ్చటఁ గ్రమముగా నీమూఁడు వాదములను బరిశీలించి మూఁడును నిరాధారములే యని తెలుపుటే యీవ్యాసోద్దేశము.

ఇందలి మొదటివాదము మిగుల పేలవమైనది. ఐనను దీనికి రెండాధారములు కలవు. కవిచౌడప్ప వేమనల వలె సుమతి యను జైనముని ఆత్మసంబోధకముగా నీశతకమును వ్రాసినాఁడనున దొకటి. న్యాయముగ నాశతకమున :

"శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు నౌరా యనఁగా
ధారాళమైన నీతులు
నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ."

అను శతకారంభపద్యము లేదని చూపిన తాళపత్ర ప్రతి యొకటియు నీవాదమున కాధారము.

కాని, సుమతి యను జైనమునియే వ్రాసి యున్నచో విప్రులఁ బూజ్యార్థమున వాడియుండఁడు. మఱియు శతకారంభమునఁ బై పద్యము లేని ప్రతి యొక్కటి కానవచ్చుచున్నను మిగిలిన ప్రతు లన్నిట నీపద్య ముండుటచేతను,

జైనమతస్థుఁడు శ్రీరామునిఁ బూజించు టసంభవమగుట చేతను, ఇంతకు నీ వాదమును లేవఁదీసిన కీ. శే. వంగూరి సుబ్బారావు గారే దీని నుపసంహరించుకొనుటచేతను సుమతి శతకము జైనమునికృతము కాదని తేలినది.

ఇఁక వేములవాడ భీమకవికృత మనుట కింత కంటెను మూలాధారములు రెండుమూఁడు గలవు. అందు :

"కా దన్నవాఁడె కరణము,
వా దడఁచినవాఁడె పేడి, వసుధేశుకడన్
లే దన్నవాఁడె చనవరి,
గాథలు పెక్కాడువాఁడె కావ్యుఁడు సుమతీ."

అను పద్య మొకటి 'దథ'లకుఁ బ్రాసమైత్రి కుదాహ రణముగా నొక లక్షణకర్త గ్రహించినట్లు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (౬ సం. ౨౫౬ పుట) లోఁ గలదు. కాని, ఈ పద్యము ప్రస్తుతసుమతిశతకమున నే ప్రతియందును గానరాని కారణమున నింకొక సుమతిశతక మేదే నున్నదా యను సందే హమునకుఁ గారణమైనది. దీనికిఁదోడు ప్రాచ్య లిఖిత పుస్తక భాండారములో ౧౧-౨-౨౭ తాళపత్రప్రతిలో :

"శ్రీకరముగ భీమన మును
లోకమునకుఁ బాగడఁగా విలోకించి మదిన్ (?)
బ్రాకటముగ సుమతికి మతి
చేకూడఁగ సుమతినీతి చెప్పఁదొడంగెన్."

అను నొక శతకారంభపద్య మాముద్య లభించినది. దీనిని బురస్కరించుకొని భీమన సుమతిశతకము వ్రాసినాఁడని

వాదము. ఇంతకు మించిన ప్రబలాధార మింకొకటి కలదు. సర్వలక్షణసార సంగ్రహములో ఏఱుట-అకార మనుటకు :

"ఏఱకుమీ కసుగాయలు
దూఱకుమీ బంధుజనుల దోసముసుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువులాజ్ఞ మేదిని సుమతీ.

-భీమకవిసుమతిశతకము." అని యున్నది. ఈ పద్యము ప్రస్తుతసుమతిశతకమందును గలదు.

ఈవిషయముల ననుసరించి చూడఁగా నీవాదము కొంత ప్రబలముగానే కానవచ్చినది. కాని 'కాదన్న వాఁడె కరణ' మను పద్య మేప్రతియందును గానరాక పోవుటచేతను, "శ్రీకరముగ భీమన మును" అను పద్య భావము సందిగ్ధముగ నుండి యీ 'సుమతినీతి' యాతని గ్రంథనామమో, లేక అంతకు పూర్వమే విరచింపఁబడిన మఱియొక గ్రంథ సారాంశమో తెలియరాకుండటచేతను, కవిచరిత్రకారులైన వీరేశలింగముపంతులుగారు కాని, శ్రీరామమూర్తి పంతులుగారు కాని తమ భీమకవిచరిత్రములలో నీతఁడు సుమతిశతకమును వ్రాసిన ట్లెచ్చటను దెలుపకపోవుటచేతను భీమకవి దని వాడుకలో నున్న కవిజనాశ్రయమునందైత మీవిషయ మేకోశమునను లేనికారణమునను సుమతిశతకము భీమనకృతము కా దనవచ్చును. కాని, మూఁడవవిషయమున "ఏఱకుమీ కసుగాయల" పద్యము ప్రస్తుత సుమతిశతకమున

నుండుట యొక్క ప్రతిబంధక మగును. ఈవిషయమున ప్రస్తుతసుమతిశతకమునకుఁ బ్రతిగా మఱియొక సుమతిశతక ముండితీఱవలె ననుటకుఁ గొన్ని ప్రమాణములు లభించినవి. దీనివలనఁ బ్రకృతశతకమును భీమకవి వ్రాయలేదని బుజ్జవై నను, వేములవాడభీమకవిగాని, మఱియొక భీమకవినామ ధేయుఁడుకాని మఱియొక సుమతిశతకమును విరచించె ననియు, నది ప్రస్తుతము శిథిలమై యందలి పద్యములు కొన్ని చెదరి సందర్భరహితముగా నీసుమతిశతకమునఁ జొనుపఁ బడిన వనియు నాయభిప్రాయము.

ఆంధ్రసాహిత్యపరిషత్తులో సుమతిశతకతాళ పత్ర ప్రతులు పరిశీలించు సందర్భమున నొక ప్రతిపై "సుమతిశత కము-చంద్రాభొట్ల జోగయ్యశాస్త్రిగారి కుమారుఁడు కృష్ణ మూర్తి యీఅప్పన్నశాస్త్రుర్లుదస్తూరీ." అను నక్షరములతో వ్రాయఁబడిన ప్రతియొకటి కలదు. అందు ప్రస్తుతసుమతిశతక ములోఁ గానరాని పద్యము లెన్నియో కలవు. ఆప్రతి యసం పూర్ణముగా నుండుటే కాక చాలమట్టునకు శిథిలావస్థలో నున్నది. అందు ప్రధానముగాఁ గొన్ని పద్యము లిట నుల్లే ఖించుచున్నాను. ఈపద్యములు ప్రస్తుతసుమతిశతకమున లేక పోవుటేకాక ప్రస్తుతశతకమునఁ గల పద్యములు కొన్ని అందు లేవు. ఇందు నందుఁ గల సాదృశ్యపద్యముల నైనను పాఠభేదము లెక్కువగా నున్నవి.

అధికపాఠములు కొన్ని క్రమముగా నిచ్చుచున్నాను.

"అనఘా విను ముద్యోగికి ధనమొండెను నీతియొండె..."

మిగిలినది శిథిలమైనది.

"అలుకకు నెడ తొన్క(?)చల్లుట
కును బల్లము కాదు మిగులఁ గూర్చుటకొఱకే
వలయు నెడ నర్థమిచ్చుట, వెలయఁగ నభివృద్ధికొఱకె వినురా సుమతీ"

"ఎన్నఁడుఁ గుడువక నధికతఁ
దన్నే మరి కూర్చు ధనము ధరలో నెపుడున్
అన్నులకును రాజులకును, గన్నములకుఁ బోవుచుండుఁ గదరా సుమతీ."

"పొరుగింటి కేఁగ నిచ్చుట, సరసతఁ బతిఁ గూడి చనిన సతిఁ బుట్టింటం
జిరకాల ముండనిచ్చుట, పురుషుఁడు తన సతిని గోలుపోవుటె సుమతీ."

"బిరుసైన హయము నెక్కకు
మరుమాటం(తం)బలుకకు సుతుని మానక విడుమీ
వెరవెఱుఁగని...
తరచుగఁ బతి (సతి?) గవయఁజనదు ధరలో సుమతీ"

"రిపుపొత్తు పాముపొత్తును, గపటాత్ముని మిత్రు పొత్తు గడుసరిపొత్తున్
విపరీతి భార్య(?)పొత్తును, అపదష్టము(?)చేతవచ్చు నదిగో సుమతీ."

"సిరి తన్ను వలఁచియుండఁగ, సిరిగల్గిన చిన్నె లెల్లఁ జేయఁగవలయున్
సిరిఁ గూర్చి పొతలాడిన, సిరియుండదులోభియొద్ద సిద్ధము సుమతీ."

ఇట్టి పద్యము లెన్నియో కలవు. ఈ యధిక పాఠములే కాక ప్రకృతసుమతిశతకములోని యీక్రింది పద్యములును, మఱికొన్ని పద్యములు నాప్రతియం దెచ్చటను లేవు.

"శ్రీరాముని దయచేతనుఁ నారూఢిగ సకలజనులు నౌరాయనఁగా
ధారాళమైన నీతులు, నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ"

"పుత్త్రోత్సాహము తండ్రికిఁ
బుత్త్రుఁడు జన్మించినపుడె పుట్టదు జను లా
పుత్త్రుని గనుఁగొని పొగడఁగఁ
బుత్త్రోత్సాహంబు నాఁడు పొందుర సుమతీ."

"మది నొకని వలచియుండఁగ
మదిచెడ నొక క్రూరవిటుఁడు మానక దిరుగున్
అది చిలుక పిల్లిబట్టిన
జదువునె యాపంజరమున జగతిని సుమతీ."

"లావుగలవానికంటెను
భావింపఁగ నీతిపరుఁడు బలవంతుండౌ
గ్రావంబంత గజంబును
మావటివాఁ డెక్కినట్లు మహిలో సుమతీ."

"వేసరపు జాతిగానీ
వీసము దాఁ జేయునట్టి వెంగలిగానీ
దాసికొడుకైనఁగానీ
కాసులుగలవాఁడె రాజు గదరా సుమతీ."

ఈమొదలగు పద్యము లాప్రతియందుఁ గానరావు. ఈకారణములు నా పైయభిప్రాయమునకు దోహదము లగుట చేతను, సర్వలక్షణసారసంగ్రహమందలి 'ఏఱకుమీ కసుగాయల' అను పద్యము ప్రకృత సుమతిశతకమునందలి దే యైనను వినికిడిచేఁగాని, భీమన నామధేయుఁ డొకఁడు రచించిన మఱియొక గ్రంథ పద్యములఁ జూచి రెండింటికి నీతఁడే కర్త యను పొరపాటునఁగాని భీమకవిసుమతిశతక మనుట సంభవించియుండవచ్చు ననుటచేతను ప్రస్తుత సుమతి శతకము భీమకవికృతము కాఁజాలదు.

పిమ్మట మూఁడవవాదము బద్దెనకృత మనునది. దీనికిని రెండు మంచి యాధారము లుండుటచేఁ జాలకాలము (నేఁటివఱకు) ఈవాదమే నిలిచినది. ఇందు మొదటిది (శ్రీ

మానవల్లి రామకృష్ణకవిగారు బద్దెనసీతిశాస్త్రముక్తావళిని సంపాదించుచు :

"శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధజయలక్ష్మీసం
భావితుఁడ సుమతిశతకము
గావించిన ప్రౌఢఁ గావ్యకమలాసనుఁడన్"

అని బద్దెన చెప్పికొన్న ట్లొక పద్యము చేర్చియుండిరి. ఇది నిజ మను నూహా కలుగుటచే భీమనకృత మను వాదము వీఁగిపోయినది. తరువాత,

"పతికడకుఁ దన్ను గూర్చిన
సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల
మతిమంతులు చనరు నీతిమార్గము సుమతీ."

అను సుమతిశతకపద్యమునకు :

"సుతుకడకు వేల్పుకడకును...
బద్దెనరేంద్రా."

అను పాఠ మొక్కటి దొరకుటచే ప్రాచీనులుసైతము సుమతిశతకము బద్దెన దనువారుకలరు.—— అని యీవాద మున కాధారములు చూపిరి.

ఈవాదమును కవిచరిత్రకారు లగు వీరేశలింగముగా రంగీకరించి సుమతిశతకము బద్దెనకృత మనియే యుదాహ రించిరి. కాని పరిశీలించి చూడఁగా దీనికిని ప్రబలమైన ప్రతి బంధకములు గలవు. '(శ్రీ) విభుఁడ' నన్న పద్దె మొక్క ప్రతి

లోనే యున్నదని శ్రీకవిగారే వ్రాసిరి. వివిధప్రతులు చూచిన కీ. శే సుబ్బారావుగారికిఁ గాని, మూఁడు ప్రతులు తిలకించిన నాకుఁ గాని యీపద్య మెచ్చటను గానరాలేదు. అందుచే 'నీతిశతకము'నకు బదులు 'సుమతిశతక' మనియు నుండియుండవచ్చును. అగుట నిది యంత నమ్మఁదగినది కాదు. పైఁగా,బద్దెన నీతిశాస్త్రముక్తావళిలో తనగ్రంథమును గుఱించి యిట్లాశీర్వదించుకొనెను:

> "శ్రీవిభుఁడైన బద్దెనృపశేఖరు చేసిన నీతిశాస్త్రము
> క్తావళి శిష్టలోకహిత మయ్యెడుఁగావుత నాఁడునాఁటి కిం
> దీవరగర్భుఁడున్ శశియుఁ దిగ్మమరీచియు భూతధాత్రియున్
> దేవగణంబులున్ బుధులు దిక్పతులుం గలయంతకాలమున్"

ఇదియేకాక మఱియును గ్రంథాంతమందు-

"ఇది శ్రీ లక్ష్మీవల్లభ శ్రీపాదపద్మారాధకకమలాప్త కులపవిత్ర నన్ననగంధవారణ రాజరాజమనోజాంక బద్దెనాఖ్య ప్రణీతం బైన రాజనీతి ప్రకారంబన్నది సర్వము సంపూర్ణము"

అను గద్యముసైతము చేర్చియున్నాఁడు. ఇవి చేర్చిన బద్దెనృపాలుఁడే సుమతిశతకమును వ్రాసియున్నచో శతకారంభముననఁగాని, శతకాంతముననఁగాని తన నామధేయముఁ గాని, గద్యనుగాని చేర్చికొనియే యుండిడివాఁడు. కాన, ఈయాధారము చింత్యమే.

పోనిండు. ఉభయగ్రంథములకుఁ గల శయ్యా సాదృశ్యము ననుసరించి రెండును బద్దెనకృతములే యని నిర్ణయింత

మన్న, శైలీభేద మత్యంతముగాఁ గానవచ్చుచున్నది. రెండు గ్రంథములను దిలకించినవారి కీభేదము విస్పష్టముగాఁ దోఁచును. ఉదాహరణకు రెండుమూఁడు పద్యములు :

"అగుటయుఁ గామియు విధివశ
మగు టెఱుఁగక తనవశంబె యని డెందములో
వగచెడు మూఢుఁ గనుంగొని
నగఁడె విధాత్రుండు కీర్తినారాయణుఁడా"

(నీతిశాస్త్రముక్తావళి, ౨౦౨)

"ధరణిపుఁ డాజ్ఞచే శుభము దైవముచేతఁ దపంబు శాంతిచే
సురతము ప్రౌఢిచేఁ బలుకు సూనృతుచేఁ గుల మాత్మవేదిచేఁ
బురు లుపకారిచేఁ గవిత పూజ్యతచే సతి సాధుశక్తిచేఁ
బురుషుఁడు తాల్మిచే మహిమ పుణ్యముచే వెలయున్ యశోనిధీ.

(౧౧౫)

"పదివేల సురలు గొల్వఁగ బ్రదికెడు నింద్రునకు నేలఁ బాఱెడు క్రిమికిన్
మదిలోని మరణభయమును బ్రదుకాసయు నొక్కటిదీటె బద్దెనరేంద్రా."

ఇట్టి శైలీరమ్యత సుమతిశతకమున మృగ్యము. ఇంతియకాక బద్దెననీతిశాస్త్రముక్తావళిని సుమతిశతకకర్త యనుకరించె ననుటకుఁ గొన్ని యాధారములు కలవు. ఉదాహరణకు రెండుమూఁడు :

"నయ మన్నఁ బాలుఁ ద్రావరు భయ మన్న నమేధ్యమైన భక్షింతురు సా
నయముభయంబులలోపల భయమే నయమండ్రు బుధులు బద్దెనరేంద్రా."

(నీతిశాస్త్రముక్తావళి, ౧౧౨.)

"నయమునఁ బాలుం ద్రావరు భయమునను విషమ్మునైన భక్షింతురుగా
నయ మెంత దోసకారియొ భయమే చూపంగవలయుఁ బాగుగ సుమతీ"

(సుమతిశతకము, ౬౩.)

"సందియము లేమి వ్రాలకు నందము పురుషానుకూలి యగుట కులస్త్రీ
కందము మగవారికి నలవందము మర్యాద పతికి నందం బెందున్."
(నీతిశాస్త్రముక్తావళి, ౯౫.)

"చేతులకుఁ దొడవు దానము భూతలనాథునకుఁ దొడవు బొంకమిధరలో
నీతియె తొడ వెవ్వారికి నాతికి మానంబు తొడవు నయముగ సుమతీ."
(సుమతిశతకము, ౪౭.)

"అలుకయ పగ సౌజన్యమ చెలి యాసయ కష్టమెుప్పె సెగ్గము విద్యా
బలము గురుత్వము రాజ్యము ఫల మాజ్ఞయ యండ్రు బుధులు బద్దెనరేంద్రా"
(నీతిశాస్త్రముక్తావళి, ౭౮.)

"తనకోపమె తన శత్రువు తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము తన దుఃఖమె నరక మండ్రు తథ్యము సుమతీ"
(సుమతిశతకము, ౫౦౪)

అందుచే బద్దెనతరువాతికవియే సుమతిశతకమును విరచించె ననుటకే యివి సహాయపడునుకాని సుమతిశతకము బద్దెనకృత మనుట కివి యాధారములు కాఁజాలవు.

ఇట్లు జైనముని, భీమకవి, బద్దెన ముగ్గురిలోను నెవరును సుమతిశతకకర్తలు కాఁజాల రని తేలినది. కాని, సుమతిశతక కాలనిర్ణయమునకుఁ లభించిన యాధారములు కొన్ని పరిశీల నార్హములు. పైని తెలిపినట్లు బద్దెననీతిశాస్త్రముక్తావళి విర చించిన పిదపనే యీశతకము విరచింపఁబడె ననుటకు పైసా దృశ్యపద్యములే సాక్షి. ఇంతేకాక, ౧౨-వ శతాబ్దమునకుఁ జెందిన పాల్కురికి సోమనాథుని కృతుల యనుకరణములు నిందు స్పష్టముగ గోచరించుచున్నవి. ఒకటిరెండుదాహరణ ములఁ బరిశీలించినఁ జాలును :

"నల్లనో భామల యుల్లం బెఱుఁగక, గొల్లవాఁడైనను గోరునే కవయ
నొల్లని వెలయాలి నొల్లని నృపతి, నొల్లని చెలిఁబాయ నొల్లఁ డేనియును
గొల్లండు వాఁడేగా కెల్లెడజాతి, గొల్లఁడు గొల్లండె గొల్లఁ డేనియును"
(పండితారాధ్యచరిత్రము, పర్వతప్రకరణము)

"ఒల్లని పతి నొల్లని సతి నొల్లని చెలికాని విడువ నొల్లనివాఁడే
గొల్లండు కాక ధరలో గొల్లండును గొల్లఁ డౌనె గుణమున సుమతీ."
(సుమతిశతకము, ౨౩)

మఱియు సుమతిశతకమున గొల్లని నిట్లు నిందించుటయుఁ గాననౌను. "గొల్లని సాహిత్యవిద్య" మృగ్యమనియు, "కని కల్ల నిజము తెలియని, మనుజాధిపుఁడతఁడు గొల్ల మహిలో సుమతీ" మొదలగునవియు సోమనాథుని భావానుసరణములు.

ఇంతకుఁ దేలిన దేమనఁగా, నిట్టి ఛాయలు గల సుమతిశతకము చరిత్రజ్ఞులచే నిర్ణయింపబడిన బద్దెన కాలము (క్రీ. శ. ౧౨౬౧) నకును, సోమనాథుని కాలమునకును (క్రీ. శ. ౧౨౦౦,) దరువాతనే విరచింపఁబడె ననియు, దీని కర్తృత్వవిషయమున పై నుల్లేఖించిన విషయములఁబట్టి భీమకవి యన వేములవాడ భీమకవి కాఁ డనియుఁ, దన్నామధేయుఁ డింకొకఁ డింకొక శతకమును వ్రాసియుండిన వ్రాసియుండవచ్చుననియుఁ, బ్రస్తుతసుమతిశతకకర్త యాతఁడు కాక మఱియొకకవి గలఁ డనియుఁ దోఁచుచున్నది.

---

# ౧౧. అభిషేకనాటకము

## నాటక గ్రంథము :

శ్రీమంత మగుసంస్కృతసారస్వతమున భాసమహాకవి కాళిదాసాది మహాకవులచేఁ బ్రశంసితుఁ డగుటంబట్టియు లక్షణగ్రంథములఁ గొన్నిట నుదాహృతము లైన యాకవికతిపయశ్లోకములఁబట్టియు మొన్న మొన్నటివఱకు ననఁగా నిరువదవశతాబ్దారంభమువఱకు నామమాత్రుఁడుగనే యుండెను గాని యాతనికృతు లేవియుఁ దెలియరాలేదు. ఈస్థితిలో సారస్వతమహోదధిని గాలించుటలో నందెవేసిన చేయి యనఁదగిన మహామహోపాధ్యాయ డాక్టరు టి. గణపతిశాస్త్రిగారు క్రీ. శ. ౧౯౧౨ వ సంవత్సరమున 'స్వప్నవాసవదత్తాదు లగు పదుమూఁడు నాటకరత్నములను సంపాదించి తిరువనంతరపు సంస్కృతగ్రంథమండలి పక్షమునఁ బ్రకటించి యవి భాసనాటకరత్నము లని నిర్ధారించి సారస్వతప్రియులకు మహోపకృతి నొనర్చిరి. ఈ పదుమూఁడునాటకములలో నొకటి "యభిషేక నాటకము," ఈనాటకమును ౧౯౩౦ వ సంవత్సరమున మహోపాధ్యాయు, విద్యాభూషణ శ్రీ వి. వేంకటరామశాస్త్రిగారు మఱియైదుమళయాళ భాషాక్షరములతో నున్న తాళపత్త్రప్రతులను, ఆశ్చర్యచూడామణిప్రతిమానాటకములతోఁ గలిసి 'రామనాటక' మనుపేర

నాగరలిపిలో మదరాసుప్రాచ్యగ్రంథనిలయమున లభించిన కాకితపుం బ్రతితోడను సంప్రదించి యనేకము లగుపాఠాంతరములతో లాహోరునుండి ప్రకటించియున్నారు. పూనానుండి తరువాత యీనాటకము లన్నిటిని శ్రీ సి. ఆర్. దేవధరనువారు ౧౯౩౭ వ సంవత్సరమున "భాసనాటకచక్ర" మను పేరఁ జక్కఁగాఁ బ్రకటించియున్నారు.

### నాటక నామము

ఇది శ్రీమద్రామాయణనాటకములలో నొకటి. ఇందుఁ గిష్కింధ, సుందర, యుద్ధకాండములలోఁ గలకథాభాగము ప్రపంచితము. సుగ్రీవ విభీషణ రామపట్టాభిషేకము లిందుఁ గలకారణముచే "అభిషేకనాటక" మని దీనికిఁ బేరువచ్చెను.

### కథావస్తుకము

ఇందుఁ బ్రథమాంకమునఁ గలకథ యిది: భ్రాతృదారాభిమర్శనదోషి యగువాలిని సంహరింప శ్రీరామసహాయుఁడై సుగ్రీవుఁడు వచ్చును. ఆసంగతి విని వాలి యుద్ధోన్ముఖుఁడై పోఁబోనఁ దార నివారించును. అది సరకుగొనక వాలి యుద్ధమునకు వచ్చును. వాలిసుగ్రీవు లిరువురు ఘోరయుద్ధము చేయుదురు. ఆసమయమున సుగ్రీవుఁడు బలహీనుఁడగుటఁ గని హనుమంతుఁడు రామునిఁ జేరి కాపాడఁగోరును. రాముఁడు ప్రచ్ఛన్నముగ నుండి బాణము విడిచి వాలిని గూల్చును. వాలి విగతప్రజ్ఞుఁడై నేలకొరగును. రామునితో

వాలిసంవాదము, సుగ్రీవసమాశ్వాసనము, అంగదాగమనము నగును. వాలి యంగదుని సుగ్రీవున కొప్పగించి తనతప్పులు సైఁపుమని కోరుకొనును. హేమమాలిని సుగ్రీవుని కిచ్చి వానరాధిపత్య మొసంగి వాలి వీరలోకప్రాప్తి నందును. సుగ్రీవునకుఁ బట్టాభిషేకకల్పనము జరగును.

రెండవయంకమునందలికథ : సీతాన్వేషణమునకై సుగ్రీవునిపంపున సర్వదిశలకు వానరు లేఁగుదురు. అందు హనుమంతుఁడు తక్కఁ దక్కినవా రందఱు సీతను గానక తిరిగి వత్తురు. జటాయువుపచనమునుబట్టి హనుమంతుఁడు సముద్రము దాఁటి లంక కేఁగును. అం దాతఁడు సర్వప్రదేశములందు సీతను వెదకును. తుద కాతఁడు ప్రమదవనమున నశోకమూలమున సీతను దర్శించి శ్రీరామవృత్తాంతము నివేదించును. సీతను సమాశ్వాసించి హనుమంతుఁడు తన యాగమనమును రావణున కెఱింగించుటకై ప్రమదవననాశనము మూలమున రావణుని దానే దర్శింప నిశ్చయించుకొనును.

తృతీయాంకమందలికథ : హనుమంతుఁ డశోకవనభంజనము నొనర్చును. అది విని రావణుఁ డాతనిఁ బట్టుకొనుటకై కింకరులఁ బంపును. వారు నాశన మగుదురు. అపుడు సేనాపతులతో నక్షకుమారుఁడు వానరగ్రహణార్థ మేఁగును. అక్షకుమారుని హనుమంతుఁడు చంపును. హనుమంతుఁడు రావణుని జూచునిమిత్తమై యింద్రజిత్తునకుఁ దానే వశుఁ

డయి తన్స్వాలమున రావణుని దర్శించును. అట నాతఁడు రావణునకు రామశాసనము విజ్ఞాపించును. రావణుఁడు ప్రతి సందేశ మొసంగును. విరక్తహృదయుఁడై విభీషణుఁ డన్నకు నీతి గఱపును. దానికి ఫలితముగ రావణుఁడు విభీషణుని లేవఁగొట్టును. శ్రీరాముని శరణు వేఁడుటకై విభీషణుఁడు నిశ్చయించుకొని పోవును.

చతుర్థాంకమున శ్రీరాముఁడు కపీంద్రసైన్యసహితుఁడై యుద్ధప్రస్థాన మొనరించును. విభీషణుఁడు రాముని శరణు వేఁడ నేతెంచును. విభీషణుని సమాశ్వాసించి శ్రీరాముఁ డాతనికి లంకాపట్టాభిషేకము చేయ నిశ్చయించును. విభీషణునియాలోచనమున శ్రీరాముఁడు సముద్రుని భయపెట్టును. సముద్రుఁడు శ్రీరామాదులకుఁ దెరు విచ్చును. దానివెంట సర్వసైన్యములతో శ్రీరాముఁడు సముద్రమును దాఁటును. ఎల్లరు లంకఁ జేరి సువేలాపర్వతము పయి సేనాసన్నివేశము జరపుదురు.

పంచమాంకమున రావణుఁడు రామలక్ష్మణుల మాయాశిరములఁ బ్రదర్శింపఁజేసి రామలక్ష్మణమరణవృత్తాంతనివేదనమున సీతను లోభపెట్టఁ జూచును. ఆసమయముననే యుద్ధమున నింద్రజిత్తుఁడు మరణించె నన్నవార్త రాఁగా విని రావణుఁడు దుఃఖించును. సుతప్తహృదయుఁడయ్యు మరల సమాశ్వాసితుఁడై రావణుఁడు రామలక్ష్మణు

లను నశింపఁజేయుప్రవృత్తి నంది సీతను బెదరించుచు యుద్ధో
న్ముఖుఁ డగును.

షష్ఠాంకమున రామరావణయుద్ధవిశేషములు రావ
ణుని మృతియు ముగ్గురు విద్యాధరులు వర్ణింతురు. తుద
కగ్నిపరిశుద్ధ యైనసీతను రాముఁడు పరిగ్రహించును. అనంత
రము శ్రీరామపట్టాభిషేక మగును. ఇది నాటకప్రతిపాద్య
వస్తువు.

నాటకకర్త:

ఈనాటకకర్త యెవ రన్నవిషయము తొలుత వివాద
గ్రస్తముగనే యుండెను. "భాసనాటకచక్ర" మనుపేరఁ
బరగుచున్న స్వప్నవాసవదత్తము, బాలచరితము, ప్రతిజ్ఞా
యౌగంధరాయణము, దూతవాక్యము, ప్రతిమానాటకము,
అభిషేకనాటకము, కర్ణభారము, ఊరుభంగము, మధ్యమ
వ్యాయోగము, దూతఘటోత్కచము, పంచరాత్రము,
చారుదత్తము ననునీపదుమూఁడింటిని భాసుఁడే రచించె నని
మొదటివాదము. ఆశ్చర్యచూడామణీనాటకకర్తయుఁ గేరళ
దేశవాసియు నగుశక్తిభద్రకవియే యీనాటకమును వ్రాసి
యుండవలె నని మఱియొకవాదము. వేరెవరైన నేమి
యీనాటకము భాసకృతము కాదనియు "చాక్యార" శాఖకుఁ
జెందినదాక్షిణాత్యుఁ డొకఁ డీనాటకకర్త యని మూఁడవ
వాదము.

ఇందు మొదటివాదమే సత్యమన నిలచినది. అందుచేఁ
దుదిరెండు వాదములు స్థాలీపులాకన్యాయమున బరీక్షించి

యవి నిరాధారములని మొదటివాదమునకు వత్తము.
ఆశ్చర్యచూడామణీనాటకకర్త యగుశక్తిభద్రుఁడే యీనాట
కము రచించియుండవచ్చునని శ్రీమహోపాధ్యాయ, విద్యా
భూషణ పండిత వి. వేంకటరామశాస్త్రిగారు తాము సంపా
దించి ప్రకటించిన యభిషేకనాటకమునఁ బేర్కొనిరి. ఇందు
లకు వారు సూచించినకారణములు రెండు. మొదటిది :
"రామనాటక" మనుపేర అభిషేకనాటకము ప్రతిమానాట
కము, ఆశ్చర్యచూడామణీనాటకము మూఁడును గలిసియే
పెక్కుతాళపత్త్రగ్రంథములఁ గాననగుట. రెండవది : అభి
షేకనాటకమునకు నాశ్చర్యచూడామణి నాటకమునకుఁ గల
పరస్పరసామ్యబాహుళ్యము. ఆసామ్యము లివి :

రెండునాటకములందును ద్వితీయాంకమున : "దేవా!
జయము. లంకేశ్వరా! జయము. స్వామీ! జయము మహా
రాజా! జయము. పదిగంటలు కొట్టినవి. స్నానవేళ యైనది.
మహారాజా! లెండు. లెం" డనియే యున్నది.

రెండునాటకములలోను రావణుఁడు సీతను దలఁచు
కొనునప్పుడు చంద్రోపాలంభము చేయును.

రెండిటియందు సీత ప్రీడిత యగును.

రెండిటియందు రాముఁడు శోకపరవశుఁడు కాని విధ
మున నే తనవృత్తాంతము చెప్పుమని సీత హనుమంతునితో
ననును. రెండిటియందు "సర్వదా ఈశ్వరుఁడు శాంతి చేకూర్చుఁ
గాక!" యని సీత పలుకును. ఆఱవయంకమున నభిషేకమున

"చ. శరములజల్మిచే నిపుడె చంపితి యుద్ధమునందు రావ
ణున్" అనియు నాశ్చర్యచూడామణిలో "చ. శరముల
జల్మిచే నిపుడె చంపితి యుద్ధమునందు వాలినిన్" అనుపద్య
భావము సమానముగా నున్నది. మఱియు రెండు నాటకము
లందును

"లక్ష్మ:—ఆశ్చర్య మాశ్చర్యము !

రామ:—లక్ష్మణా ! ఆమె యిష్టమువచ్చినరీతిని బతివ్రతల
చందమునే సీత నవలంబింపనిమ్ము.

లక్ష్మ:—చిత్తము." అనియే కలదు. తెరలో దివ్యగంధర్వ
గానము రెండిట సమానభావవిలసిత మయియున్నది.
"బాఢమ్ ; ప్రథమఃకల్పః; అహోతుఖలు" అనుమా
టలు రెండిట బహుపర్యాయములు వాడఁబడి
యున్నవి. ఇది కాక :

"యమ వరుణ కుబేరవాసవాద్యై స్త్రిదశగణైరభిసంవృతో విభాతి ।
దశరథవచనాత్కృతాభిషేక-స్త్రిదశపతిత్వమవాప్య వృత్రహేవ॥"
అనుశ్లోకము సమముగనే కలదు.

ఈవిధముగ రెండునాటకములందును జక్కనిసామ్యము
లున్నవి. అంతమాత్రమున నివిరెండును నొకఁడే రచించె
ననఁ బొసఁగదుకదా ! ఆపద్ధతి నభిషేకనాటకమున నింకను
మిగిలినభాసనాటకములతోడిపోలిక లెన్నియో కలవు.
పైఁగా, అభిషేకమును గాంచియే యాశ్చర్యచూడామణి
శక్తిభద్రుఁడు రచించి యుండవచ్చు ననుటయు సంగతమే
యగును. కావున, నింతమాత్రమునఁ దగినప్రమాణములు

లేవిదే యభిషేకమును శక్తిభద్రుఁడు రచించె ననుట హాస్యాస్పదము.

మూఁడవవాదమునకుఁ జూపఁబడినయుపపత్తు లివి : ఈనాటకమునఁ "ప్రస్తాపనకు" బదులు "స్థాపన" యుండుటయు. నిం డెందును నాటకకర్త నామ ముదాహృతము కాకపోవుటయు, భరతమునినాట్యశాస్త్రమర్యాదలకు వ్యతిరేకముగాఁ గొన్నికల్పన లిందుండుటయుఁ గేరళదేశనాట్యరంగమునఁ బరిపాటిగా నుండు "అశోకవనికాంకము, వాలివధాంకము" మొన్నగుపేళ్ళతో నిందలియంకములు వాడఁబడుటయుఁ గొన్నిప్రాకృతవాక్యము లిందుఁ గేరళదేశీయుల నానుడులఁబట్టి ప్రయుక్తము లగుటయుఁ గేరళదేశమునఁ జిరకాల మీనాటక మాడఁబడుటయుఁ గారణములుగా దీని నొక కేరళకవి వ్రాసియుండవచ్చు నని కొందఱువిమర్శకులు వాదించిరి.

కాని యెన్నియో దాక్షిణాత్యనాటకములు కవుల పేళ్ళతో నుదాహృతములై యున్నవి. అందుచేఁ గవినామము పేర్కొనఁబడకపోవుట కేరళదేశాచార మన వీలులేదనియుఁ, గేరళదేశనాట్యశాల క్రీస్తుశకము పదిపండ్రెండుశతాబ్దముల లోనే పేరందుటచే నంతకుఁ బూర్వము కాళిదాసాదులకును బూర్వమే యీభాసనాటకములు కీర్తిగనియున్న వనుట నిర్వివాదాంశ మనియుఁ గొన్నిప్రాకృతవాక్యములకుఁ గేరళదేశపునానుడులకు సంబంధమే లేదనియుఁ జెప్పి యీవాదమును విమర్శకులు త్రోసిపుచ్చిరి.

భాసుఁడే యీనాటకకర్త:

ఈవిషయమును దేల్చుటకుముందు "భాసనాటకచక్ర" మనుపేరఁ బరగుపదుమూఁడు|నాటకములు నేకకర్తృకములని తేల్చవలసియున్నది. ఇవి యన్నియు నొక్కనిచేతనే రచియింపఁబడిన వనుటకు హేతువు లివి:

ఈనాటకము లన్నియు "నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును" అనియే ప్రారంభింపఁబడినవి. ఆతరువాతనే యన్నిట సూత్రధారుఁడు మంగళశ్లోకమును బఠించును. అన్నిటియందును బ్రస్తావనకుబదులు స్థాపనయే సంక్షేపరూపమునఁ గలదు. పెక్కునాటకములందు "ఆర్యమిశ్రుల కిట్లు విన్నవించెదను. (పరిక్రమించి చూచి) ఏమి! నేను బలుకఁ బోవుసరి కేదోశబ్దము వినవచ్చుచున్నదే! ఏమది?" అనియే కలదు. ప్రధానరంగసూచనపట్లఁ బెక్కిటఁ బ్రయోగాతిశయపద్ధతియే వాడఁబడినది. తుదిభరతవాక్య మన్నిట నీషద్భేదముతో సమానముగనే యున్నది.

ఈనాటకములఁ బెక్కింటియందు భరతమునిప్రతిపాదితము లగురంగ నియమములు పాటింపఁబడలేదు. నియమవిరుద్ధముగ మరణము, యుద్ధము, క్రీడ, నిద్రాదులు, రంగమునఁ జూపఁబడినవి. కార్యత్వరితగతిసూచకములుగా "నిష్క్రమించి ప్రవేశించును" అనువిధానమునను, ఆకాశభాషితరూపముగను గథాగమనమును జూపుట యీనాటకములలోఁ బలుతావులఁ బరిపాటి. కొన్నిట విద్యాధరులు,

గొన్నిట బ్రాహ్మణులు, కొన్నిట సైనికులు యుద్ధవిశేషములను వర్ణింతురు. అభిషేకమునకుఁ బ్రతిపాళనమునకు, నాచమనాదులకు నీరు రంగస్థలమునఁ జూపుట యీనాటకములందుఁ గొన్నిటఁ గానవచ్చుచున్నది.

భావైక్యమే కాక భాషైక్యము కూడఁ బెక్కునాటకములయందు విస్పష్టముగా గోచరించుచున్నది. వీరులను సింహవ్యాఘ్రాదులతోడను బ్రతివీరులను మత్తేభహరిణాదులతోడను బోల్చుటయు, సూర్యచంద్రనక్షత్రాది వర్ణనములు; చీకటి, రాత్రము, యుద్ధరంగములు, సముద్రము మున్నగు వానిఁ బేర్కొనుటలో భాషైక్యము పెక్కుతావుల భాసమానమగుచున్నది. కర్ణుఁడు, దుర్యోధనుఁడు, వాలి మున్నగు ప్రతివీరులపట్ల జాలి చూపుటయు, నప్రధాన పాత్రములను బెక్కునాటకముల నొక్క పేరితోనే వెలయించుటయు నీనాటకములఁ గానవచ్చును.

ఇంతేకాక, ఒకేవిధ మగునాటకపరిస్థితులు పలుతావులఁ గలవు. దశరథుఁడు, వాలి, దుర్యోధనుఁడు మరణించునపుడు కాంచినదృశ్యములు, సీత, వసంతసేన మున్నగు నాయికలు తమ్ముఁ గామించినప్రతినాయకుల నొకేవిధమగు దూషణములతో నిరాకరించుటయు నిందులకు సాక్ష్యములు. పెద్దలయెడ భక్తి, బ్రాహ్మణులయెడ గౌరవము, యజ్ఞదానాదిప్రశంసలు, న్యాయవర్ణాశ్రమధర్మరక్షణము, స్వాతంత్ర్యకాంక్ష, శత్రునాశనవ్యగ్రత మున్నగున వీనాటకముల సమానములు.

ఈకారణములచే నీపదుమూఁడునాటకములు నేక కర్తృకములే యని విమర్శకులు నిర్ణయించియున్నారు. వీనిలో నొకటి యగు స్వప్నవాసవదత్తము భాసకవికృత మని కొందఱు పేర్కొనియున్నారు. రాజశేఖరుఁడు తన "సూక్తిముక్తావళి" లో స్వప్నవాసవదత్తమును గూర్చిన వృత్తాంతము నిట్లు పేర్కొనియున్నాఁడు :

శ్లో॥ భాసనాటకచక్రేపి ఛేకైః క్షిప్తే పరీక్షితుం,
స్వప్నవాసవదత్తస్య దాహకోఽభూన్న పావకః."

అనఁగా భాసునిశత్రువు లాతని గ్రంథము లన్నిటిఁ బరశు రామప్రీతి గావింప నందు స్వప్నవాసవదత్తమే యగ్నిదగ్ధము కాక నిలచియుండె నని భావము. ఈవిషయమునే ౧౨వ శతాబ్దికిఁ జెందిన "పృథ్వీరాజచరిత" కావ్యకర్త యగు జయానకుఁడు భాసుఁడు, వ్యాసుఁడు అనుకవు లిరువురు తమ కావ్యోన్నతి నిర్ణయించుసమర్థుఁడు లేమి నుభయులకావ్య ములు నగ్నికాహుతియొనర్చి రనియు నందు భాసగ్రంథములే నశింపక నిలువ నాతఁడే మిన్న యని యెన్నఁబడెనని తెల్పి యున్నాఁడు. దీనినిబట్టి స్వప్నవాసవదత్తము రచించినవాఁడు భాసుఁడే యనవలయుఁగదా!

మఱియు బాణుఁడు తనహర్షచరిత్రములో :

శ్లో॥ సూత్రధారకృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః,
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ."

అని భాసమహాకవినాటకలక్షణములను బ్రపంచించి యున్నాఁడు. ఈలక్షణము లన్నియు నీనాటకముల కన్వయింౘ

చూచుగాన భాసుఁడే యీనాటకములకుఁ గర్త యని యనవచ్చును.

మఱి పూర్వాలంకారికగ్రంథములలోఁ బేర్కొనఁబడిన స్వప్నవాసవదత్తము ప్రస్తుతము తిరువనంతపుర ప్రచురిత మగుస్వప్నవాసవదత్తము నొక్కటే యని ధ్రువపఱచినచో భాసకృత మనువాదమునకు మిక్కిలిబలము కలుగును.

అభినవగుప్తాచార్యుఁడు (క్రీ. శ. ౧౦ శతాబ్దము) తన భరతనాట్యశాస్త్రవ్యాఖ్యలో :

"క్వచిత్ క్రీడా యథాస్వప్నవాసవదత్తాయాం" అని పేర్కొని యుండెను. ఈవాక్యము ప్రస్తుత ముద్రణమున ద్వితీయాంకమందలి రంగస్థలసంబంధమైనది. ఇది కాక, అభినవగుప్తుఁడే తన ధ్వన్యాలోకవ్యాఖ్యానమున :

శ్లో॥ సంచితపక్ష్మకపాటం నయనద్వారం స్వరూపతాడనేన ।
ఉద్ఘాట్యసాప్రవిష్టా హృదయగృహం మే నృపతనూజా॥"

అనుశ్లోకము స్వప్నవాసవదత్తములోని దని పేర్కొనియున్నాఁడు. ఈశ్లోకము ప్రస్తుతముద్రణమున లేకపోయినను దాని కుచిత మగుసందర్భమే స్వప్నరంగమునఁ గానవచ్చుచున్నది. తరువాతఁ దరువాత నీశ్లోకము పొరపాటునఁ దొలఁగియుండవచ్చును.

భోజదేవుఁడు (క్రీ. శ. ౧౧ శతాబ్దము) తన "శృంగారప్రకాశము" ౧౨వ ప్రకాశమునఁ బేర్కొన్నస్వప్నవాసవదత్తావృత్తాంతములు ప్రస్తుతపుఁబ్రతిలో నైదవయంకమునఁ గలవు.

శారదాతనయుఁడు (౧౨ శతాబ్దము) తన "భావ ప్రకాశము"లోఁ బ్రశాంతనాటకమున కుదాహరణముగా నొకస్వప్నవాసవదత్తకథావస్తువును దెల్పియున్నాఁడు. అల్ప భేదములు తప్పించినచోఁ బ్రకృతపుఁబ్రతిలో నవి యన్నియుఁ గలవు.

సర్వానందుఁడు (౧౨ శతాబ్దము) తన "అమరకోశ టీకాసర్వస్వము"లో నర్థశృంగారమున కుదాహరణముగాఁ బద్మావతితోడియుదయను వివాహమును చేర్కొనెను. ప్రస్తుత మున్నప్రతిలో నిది కలదు.

రామచంద్రుఁడు గుణచంద్రుఁడు (౧౨ శతాబ్దము) ననువారు తమ "నాట్యదర్పణము"న స్వప్నవాసవదత్తము నుండి యుదాహరించుటే కాక :

"యథా భాసకృతే స్వప్నవాసవదత్తే శేఫాలికాశిలా తల మవలోక్య వత్సరాజః :

శ్లో॥ పాదాక్రాంతాని పుష్పాణి సోష్మచేదం శిలాతలమ్ ।
నూనం కాచి దిహాసీనా మాం దృష్ట్వా సహసా గతా ॥"

అని స్పష్టముగాఁ జేర్కొనియున్నాఁడు. ఇది ప్రస్తుతపుఁ బ్రతిలో లేకపోయినను దీనికిఁ దగినసందర్భ మిందుఁ గల దనియు నది వ్రాఁతకాని పొరపాటున దాఁటిపోయి యుండు ననియు డాక్టరు శుక్థాంకరు మున్నగు విమర్శకు లభిప్రాయ పడి యున్నారు.

సాగరనంది (౧౩ శతాబ్దము) తన "నాటకలక్షణ రత్నకోశము"లో స్వప్నవాసవదత్తములోని కొంతభాగముఁ బేర్కొనెను. ఇదియుఁ బ్రస్తుత ముద్రణమున లేకపోయినను. ఆపేర్కొన్నభాగము కవి తనసొంత మాటలతోఁ జెప్పిన ప్రస్తుతపుఁ బ్రతిలోనికథాభాగమే యైయుండవచ్చునని విమర్శకు లనిరి.

౧౪ వ శతాబ్దమునకుఁ జెందిన "శాకుంతలవ్యాఖ్య" యనునముద్రిత గ్రంథమున సరిగాఁ బ్రస్తుతపుఁబ్రతిలోఁ గల ప్రస్తావనను గుఱించియే పేర్కొనఁ బడియున్నది.

ఇందుచేఁ బ్రస్తుతస్వప్నవాసవదత్తముయొక్క ద్వితీయ పంచమాంకము లభినవగుప్తుఁడు; పంచమాంకము భోజదేవుఁడు; ౧, ౪, ౫, ౬ అంకములు శారదాతనయుఁడు; చతుర్థాంకము రామచంద్ర గుణచంద్రులు; శాకుంతల వ్యాఖ్య ప్రస్తావనమును బేర్కొనియుండె ననుట నిర్వివాదము. అందుచే నీపదుమూఁడునాటకములకు భాసుఁడే కర్త యనవలయును.

### భాసప్రశస్తి:

పైని బేర్కొన్నవారే కాక జయదేవకవి తనప్రసన్న రాఘవమున :

"శ్లో॥ భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః"

అనియు, వాక్పతిరాజు తన "గఉడవాహో" అనుగ్రంథమున భాసుఁ డగ్నిమిత్త్రుఁ డనియు; దండి తన "అవంతిసుందరి కథ"లో :

శ్లో॥ "సువిభక్తముఖాద్యంగైః వ్యక్తలక్షణవృత్తిభిః ।
పరేతోఽపి స్థితో భాసః శరీరైరివ నాటకైః ॥"

అనియు; కాళిదాసు 'మాళవికాగ్నిమిత్రము'నను వామనుఁడు 'కావ్యాలంకారసూత్రవృత్తి'లోను భాసునిఁ బ్రశంసించిరి. ఈయాకారణములచే నీలక్షణములఁ బుణికిపుచ్చుకొన్న పదుమూఁడునాటకములు భాసకృతము లనియే యనవలయును.

కాని, నిలువకపోయినను భాసుఁ డీనాటకములకుఁ గర్తకాఁ డన్న వాదసారము సంక్షేపముగా నిది :

(అ) రాజశేఖరుని దని జల్హణుని సూక్తిముక్తావళిలోఁ జేర్కొనఁ బడినశ్లోకమును దానిపూర్వాపరశ్లోకములతోఁ గలిపి పఠించిన నీశ్లోక మర్థరహితముగాఁ దోఁచును. కాన, నిది ప్రక్షిప్తము.

(ఆ) ప్రతిమానాటకమునఁ జేర్కొన్న 'మేధాతిథేర్న్యాయశాస్త్రమ్' అన్న మేధాతిథి క్రీ. శ. ౧౦ వ శతాబ్దమువాఁడు కనుక భాసునకుఁ దరువాతివాఁడే కాని పూర్వుఁడు కాఁడు.

(ఇ) ప్రాచీనలక్షణగ్రంథములలోఁ జేర్కొన్నశ్లోకములు సరిగాఁ బ్రస్తుతపుఁ బ్రతులలోఁ గానరాలేదు.

(ఈ) ఆస్వప్నవాసవదత్తము స్వప్ననాటక మనియు వాసవదత్తనాటిక యనియుఁ బేరందినదిగాన నది వేఱు నిది వేఱు.

(ఉ) స్థాపనాదులలో గ్రంథకర్త పేరు లేనికారణముస నివి భాసకృతము లనుట నమ్మఁదగదు.

(ఊ) బాణుని "సూత్రధారకృతారంభైః" అన్న శ్లోకమున కతివ్యాప్తిదోష మంటినది. కావున, నది యీనాటకములకు వర్తింపఁజేయఁ జూచుట హాస్యాస్పదము.

ఈరెండువాదములకు మధ్యవాదమువారు కొందఱు స్వప్నవాసవదత్తము ప్రతిజ్ఞాయౌగంధరాయణముమాత్రమే భాసునినాటకము లనియు మిగిలినపదునొకండుభాసనాటకములు కావనియు విమర్శ సాగించిరి. పూర్వ విమర్శనుబట్టి భాసుఁడే వీనికర్త యని పెక్కురువిమర్శకులు నిర్ధారించియున్నారు.

భా సు ని కా ల ము :

భాసునికాలము నిర్ణయించుట బహుకష్టసమస్య. భాసుఁడు క్రీ. పూ. ౫, ౪ శతాబ్దప్రాంతమువాఁ డని యీ క్రిందియాధారములఁబట్టి విమర్శకులు నిర్ణయించిరి :

భాసునినాటకములలోని చారిత్రకవ్యక్తులు ఉదయనుఁడు, ప్రద్యోతుఁడు, దర్శకుఁడు మున్నగువారు క్రీ. పూ. ౬ వ శతాబ్దమునకుఁ జెందిన వారు. భారతరామాయణము లప్పటికే వ్యాప్తినందియుండెఁ గాన భాసుఁడు క్రీ. పూ. ౪౫వశతాబ్దమునకుఁ బరుఁడే కాని పూర్వుఁడు కాఁజాలఁడు.

ప్రతిజ్ఞాయౌగంధరాయణము, అవిమారకము, స్వప్నవాసవదత్తము లందుఁ గలరాజవంశములఁబట్టియు, రాజ

గృహ పాటలీపుత్రప్రశంసలఁ బట్టియు భాసుఁడు క్రీ. పూ. ౫ వ శతాబ్దివాఁడు కావచ్చు.

నాగవన, వేణువన, రాజగృహ, పాటలీపుత్రములు బుద్ధునితరువాతఁ బ్రబలినవి కనుకను, శాక్యశ్రమణకుఁడు, నగ్నశ్రమణిక – ఈపేళ్ళఁబట్టియు భాసుఁడు బుద్ధునకుఁ బిమ్మటివాఁ. డనవలయును. అనఁగా నాతఁడు క్రీ. పూ. ౫ వ శతాబ్దిప్రాంతమువాఁడు.

ప్రతిమానాటకములోఁ బేర్కొనఁబడిన 'మానవీయ ధర్మశాస్త్రము,' మాహేశ్వరయోగశాస్త్రము, బార్హస్ప త్యార్థశాస్త్రము మున్నగునవి క్రీ. పూ. ౬, ౫, శతాబ్దులకుఁ జెందినవి కావున భాసుఁడు తరువాతివాఁ డనవలయును.

ఈనాటకములందలిభరతవాక్యములఁ బేర్కొనఁబడిన రాజు హిమాలయముమొదలు వింధ్యమువఱకును యావత్స ముద్రప్రాంత భూభాగము నేలినవాఁ డగుట నీతఁడు రాజ సింహనాముఁడు కాక రాజసింహబిరుద విరాజితుఁడును చంద్రగుప్తమౌర్యునకుఁ బూర్వుఁ డైనఉగ్రసేనమహాపద్మ నందుఁడై యుండవలయు నని చరిత్రజ్ఞు లూహించియున్నారు. ఈతఁడు క్రీ. పూ. ౫ వ శతాబ్దప్రాంతమువాఁడే.

దిఙ్నాగమహాకవి తనకుందమాలానాటకములోఁ బేర్కొన్న "ప్రతిమాగతో మహారాజః" అన్నవాక్యము భాసునిప్రతిమానాటకమును సూచించుట చేతను, వామనుఁడు "కావ్యాలంకారసూత్రవృత్తి"లో వ్యాజోక్తి కుదాహరణ

ముగాఁ బేర్కొన్న "శ్లో. శరచ్చంద్రసుగౌరేణ..." అన్న శ్లోకము స్వప్నవాసదత్తములో (నాల్గవయంకము మూఁడవ శ్లోకము) నుండుటచేతను; భాసుఁడంతకుఁ బూర్వుఁ డనఁగా క్రి. పూ. ౫, ౪ శతాబ్దికిఁ జెందినాఁ డనవలయును.

కాళిదాసు మాళవికాగ్నిమిత్రములో భాసునిఁ బేర్కొనుటచేతను, శూద్రకునిమృచ్ఛకటికమునకు భాసునిచారుదత్తమునకు మిక్కిలి పోలిక లుండుటచేతను, భాసుఁడు క్రీ. పూ. ౫, ౪ వ శతాబ్దికిఁ జెందినాఁ డనవలయును.

కౌటిల్యుఁడు తనయర్థశాస్త్రములో (X.3) రెండు శ్లోకము లుదాహరించినాఁడు. అవి యెందుండి సంగృహీతములో యాతఁడు పేర్కొన లేదు. కాని యిందలిరెండవశ్లోకము ప్రతిజ్ఞాయౌగంధరాయణము (iv అంకము 2 శ్లో)లో నుండుటచే భాసుఁడు కౌటిల్యునకుఁ బూర్వుఁడు. అనఁగా క్రీ. పూ. ౫, ౪ శతాబ్దప్రాంతమువాఁడు కావలయును.

పైకారణము లన్నిటిచేతను భాసుఁడు క్రీ. పూ. ౫ లేక ౪. శతాబ్దమువాఁడని యనుట యుక్తము.

## భాసుఁ డెవఁడు?

ఈనాటకములంబట్టి భాసుఁ డొకసద్బ్రాహ్మణుఁ డనియు, వర్ణాశ్రమధర్మవ్యవస్థాదులయందు యజ్ఞయాగప్రార్థనాదులందు, గోబ్రాహ్మణాదులయందు నాతఁడు శ్రద్ధాభక్తులు కలవాఁడనియు, నీతనికిఁ గలరాజప్రాసాదాంతఃపురాద్యమితవిజ్ఞానమును బట్టి యాతఁ డొక మహారాజాస్థాన

కవియై యుండవలయు ననియు, పాంచరాత్రతత్త్వజ్ఞుఁడు, భక్తిమార్గభగవదారాధకుఁ డనియు, మఱియు నీతఁడు బహుశాస్త్రవేత్త, బహుధర్మమర్మజ్ఞుఁడు, బహువిజ్ఞుఁడు నని విమర్శకు లభిప్రాయపడియున్నారు.

### భాసకృతులు:

పూర్వోదాహృతము లైనపదుమూఁడునాటకములే కాక శ్రీరామవివాహాంతమువఱకుఁ గలరామకథావస్తుక మగు "యజ్ఞఫల" మనునాటకము నీతఁడే రచించె నని విమర్శకు లభిప్రాయపడిరి. ఇదికాక భాసుఁడు "నాట్యశాస్త్ర" మను శాస్త్రగ్రంథమును వ్రాసె నని "అర్థద్యోతనిక" యను శాకుంతలవ్యాఖ్యలోఁ జేర్కొనఁబడినది. మఱియు భాసుఁడు ముప్పదిగ్రంథములవఱకు వ్రాసె నని యొకఁడు నిరువదిమూఁడు గ్రంథములు వ్రాసె నని యింకొకరును జేర్కొనియున్నారు.

### సంస్కృతనాటకోత్పత్తి

భరతముని నాట్యశాస్త్రమున నిట్లు గలదు: పూర్వ మింద్రాదిదేవతలు బ్రహ్మను సమీపించి "మహాత్మా! వేదపఠనాధికారము లేనిస్త్రీశూద్రాదులకు వేదవిహిత ధర్మము లతిసులభముగా నవగాహన మగుటకు నాట్యవేదమును సృష్టింపు" మని కోరిరి. బ్రహ్మ వారికోరిక మన్నించి చతుర్వేదసార మగునట్లుగా ఋగ్వేదమునందలి సంభాషణాదికము, యజుర్వేదమందలి యభినయాదికము, సామవేదమందలి గానము, అథర్వవేదమందలి రసాదికము గ్రహించి నాట్య

వేదమును సృష్టించెను. గంధర్వులు నప్సరసలు మొదటి నాటక మింద్రోత్సవసమయమున నాడిరి.

మఱియు వేదములందును బ్రాహ్మణములందును నాటకసూచనములు మెండుగాఁ గలవు. శిలాలికృశాశ్వుల 'నటసూత్రములను పాణినియు; పరిపూర్ణము లగునాటకము లను పతంజలియుఁ బేర్కొనియున్నారు. యథోచిత రస మూలమునఁ బ్రేక్షకులమనములలో నుత్తమాదర్శములు నీతులు హత్తుకొనఁ జేయుటయుఁ దనమూలమున వారి కవిర శానంద మొనగూర్చుటయును భారతీయ నాటకాదర్శములు.

సంస్కృతనాటకభేదములు

కావ్యము దృశ్య మనియు శ్రవ్య మనియు రెండువిధ ములు. అందు దృశ్యకావ్యములకే రూపకము లనిపేరు. అభి వ్యంజక మగు రసమునుబట్టి రూపకములు :

శ్లో. "నాటకం స ప్రకరణం భాణం ప్రహసనం డిమః,
వ్యాయోగ సమవకారౌ వీథ్యంకేహామృగా ఇతి."

అని దశరూపకము. ఇందు మొదట నేకపాత్రాభియుక్త మగుభాణము తరువాత నతిశయపాత్రరసాదులతో వీథి, పిమ్మట హాస్యరసప్రధాన మగు ప్రహసనము, పిదప స్త్రీపాత్ర రహితమును దశసంఖ్యాపర్యంతము వీరులు గల వ్యాయో గము, తరువాత స్త్రీపాత్రాదులతో విషాదసంఘటనలతో అంకము, వచ్చినవి. ఈయైదు తెఱఁగులు నేకాంకికలు. ఏక దినపర్యంతకాలమునే యివి సూచించును. ఇందు ముఖ నిర్వహణసంధులుమాత్రమే యుండును.

ఆపిమ్మట చతురంకపరిమితము త్రిసంధియుతము, నాలుగైదుదినముల కాలమును దెలుపుఈహామృగము వచ్చినది. ఆతరువాత నాలుగంకములు నాలుగుసంధులు, శృంగారహాస్యములుతప్ప మిగిలినరసములు గల డిమము వచ్చినది. డిమసమానమై శృంగారరసముకూడఁ గలిగి పిదప సమవకారము వచ్చినది. తరువాత నాలుగంకములు, నాలుగంగములు కలిగి శృంగారరస ప్రవిష్టమై నాటిక వచ్చినది. ఆపిమ్మటఁ బంచాంగనవరసభరితమై నాటకము వచ్చినది. కథావస్తువు కల్పితమయి వణిక్కు, మంత్రి, బ్రాహ్మణుఁడు వీనిలో నొకనిజీవితగాథఁ దెలుపుచుఁ బ్రకరణమును వెలసినది.

పై విభజనము ననుసరించి భాసనాటకములలో:

నాటకములు:—అభిషేకము, బాలచరితము, అవిమారకము, స్వప్నవాసవదత్తము. ప్రతిమ.

ప్రకరణము:—చారుదత్తము.

సమవకారము:—పాంచరాత్రము.

ఈహామృగము:—ప్రతిజ్ఞాయౌగంధరాయణము.

అంకములు :—కర్ణభారము, దూతఘటోత్కచము ఊరుభంగము.

వ్యాయోగము:— మధ్యమవ్యాయోగము.

వీథి:—దూతవాక్యము.

అని విభజింపవచ్చును.

## అభిషేకమున సంధ్యవస్థలు

రూపకములందలి వివిధభేదములు వస్తునాయకరసముల ననుసరించి యుండును. అందు వస్తువు ఆధికారిక మని ప్రాసంగికమని రెండువిధములు. అభిషేకనాటకములో సీతారాములకథ ఆధికారికము; సుగ్రీవవిభీషణులకథ ప్రాసంగికము.

మఱియొకవిభజన ననుసరించి వస్తువు ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రమము అని మూఁడువిధములు. పురాణేతిహాససంబంధమైనది ప్రఖ్యాతము. అభిషేకనాటకవస్తు విట్టిది. స్వకపోలకల్పిత ముత్పాద్యము. ఉదా:- మాలతీ మాధవము. పై రెండును గలిసినది మిశ్రము, ఉదా:- శాకుంతలము, ప్రతిమా నాటకము.

ప్రతినాటకమునకు ముఖ, ప్రతిముఖ, గర్భ, విమర్శ, ఉపసంహృతు లను పంచసంధు లుండును. ఇవి కాక బీజ, బిందు, పతాక, ప్రకరి, కార్యము లని యైదు అర్థప్రకృతు లుండును. మఱియు వస్తువృద్ధి కైదవస్థలుండును. ఆరంభము, యత్నము, ప్రాప్త్యాశ, నియతాప్తి, ఫలాగమము ననునైదు నివి.

అభిషేక నాటకములో రామసుగ్రీవులు పరస్పర సహాయప్రతిజ్ఞ చేసికొనుట ఆరంభావస్థ. సుగ్రీవుఁడు సీతాన్వేషణమునకై వానరుల నంపుట యత్నము. రాముఁడు సీతను మరల సంపాదించుట ప్రాప్త్యాశ. హనుమంతుఁడు లంక కేఁగి సీతావృత్తాంతశుభవార్తను గొని తెచ్చుట నియ

తాప్తి. రావణమృతి, సీతాపరిగ్రహణము ననునది ఫల ప్రాప్తి.

ఇదేవిధమునఁ దొలియంకములోని రామునిసీతాపరి దేవనము ముఖసంధి. ద్వితీయాంకమున రావణుఁడు సీతను లోభపెట్టఁజూచుట బెదరించుట ప్రతిముఖసంధి. తృతీయాంకమున సీతాన్వేషణము గర్భసంధి, షష్ఠాంకమున "శరముల బల్మిచే నిపుడె చంపితి యుద్ధమునందు రావణున్" అనునది విమర్శసంధి. తుదకు సీతను రాముఁడు మరలఁ బరిగ్రహించుట ఉపసంహృతి యగును.

నాయకుఁడు

నాయకుని సర్వసామాన్యలక్షణము లివి:

శ్లో॥ "నేతా వినీతో మధుర స్త్యాగీ దక్షః ప్రియంవదః,
రక్తలోకః శుచి ర్వాగ్మీ రూఢవంశః స్థిరో యువా
బుద్ధ్యుత్సాహ స్మృతిప్రజ్ఞా కలామానసమన్వితః
శూరో దృఢశ్చ తేజస్వీ శాస్త్రచక్షుశ్చ ధార్మికః."

(దశరూపకము. II. ౧. ౨.)

మఱియు నాయకుఁడు ధీరలలితుఁ డనియు ధీరోదాత్తుఁ డనియు ధీరోద్ధతుఁ డనియు నలుతెఱఁగులు. రాజ్యభార మంతయు మంత్రులపై నిడి తాను విలాసవిహారముల నుండు రాజు ధీరలలితుఁడు. విప్రవణిక్సచివులు నాయకులైనచో వారు ధీరశాంతులు. ఇఁక, ధీరోదాత్తుని లక్షణము లివి:

శ్లో॥ "మహా సత్త్వోతిగంభీరః క్షమావా నవికత్థనః,
స్థిరో నిగూఢాహంకారః ధీరోదాత్తో దృఢవ్రతః."

అభిషేకనాటకమందలి శ్రీరాముఁడు ధీరోద్ధతనాయకుఁడు. ధీరోద్ధత నాయకునిలక్షణము లివి :

శ్లో "దర్పమాత్సర్య భూయిష్ఠో మాయాచ్ఛద్మపరాయణః
ధీరోద్ధత స్త్వహంకారీ చలశ్చండో వికత్థనః"

అభిషేకనాకటమందలి ప్రతినాయకుఁడగు రావణుఁ డిట్టి వాఁడు.

### అభిషేకము : రసము

అభిషేకనాటకమందలి ప్రధానరసము వీరము. దీని లక్షణము లివి :

శ్లో॥ "వీరః ప్రతాపవినయాధ్యవసాయసత్త్వ
మోహావిషాదనయవిస్మయవిక్రమాద్యైః,
ఉత్సాహభూః స చ దయారణదానయోగా
త్త్రిధా కలాత్ర మతిగర్వధృతిప్రహర్షః."

వీరరసప్రవిష్టు లగునాయకులు దానవీరులు దయావీరులు యుద్ధవీరులు నని ముత్తెఱఁగులు. జీమూతవాహనాదులు దానవీరులు, పరశురామాదులు దయావీరులు, శ్రీరామాదులు యుద్ధవీరులు. ఈయభిషేకనాటకమున వీరము ప్రధానరసము. ఇంద్రజిన్మరణముపట్ల రావణదుఃఖము మున్నగుతావులఁ గరుణము; వరుణాగ్నుల సందర్శనము సీతయగ్నిప్రవేశము మున్నగుతావుల నద్భుతరసము; ఇంద్రజిన్మరణానంతరఘట్టముల భయానకము; సీతారాముల ప్రేమమున ధర్మశృంగారము; సీతపాతివ్రత్యము నెఱిఁగినరామునిపట్ల, విద్యాధరులు రామునిఁ గీర్తించునపు డాతనియెడ శాంత

రసము; రావణుని కకుత్థకుమారేంద్రజిత్తులపైఁ గలిగినవిచార మున వాత్సల్యరసము యథోచితముగాఁ బ్రదర్శితము లయి యున్నవి.

వ ర్ణ న ము లు

అభిషేకనాటకమునఁ గల ప్రధానవర్ణనములలో ముఖ్యములు: సూర్యాస్తమయవర్ణనము (iv 23) సముద్ర వర్ణనము (iv 3; iv 17.) యుద్ధవర్ణనము (vi 1; vi 18) లంకావర్ణనము (ii 3; ii 5) చంద్రవరన్ణము (ii 11) ప్రమద వనవరన్ణము (ii 4) మున్నగునవి.

అ లం కా ర ము లు

అభిషేకనాటకములో పూర్ణోపమ (vi 4) ఉపమా రూపకములు (vi 3) రూపకము (vi 18)స్వభావోక్తి (ii 21) ఉల్లేఖాలంకారము (i 25) ముఖ్యములు.

సు భా షి త ము లు

అభిషేకనాటకములోఁ గల సుభాషితము లొకటి రెండుమాత్ర మిట సూచితములు :

గీ. విజయసంపాదనమొ లేక వీరమృతియొ
రణతలంబున సిద్ధంబు రాజులకును. (iii 9)

క. "వరబలసింహాం బకటా
హారిణార్భకవలనఁ జచ్చునా ? ఘనమదసిం
ధురరాజము చనిపోవునె
పరమనికృష్టంపునక్కవలనన్ జెపుమా ! (iii 20)

అభిషేకము : ఇతరనాటకములతోఁ బోలికలు :

అభిషేకనాటకమునకు నాశ్చర్యచూడామణీనాటకమునకుఁ గలసాదృశ్యము లిదివఱకే చూపఁబడినవి.

కాళిదాసునియభిజ్ఞాన శాకుంతలమునఁ జతుర్థాంకమునఁ గల "పాతుం న ప్రథమం" అనుశ్లోకమునకు, అభిషేకమున నాలుగవయంకమునఁ గల "యస్యాస్సప్రియపత్నీ" అను శ్లోకమునకు భావసామ్యమే కాక "ప్రియమండనాసి, స్నేహాత్, పల్లవాన్, సేయమ్" అనుపదములు రెండుశ్లోకముల నుండుట గమనింపఁదగినది.

భవభూతి "ఉత్తరరామచరిత్రము"న షష్ఠాంకమునఁ గలవిద్యాధరత్రయ సంభాషణము అభిషేకనాటకమున షష్ఠాంకమునఁ గల విద్యాధరత్రయ సంభాషణము నుండుట గమనార్హము.

అ భి షే క నా ట క ము

(అంత శంకుకర్ణుఁడు ప్రవేశించును)

శంకు :—ఏమిది? కాంచనతోరణద్వారము శూన్యమైయున్నదేమి?

ప్రతిహారి:— (ప్రవేశించి) ఆర్యా! నేను విజయనున్నాను. ఏ మానతి?

శంకు:—విజయా! నివేదింపుము. నివేదింపుము.

(3 అంకము)

స్వప్నవాసవదత్తము

(అంత కాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచు:—ఎవరక్కడ? కాంచనతోరణద్వారము శూన్యమై యున్నదేమి?

ప్రతిహారి:—(ప్రవేశించి) ఆర్యా! నేను విజయ నున్నాను. ఏమాజ్ఞ?

కాంచు:—విజయా! నివేదింపుము. నివేదింపుము...

(౬ అంకము)

అ భి షే క ము

వాలి:— (ఆచమించి) నే నిక్కడఁ బ్రాణములు విడుచుచున్నాను. అదిగో! గంగాప్రభృతిమహానదులు...

(చనిపోవును) (౧ అంకము)

ఊ రు భం గ ము

రాజు:—నే నిదే ప్రాణములు విడుచుచున్నాను. అదిగో! ఊర్వశ్యాద్యప్సరసలు ... గంగాప్రభృతిమహా నదులు ... (చనిపోవును)

అ భి షే క ము

"శ్లో. హా! వత్స! సర్వజగతాం..."(౫ అం. ౧౩ శ్లో.)

ప్ర తి మ

"శ్లో. హా! వత్స! రామ! జగతాం..."(౨ అం. ౪ శ్లో.)

ఈశ్లోక మించుమించుగా రెండునాటకములందును సమమే. మఱియు "ధర్మస్నేహాంతరేన్యస్తా..." అనుఅభిషేకషష్ఠాంక

స్థితశ్లోకభాగము ప్రతిమానాటకమున యథాతథముగనే యున్నది. ఇట్లే యభిషేకనాటకమునకు నితరనాటకములకు సాదృశ్యము లెన్నియో కలవు.

సంస్కృత నాటకాంధ్రానువాదోత్పత్తి

తెనుఁగునాటఁ బూర్వము దేశిపద్ధతిని రచితములైన పౌరాణికనాటకములు, యక్షగానాదులే కాని సంస్కృత నాటకాంధ్రానువాదములు బయలు వెడలుటయు నవి రంగ స్థలములఁ బ్రదర్శితము లగుటయు బొత్తిగా లేవు. మొట్ట మొదట సంస్కృతనాటకములను గొందఱు తెలుఁగుకవులు కావ్యఫక్కిని స్వతంత్రపద్ధతి ననువదించిరి. అందు రాజశేఖర కృతవిద్ధసాలభంజికానువాద మనఁదగు కేయూరబాహుచరి త్రము క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమున మంచన మహాకవి రచించెను. ౧౫ శతాబ్దిప్రాంతమువాఁ డయిన పిల్లలమఱ్ఱి పినవీరన శృంగారశాకుంతలమును విరచించెను. మఱియు నందిమల్లనఘంటసింగన్నలు కృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రో దయ' నాటకము నిట్లే రచించిరి. ఆపిమ్మటఁ జాలకాలము నకు సంస్కృతశ్లోకమునకుఁ దెలుఁగుపద్యములును సంస్కృత ప్రాకృతవచనములకుఁ దెలుఁగువచనమును వ్రాయుచు కీ॥ శే॥ కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు "నరకాసురవ్యాయో గము" ననువదించిరి. పిమ్మట ౧౯ వ శతాబ్దాంతమున కీ॥ శే॥ కోరాడ రామచంద్రశాస్త్రిగారు మొట్టమొదటఁ బైపద్ధతినే వేణీసంహార సంస్కృతనాటకము నాంధ్రీకరించి

రఁట. కాని యది నేఁటికిని ప్రకటితము కాకపోవుట చింతింపఁ దగినవిషయము. ఆతరువాత నిరువదవశతాబ్దమున సంస్కృత నాటకముల సుప్రసిద్ధములైనవానిని బలువురు తెలుఁగుకవు లనువదించిరి. క్రమక్రమముగా నొకేనాటకమును బలువురు కవు లనువదించుటయు 'ముఖే ముఖే సరస్వతీ' యన్నట్లవి యన్నియు నొక్కొక్కదృష్టిలో బాగుగా నుండుటయు సంభవించినది. కాళిదాసునియభిజ్ఞాన శాకుంతలాదుల కాంధ్రమున నెన్నియనువాదములో వెలసినవి. ఇట్లే మఱి పెక్కు నాటకములకు లెక్కకు మిక్కిలిగా ననువాదములు వెలువడుటయుఁ బూర్వు లనువదించినవి మరల ననువదించుట పిష్టపేషణమే యగుననుదృష్టితో సామాన్య సంస్కృతకవుల నాటకములుసైతము కొందఱనువదించుటయు నేఁడు జరగుచున్నది. విశ్వవిద్యాలయములలోఁ బాఠ్యగ్రంథములుగా ననువాదనాటకములే నిర్ణీతములగుచుండుట నేఁటికాలమున సైత మాంధ్రీకృతములు వెలువడుటకుఁ బ్రధానకారణ మనవచ్చును.

### అభిషేకము : ఆంధ్రానువాదములు

ఈ భాసనాటకములు పసుమూఁడును దొలుదొలుత శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాశాఖకుఁ జెందిన బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి ఎం. ఏ; గా రనువదించినట్లు వారు ప్రకటించిన "అవిమారక" పీఠికలోఁ గలదు. కాని, వా

రనువదించిన పదుమూఁడునాటకములు ప్రకటితములైనట్లు తోఁచదు. వారి 'యభిషేకనాటకాంధ్రీకరణము' లభింప లేదు. ఆ పిమ్మట కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగా రీనాటకము లన్నిటి ననువదించిరి. కాని, వారిసంపూర్ణ గ్రంథములలో నాటకభాగమున నభిషేకనాటకముమాత్ర మేలొకో చేరలేదు. నాకంటెముందు శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు నభిషేకనాటక మనువదించి ముద్రించిరి.

నేఁటి సంస్కృతనాటకాంధ్రీకరణములు సారస్వత ప్రియులకుఁ దక్క నొరుల కంగీకృతములు కావు. రంగస్థల ములఁ బ్రదర్శించి సభాసదులను రంజింపఁజేయుట కీనాటక ములు వచ్చినవి. ఇఁక విశ్వవిద్యాలయాధికారులు పాఠ్య గ్రంథములుగ నిర్ణయింపకున్న నీసంస్కృతనాట కాంధ్రానువాదవాఙ్మయము నశింపవలసినదే యనుట కెట్టిసందియ మును లేదు. పదికాలములపాటు విశ్వవిద్యాలయాధికారు లనువాదనాటకముల నిట్లు ప్రోత్సహించుచు నీవాఙ్మయశాఖ నశింపకుండఁ గాపాడుచుందురుగాక !

---

# యజ్ఞఫలనాటకము

భాసమహాకవి ఇరువదిమూఁడు నాటకములకుఁ దక్కువ కాకుండ వ్రాసియుండవలయు ననియు, 'కిరణావళి' 'ముకుటతాడితకము' 'ఉదాత్తరాఘవము' మున్నగునామములు గలభాసనాటకము లింకను మనకు లభింపవలసియున్నవనియు శ్రీ ఆర్. వి. కృష్ణమాచారిగారు తమ ప్రియదర్శికా భూమికలో వ్రాసియున్నారు.* ఇట్లే భాసుఁడు ముప్పదినాటకములవఱకు వ్రాసియుండవలయు నని మఱి యిద్దఱు విమర్శకులు పేర్కొనియుండిరి. ఏది యెట్లున్నను, అలంకార గ్రంథములలో నుదాహృతములైన శ్లోకములు కొన్ని ప్రస్తుతము భాసనాటకములుగాఁ బరిగణించు పదుమూఁడు నాటకములలోను గానరాకపోవుటవలన భాసుఁ డింకను గొన్నినాటకములు వ్రాసియుండవలయు ననియుఁ గాలగర్భమున నవి లీనమై యుండుననియు ననుకొనుటకు వీలుచిక్కుచున్నది. ఈ యవకాశమును బురస్కరించుకొని యిటీవల వెలువడిన "యజ్ఞఫల" మను సంస్కృతనాటకము భాసమహాకవి రచించి యుండిననాటకములలో నొకటి యని తెలియుచున్నది.

---

* ప్రియదర్శికా భూమిక. పుట. XXXIII. వి. వి. ప్రెస్సు, శ్రీరంగము. 1909 సంవత్సరమున ముద్రితమైన ప్రతి.

### యజ్ఞఫలము : గ్రంథస్వరూపము

కథియవాడు రాష్ట్రమునకుఁ జెందిన గోండలు నగరమునుండి రాజవైద్య జీవరామ కాళిదాసశాస్త్రిగారు 'యజ్ఞఫల' మను నాటకమునకు సుమారు మూఁడువందల సంవత్సరములకు వెనుకటివైన రెండు ప్రాచీనపు వ్రాఁతప్రతులను సంపాదించిరి. వాని ననుసరించి 'యజ్ఞఫలము'ను ప్రకటించి తమయుపోద్ఘాతములో "అతిప్రాచీనసంస్కృతభాష ననుసరించియు, వస్తుకల్పనమునఁ గల శ్రేష్ఠతనుబట్టియు, రసభావాలంకార నాట్యాంగమనోహరత్వమును బురస్కరించుకొనియు భాసనాటక సామాన్యలక్షణము లని బాణాదులు పేర్కొన్న యనేకవిషయముల కీనాటకము నిధానమగుటంబట్టియు నిది తప్పక భాసనాటకములలో నొకటి యని నా దృఢవిశ్వాసము" అని వారు పేర్కొనియున్నారు. ఆ పిమ్మట, వెనుకటి పదుమూఁడు నాటకములు భాసునివి 'కా' వని కొందఱు 'ఔ' నని కొందఱు వాదించుచు వచ్చుచున్నట్లే 'యజ్ఞఫలము' కూడ భాసునిదే యని కొందఱు కా దని కొందఱు పత్రికలలో తర్జనభర్జనలు కావించియున్నారు.†

ఈ పరిస్థితిలో బొంబాయి భారతీయవిద్యాభవన స్తంభములలో నొక రనఁదగిన డాక్టరు ఏ. డి. పుసల్కరు

† శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాసంస్థ పత్రిక. సంపుటము 11 సంచిక 2. జూలై-డిసెంబరు 1941 పుట. 478. Quarterly Journal of the Mythic Society. సం. XXXII. సంచిక 4. పుట 441. Hindu Literary Supplement 15—2—1942.

ఎం. ఏ ; పి. హెచ్. డి ; బెంగుళూరు సంస్కృత సారస్వత సమితికిఁ బ్రాణ మనఁదగిన శ్రీ ప్రొఫెసరు యస్. యన్. సింహా ఎం. ఏ, మున్నగువారు సునిశితవిమర్శన మొనరించి యుక్తియుక్తముగా 'యజ్ఞఫలము' భాసకృతమే యనుటకు సంశయింపఁ బని లేదని తమ గ్రంథములలోఁ దెలిపి యున్నారు.‡ వారు చూపిన హేతువాదమును బరిశీలించుటకుఁ బూర్వము స్థాలీపులాకన్యాయమున యజ్ఞఫలనామౌచిత్యము, నాటకకథావిధానము తెలిసికొనుట యత్యావశ్యకము. వీనివలననే కొంతకుఁ గొంతయైనను ఈ నాటకము భాసమహాకవి కృతమే యని తెలియకమానదు.

## నా మౌ చి త్య ము

ఈనాటకమున 'యజ్ఞఫల' మనుమాట ఐదాఱు పర్యాయములు వచ్చుటయే కాక. దశరథునియజ్ఞఫలముగా శ్రీరామావతారము విశ్వామిత్రుని యజ్ఞఫలముగా శ్రీరామాస్త్రపరిగ్రహణము, జనకుని యజ్ఞఫలముగా శ్రీసీతారామకల్యాణము ఈ నాటకమున వస్తువులగుట ఈ నాటకమున కీనామము చాల నుచితముగా నున్నది. సుగ్రీవ విభీషణ రామపట్టాభిషేకములు కథావస్తువులుగాఁ గల నాటకమునకు "అభిషేకనాటక" మని పేరిడిన భాసుఁడు 'యజ్ఞఫల'

‡ 1. Bhasa. by Dr. A. D. Pusalker పుట 135-142.

2. Pancharatra. Edited and Published by S. N. Simha, M. A. Bangalore.

మను నామ మీ నాటకమున కిడియుండుట చాల సమంజస
మని తోఁపకమానదు.

కథావస్తువు - ప్రథమాంకము

ఇందు దశరథుని యజ్ఞఫలముగా రామాదు లవత
రించుటయు, వారిబాల్యము కడచుచుండుటయు, వారిజన్మ
దినోత్సవము దశరథమహారాజు జరపుచుండుటయు, దశర
థుని హృదయ మెఱిఁగి సుమంత్రుఁడు రాజ్యమునఁ గల
సర్వప్రజలను వాంఛితార్థములచే సంతోషపెట్టుటయు,
అటుపిమ్మట కారాగృహబద్ధుల నెల్లర విడిచిపుచ్చు
మనియు సర్వజనులను సర్వదానసత్కారములచే సంతోష
పెట్టు మనియు రాజాజ్ఞ యగుట కంచుకి తెలుప సుమంత్రుఁ
డప్పటి కప్పుడే యాపని యొనరించియుంటినని తెలుపుట,
రాజు తనపైఁబడ్డ గురుతరబాధ్యతలకు, పుత్త్రుల నెట్లు
శస్త్రాస్త్ర సర్వవిద్యాపారంగతులఁ గావింపఁగలుగుదునో
యనియు బెంగపెట్టుకొనుట, వసిష్ఠమహర్షికి విద్యార్థులనుగా
వారి నొప్పగించుట, రాజు సుమంత్రునితోఁ దన గురుతర
బాధ్యతలను గూర్చియు రామపట్టాభిషేక ప్రతిబంధక మగు
కైక వరమును గూర్చియు ముచ్చటించుట, ఇంతలో
రాణులు ముప్వురు నెవరికి వారే ముందు తమకు దర్శన
మిప్పింపు మని రాజునకు విన్నపము లంపుకొనుట, రాజు
ముప్వురను సమముగా గౌరవింతునని ప్రతివచన మిచ్చి
గ్రీష్మోద్యానమునకు రమ్మని వార్తలంపుట, ఇంతలో సూర్యా

స్తమయమగుట, రాజు విదూషకునితో వెడలుటయు జరుగును. ఈ యంకము మొదటనే విదూషక కాంచుకీయ సంభాషణము భాసుని హాస్యరచనా చమత్కృతులకు నిదర్శనముగా వెలయుచున్నది.

## ద్వి తీ యాం క ము

ఇందు రాజు పరివారముతో గ్రీష్మోద్యానమునఁ బ్రవేశించుట, సుమంత్రుని బిలిచి రాముని యౌవరాజ్యాభిషేకమున కనుకూలముగా సర్వజనులను రామమానసులనుగను భరతుని రామభక్తునిగను జేయుచుండు మనుట, ఇంతలో రాణులు రాఁగా సుమంత్రుఁడు వెడలిపోవుట, రాజు రాణులతోడి సంభాషణమున అభిషేకప్రశంస తెచ్చుట, దాయభాగవిచారము, సుమిత్ర రామభక్తి, కైకేయి సౌశీల్యముతో రామునికే రాజ్యమీఁ దగుననుట, కౌసల్యా రామానురక్తి, సుమిత్రాకైకేయీసౌశీల్య ప్రదర్శనము, దశరథుఁ డమితానంద మందుట, రాణులనిష్క్రమణము, దశరథుఁడు సుమంత్రుని బిలిచి వసిష్ఠాదేశప్రకారము తన పుత్త్రులను రాజనీతి శాసనవిధాతలఁ జేసి యనుగ్రహింపుఁడని విన్నపమంపుట, ఇంతలో రామకీర్తి విని రావణుఁ డయోధ్యానగరమున నవిష్ట మాచరింపఁ దిరోహితుఁడై తిరుగుచుండె నన్న వార్త విని రాజు ప్రతీకారచర్యలఁ గైకొనఁ బోవుట జరుగును.

## తృ తీ యాం క ము

ఈ యంకమున విష్కంభములో నింద్రుఁ డిరువురు గంధర్వులను రావణునివలన రామున కేయపాయము కలుగ కుండునట్లు చూచుటకుఁ బంపుట తెలియనగును. తరువాత రావణ విశ్వామిత్రులు మాయారూపులై తిరోహితులుగ వచ్చుట వారొకరినొకరు కనుఁగొనఁగలిగియు నితరుల కగ పడకుండుటయు రావణుఁడు రాము నెత్తుకొనిపోవుటకు, విశ్వా మిత్రుఁ డాతనిని శిష్యునిగాఁ గైకొని దివ్యాస్త్రముల నుప దేశింపఁ గైకొనిపోవుటకు వచ్చినట్లు తెలియును. ఇంతలో రాజకుమారులతో వసిష్ఠుఁ డరుదెంచి నాఁడనధ్యాయమగుట రాజకుమారులను వారివారి ధనుర్విద్యాకౌశలముఁ బరీక్షించు కొన ననుమతించి వెడలిపోవుట, కొంత దవ్వేఁగి రాజకుమారు లలో భరత లక్ష్మణ శత్రుఘ్నులు తమతమ ధనుర్విద్యా నిపుణతఁ జూపుట, వారు రాముని విద్యానిపుణతఁ జూప బలవంతపెట్టుట, రాముఁడు రెండుసారులు బాణములు విడు చుట, వానిని దారిలో మాయాశరీరులై యున్న రావణవిశ్వా మిత్రులు త్రుంచివేయుట, రాముఁడు కోపించి యాగ్నేయా స్త్రము ననుసంధించుట, రావణుఁ డది చూచి భీతుఁడై పాఱిపోవుట, ఆతఁ డేమకర్మమును జేయకుండునట్లు చూచు టకు విశ్వామిత్రుఁ డాతని ననుసరించిపోవుట, ఇంతలో రాణుల చెలికత్తెలు దూరమునఁ గనఁబడ వారికిఁ దగులు నను భీతిచే రాముఁడు బాణము విడువకుండుట, రావణుని

రథపు గుఱ్ఱములు కాంచి చెలికత్తెలు భీతావహాత్తై పాఱిపోవుట రాముఁడు బాణము విడువఁజూచుచుండ వసిష్ఠమహర్షి యే తెంచి వారికి రావణ విశ్వామిత్రుల యాగమన విశేషములం జెప్పి నుఱునాఁడు విశ్వామిత్రుఁ డటకు రానున్నాఁ డనియు వచ్చినపుడు నమస్కారపురస్సరముగా గౌరవింపుఁ డనియుఁ జెప్పి వెడలుట, రాజకుమారు లింటి కేఁగుట, మంథర దుర్మం త్రణము, సుమంత్రుఁడు వచ్చి రావణ విశ్వామిత్రాగమన వార్త విని కావలివారలను హెచ్చరింప నేఁగుట జరుగును.

## చతుర్థాంకము

ఈ యంకమునకుఁ దొలుత నలువురు కావలివారిహాస్య సంభాషణము, విదూషకుని రాకతో నది యధికమగుట, విశ్వామిత్రునిగుఱించి వారు వికటముగాఁ జెప్పుకొనుట జరు గును. పిదప విశ్వామిత్రుఁడు దశరథుని కొలువుకూటమున కే తెంచి గౌరవింపఁబడి రాజకుమారులను వసిష్ఠు ననుమతిఁ బరీక్షించుట, పరీక్షాసమయమున రాజకుమారులకు జృంభ కాస్త్ర బ్రహ్మాస్త్రములు తెలియవని తెలిసికొని రాక్షసవధ నిమిత్తము రాముని దనతోఁ బంపుమని దశరథు నడుగుట, దశరథుని సంకోచము, వసిష్ఠు ననుమతిని దశరథుఁడు తన పుత్రులు త్వరలో దివ్యాస్త్రవిత్తులై తిరిగి తన కడకు వచ్చెదరని విశ్వామిత్రుఁడు మాట నొసఁగ నాతనితోఁ దన పుత్త్రులను బంప నిచ్చగించుట, విశ్వామిత్రుఁడు రామలక్ష్మ

ణులను మఱునాఁడుదయము తనయాశ్రమమునకుఁ దీసికొని పోనిర్ణయించుకొని విశ్రమించుట జరుగును.

పంచమాంకము

ఇందలి విష్కంభమునలన రామలక్ష్మణ సాహాయ్యమున విశ్వామిత్రునియజ్ఞము పూర్తియగుట, మారీచసుబాహుల పతనమువలన నారణ్యజనులు సుఖించుటయుఁ దెలియును. అంత రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁ డరుదెంచి రాముని గొనియాడుట, రామలక్ష్మణుల వినయప్రదర్శనము, రామరావణాభవిష్యద్యుద్ధమున రామవిజయము విశ్వామిత్రుఁడు సూచించుట, రామలక్ష్మణు లారణ్యప్రకృతిరామణీయకమునకు సమ్మోహితులగుట, విశ్వామిత్రుఁడు వారికి గ్రామజీవనసౌభాగ్యముఁ జూపుట. రామలక్ష్మణులు వృద్ధగోపాలస్త్రీతో సంభాషించి గ్రామజీవనాకృత్రిమత, గ్రామజనపవిత్రతఁ దెలిసికొనుట, విశ్వామిత్రాదేశమున జనకుని యజ్ఞమునకు విశ్వామిత్రునితో రామలక్ష్మణు లేఁగుట కంగీకరించుట యిందుఁ గలవు.

షష్ఠాంకము

విష్కంభమున విశ్వామిత్రపరిచర్యకు నియుక్తులైన ముగ్గురుభటులు తమ సంభాషణలో రామలక్ష్మణుల సౌందర్యవర్ణనము, రాము నుద్యానమున నొంటరిగాఁ జూచినసీత యాతనిం బ్రేమించుటయు, రాముఁడు సీతపై మక్కువగొనుటయు మనకుఁ దెలుపుదురు. పిదప, ప్రేమావేశచిత్తుఁ డగు

రాముఁడు ప్రవేశించి సీతాసక్తమనస్సును నిగ్రహించుకొన యత్నించుట, ఇంతలో సీత చెలికత్తెలతో మరలఁ గానన గుట, సీత చెలికత్తెల సంభాషణమున సీత రామపరవశయై యున్నదని రాముఁడు గ్రహించి సంతసించుట, సీత మూర్ఛ పోఁగా రాముఁడు సమీపించుట, చెలికత్తె లానందించి సీతను దేర్చుట, సీతను బెండ్లాడ గోరువాఁడు శివధనుర్భం గము గావింపవలెనన్న జనకుని శపథము విషయము, రాముఁ డందులకు సమర్థుఁడే యని చెలికత్తె తెలుపుట, ఇంతలో జనకమహారాజే తెంచుట యెఱిఁగి రాముఁడు నిష్క్రమిం చుట, నిర్లిప్తుఁ డగుజనకమహర్షి సీతతో మాటాడుట, ఆమెకు జరుగఁబోవువివాహముసంగతి తెల్పి విశ్వామిత్రుని గౌరవింప నేఁగుట యిందుఁ గలవు.

సప్తమాంకము

నిర్వహణాంక మను పేరుగల యేడవ యంకమునే జనకచక్రవర్తి సత్రాంతమగుటయు, జనకుఁ డిదివఱకే దశర థాదుల భార్యాసహితుల రప్పించుట, కర్మధర్మములను గుఱిం చిన జనకుని మనోహరసంభాషణము, శివధనుర్భంగమును గావించిన రామునికి సీత నిచ్చితి ననియు దాని నేకగ్రీవముగా నంద అంగీకరించినది లేనిది తెల్పుఁ డనుటయు, సర్వప్రజలు నేకగ్రీవామోదమును దెలుపుటయు, వసిష్ఠ విశ్వామిత్ర శతా నంద మహర్షులు సీతారామకల్యాణమునకు దమయానంద మును వెల్లడించుటయు, ఇంతలోఁ గ్రుద్ధుఁ డగుపరశురాముఁ

జే తెంచుట, రామాదులు దశరథ జనకాదులు నాతనికి నమస్కరింప నాతఁడు శాంతించి శిష్టరక్షణార్థము దుష్టశిక్షణార్థము తనధనువు రామున కిచ్చి యాశీర్వదించి తాను తపోజీవనమున బ్రహ్మస్వరూపుఁడగుట, దేవతలు పుష్పవృష్టితో వధూవరులగు సీతారాములను, ఊర్మిళాలక్ష్మణులను, మాండవీభరతులను, శ్రుతకీర్తిశత్రుఘ్నులను ఆశీర్వదించుట, రాజసింహుఁడగు రాజు పాలింప వర్ణాశ్రమ ధర్మరక్షణము, సర్వశుభములు కలుగుఁగాక యను భరతవాక్యము గలవు.

యజ్ఞఫలము భాసనాటకమే.

ఈ నాటకము భాసునిదే యనుటకు శ్రీ పుసల్కరు మున్నగువారు తెలిపిన హేతువాదము పేర్కొందును. ఈ కథావస్తువు భాసుని యితరనాటకములతోడి సాజాత్యము గని యున్నది. ఇందలి నాందీ శ్లోకము :

"శ్లో. రామః కృపాయా భరతో మనోజ్ఞః
మాయా త్వచాప శ్శుభలక్ష్మణశ్చ
శత్రుఘ్న వీరో మునిమన్యు రక్షీ
సదా రసోత్సాహవపుః ప్రసన్నః."

ఇది యితర భాసనాటకములందలి నాందీ శ్లోకముల వలెనే ముద్రాలంకార సంయుతము. ఇందు ముఖ్యనాటక పాత్రములు చక్కఁగా సూచింపఁబడుటే కాక రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు ప్రసన్నులై మిమ్ము రక్షింతురుగాక యనియు, కృపా భరతుఁడు శుభ లక్ష్మణుఁడు, శత్రుఘ్న

వీరుఁడు నగు రాముఁడు మిమ్ము రక్షించుఁగాక యనియుఁ జక్కని శ్లేషార్థము లిందుఁ బొందుపఱుపఁబడినవి. ఇట్టి పాత్రల నన్నిటిని సూచించు పంచరాత్ర నాందితో నిది సాజాత్యము నందియున్నది.

"శ్లో. ద్రోణఃపృథివ్యర్జున భీమదూతో
యః కర్ణ ధారః శకునీశ్వరస్య
దుర్యోధనో భీష్మ యుధిష్ఠిరస్స
పాయా ద్విరా డుత్తరగోభిమన్యుః."

యజ్ఞఫలమునందలిస్థాపన భాసుని యితర నాటకములందలి స్థాపనలవలెనే సంక్షేపముగా నున్నది. అంతేకాక భాసునికిఁ బ్రియతమ మగు ప్రయోగాతిశయపద్ధతియే యీ ప్రస్తావనమునఁ గాననగుచున్నది.

ఇంతేకాక, 'నిష్క్రమ్య ప్రవిశ్య' మున్నగు శీఘ్రనిష్క్రమణ శీఘ్రప్రవేశములను సూచించుపదములు భాసనాటకము లన్నిటఁ గలయట్లే యిందును గలవు. '(కర్ణే) ఏవమివ' మున్నగు మాటలు స్వప్నవాసవదత్తమునను యజ్ఞఫలమునను గలవు. ప్రతిజ్ఞాయౌగంధరాయణ చారుదత్తములలో ఈరీతి ప్రయోగము లధికముగాఁ గలవు. 'ఏవ మవిజ్ఞాతాని దైవ తాన్యభిభూయంతే' అని యజ్ఞఫలమునఁ గలదు. స్వప్నవాసవదత్తమునను నిట్లే కలదు. 'రాజ్యము భారవహా' మని అవిమారకమునను 'రాజు 'స్వకృతాభారవాహీ' అని ప్రతిమానాటకమునను గలదు. ఈభావమే యజ్ఞఫలమునను గలదు.

ఇవి కాక ద్వీపకేసరులతోడి యుపమానములు, వైదికధర్మ గౌరవము, వయశ్శౌర్యములకు సంబంధములేదన్న భావము, భాసుని యితరనాటకములలో నున్నట్లే యజ్ఞఫలముననుగలవు.

యజ్ఞఫలమునఁ బేర్కొనఁబడిన ఆశ్రమ వర్ణనము, సాయంకాల వర్ణనము, గ్రామజీవన వర్ణనము మున్నగునవెల్ల భాసుని స్వప్నవాసవదత్తమునను పంచరాత్రమునను అవిమారక బాలచరితములలోను ఆయాయీ వర్ణనములతోడి మిక్కిలి సాదృశ్యమును గలిగి యున్నవి. యజ్ఞఫలమునఁ గల రాముని మదనావస్థ సరిగా నట్లే అవిమారకమున ద్వితీయాంకమునందుఁ గాననగుచున్నది.

మఱియు, భాసుఁడు తఱచు శ్లోకము రెండుపాదము లొకరిచేతను మిగిలిన రెండుపాదము లింకొకరిచేతను జెప్పించును. ఈ విషయమునకు యజ్ఞఫలమునఁ బెక్కు లుదాహరణములు కలవు. (ii. 29; iii 21, 23, 24, iv. 29) పతీహారి పేరు విజయ యనియే భాసనాటకము లన్నిటఁ గలదు. ఇట్లే యజ్ఞఫలమునను గలదు. సాధారణముగా భాసుఁడు విష్కంభమును ఇరువురు, ముగ్గురు, నలువురు వ్యక్తులతో నడపును. ఇట్లే యజ్ఞఫలమున ఇరువురు గంధర్వులు, ముగ్గురు భటులు, నలువురు కావలివారు ఆయావిష్కంభములలోఁ బాల్గొందురు. బాణుఁడు భాసుని గుఱించి చెప్పిన:

"సూత్రధార కృతారంభైః, నాటకై ర్బహు భూమికైః
సపతాకై ర్యశో లేభే, భాసో దేవకులైరివ."

అనుభావమునకుఁ దగినట్లు యజ్ఞఫలమున నెన్నియో నిదర్శనములు గలవు. యజ్ఞఫలము సూత్రధారకృతారంభము కలదే. ఇందు బహుపాత్రములే కలవు. ఆపాత్రములు వేఱువేఱు జీవితదృక్పథములకే చెందినవి. ఇందు బహు పతాకాస్థానములు నున్నవి. దశరథ మహారాజు రాణులతో జరిపిన సమావేశము, రావణుఁడు రామాస్త్రములను దిరోహితుఁడై నడుమనే ఖండించుట, విశ్వామిత్రుని యజ్ఞము మున్నగున వీందుల కుదాహరణములు.

ఇది కాక, "భాసో హాసః" అన్న జయదేవమహాకవి వాక్యము యజ్ఞఫలమున విదూషకముఖమునను కావలివారల సంభాషణ మూలమునను సత్య మని ధ్రువపడుచున్నది. 'యజ్ఞఫల' మతిపురాతన నాటక మని యం దుదాహరింపఁబడిన ప్రాచీన శాస్త్రగ్రంథములను బట్టియు, నందు నాణెములకు సువర్ణములనునామ ముండియుండుటఁబట్టియు మనకుఁ దేటతెల్ల మగుచున్నది.

మఱియు, 'యజ్ఞఫల'మునఁ గల సలలితమైనభాషయు, స్వచ్ఛములైన యుపమానములును, సరళమైన పదములును నిది భాసకృతమే యనుటకు సాక్ష్యములు. భాసుఁ డన్నఁ బరమ గౌరవము కలకాళిదాసు భాసుని భావముల నెన్నిటినో కైకొన్నటులు దృష్టాంతము లున్నవి. అట్లే యజ్ఞఫలము

నుండియుఁ బెక్కులు చూపవచ్చును. వీనిని ద్రిప్పి కొందఱు విమర్శకులు కాళిదాసు ననుసరించిన యొకకవి యెవఁడో యీ నాటకము వ్రాసియుండవచ్చు ననుచున్నారు. పై తండి కుఁడు హేతువాదమున కొప్పుకొనఁ డని యజ్ఞఫలమున భాసుఁడు చెప్పినమాట అసత్యము కాదు కదా!

భాసనాటకములనుబట్టి భాసుని ప్రధాన గుణము లని యేవి నిర్ణయింపఁబడినవో అవి యజ్ఞఫలమునఁ గలవని పై విమర్శకు లిట్లు ధ్రువపఱిచిరి. అందుచే యజ్ఞఫలమునకుఁ గ్రొత్త ప్రాఁతప్రతులు లేమైన లభించి యందు నాటకకర్త నామాదికము స్పష్టముగా గోచరించి యీ యజ్ఞఫల మన్యకర్తృక మని నిరూపించువఱకు నిది భాసకృతముగనే యెన్న నగును.

### యజ్ఞఫలమున భాసుని ప్రతిభాదికము

భాసుని యితర నాటకములందువలెనే యజ్ఞ ఫలమునను ఆతని ప్రతిభా విశేషములు లెక్కకు మిక్కిలిగా గానన గుచున్నవి. ఇందు ముఖ్యముగా భాసుని పాత్రపోషణావైశిష్ట్యము నిరుపమాన మైనది. ఆతని పద్యప్రియత్వమున కీ నాటకమును నిదర్శనమే యగును. అలంకార సంపద, సుభాషితావళి, ఆయాపాత్రల సంభాషణాచాతుర్యము, హాస్యరసపోషణము, శృంగారరస విశిష్ట పరిపోషణము, కరుణారసపోషణము, శాంత రసపుష్టి, వీర భయానక బీభత్సరసముల కొసఁగిన స్థానము,

అద్భుతరస నిర్వహణము- ముఖ్యములగు నీపట్టులలో భాసుని నిరుపమప్రతిభావిశేషములు చక్కఁగాఁ బొడకట్టుచున్నవి.

### పాత్రపోషణ వైశిష్ట్యము

దశరథ శ్రీరామ పరశురామ వసిష్ఠ విశ్వామిత్రాది ప్రధాన పాత్రల పోషణము నెంత యద్భుతముగా భాసుఁ డిందుఁ జూపినాఁడో అంత యద్భుతముగానే సామాన్యపాత్ర లగు సుమంత్రుఁడు మంథర మున్నగు పాత్రములవిషయమునను జూపినాఁడు. సుమంత్రుఁడు మహారాజు హృదయము నెఱింగి యాతఁ డాజ్ఞాపించుటకుఁ బూర్వమే సర్వజనములను సర్వ సత్కారపరంపరలచే సంతోషపెట్టిన సన్మంత్రిసత్తముఁడు.

ఈతఁడు వ్యర్థప్రసంగములలోఁ గాని అతిప్రసంగమునఁ గాని పాల్గొననొల్లని యథోచిత కార్యప్రవర్తకుఁడు. "వైతండికుఁడు హేతువాదమున కొప్పుకొనఁడు. ఈతనితో మనకుఁ బని యేమి" యని యొక్కమాటలో విదూషకుని వదలించుకొని పోయి నిజకార్య తత్పరుఁ డయిన యాదర్శమంత్రి యితఁడు.

దశరథుని పాత్రపోషణ మెంత శ్లాఘాపాత్రముగా భాసుఁ డిందు నిర్వహించినాఁడో చూతుఁడు. దశరథుఁడు:

"సవనశతం బొనర్చు నొకచాయను; జూచుకొనున్ స్వకార్యముల్
వివిధము లొక్కవంక; వరివీరుల నుక్కడఁగించు నొక్కటన్;
మివులగఁ దన్ను నొక్కెడల మిత్రుల; నొక్కట వేఁట కేఁగు ని
ట్లవిరళకార్యభారమున నందఁడు, సుఖ మొకింతయేనియున్."

దశరథుఁడు రాజ్యము చేయుచుండఁగా :

"కాలవర్షంబు గురియు మేఘుంబు లెపుడు
ఈతిబాధలు లేక సస్యేందిర కృషి
ఫల మనంత మొసంగెడు ; నలఘుపుణ్య
కలితదై వానుకూల్యంబు కలుగుకతన."

సర్వలోకములకు సర్వకాలములకు నాదర్శప్రాయ మైన రాజ్యమునకుఁ బ్రాతిపదిక వేసినమహారాజు దశరథుఁడు. ఈతని రాజ్యపాలనమే యిట్లున్నదన్న నిఁక రామరాజ్య మెట్లుండునో యూహించుకొనుఁ డని చమత్కారముగా భాసుఁడు సూచించినాఁడు.

సందర్భానుసారముగా నిట్లు పాత్రముల శీలచిత్రణము చేయుటలో భాసుఁ డందె వేసినచేయి.

రామపట్టాభిషేకవిఘ్నకారిణి యని జగముచే నేఁటికిని నిందింపఁబడుచునే యున్నకైకేయిశీలము పరమనిర్దుష్టముగా నితఁడు చిత్రించినాఁడు. ఆమెస్వభావము నెంతచక్కఁగా దశరథునినోటఁ గవి చెప్పుచున్నాఁడో కనుఁడు :

"ఏకరణివచ్చుచుండునో, యీకాంతకు ముక్కనంటె యొసఁగును రుష యుం తేకాని విక్రమాన్విత, నాకష్టము బాపి యొసురు నాకుం గాచెన్."

"ఈమెరోషము పరిగణియింపరాని
దగును శౌర్యప్రణయశీల యగుటచేత
తలఁప ఛందోనుబద్ధవృత్తంబురీతి
శీఘ్రమునసే ప్రసాదసంసిద్ధి గూర్చు."

మహానుభావురా లగు కైకేయి దాయభాగ విభాగ ప్రసంగసమయమున రాజుతో సవతులయెదుట నెంత పవిత్రముగ మాటాడుచున్నదో చూడుఁడు :

"అగుణవంతునికంటె మేలగును సుగుణి
గుణుల గుణవత్తరుఁడు మేలు కోటిగెట్లు
భాస్వరం బయి వెలుఁగుదీపంబు రాత్రి
గాని యది యెంత మధ్యాహ్నభానుముందు."
"భరతుఁడు గుణి యగు గుణవ
త్తరుఁడగు రాముండు కానఁ దగు నతఁడే రా
జ్యరమం గైకొన సుగుణా
భరణుం డతఁ డతనికన్నఁ బరముఁడు కలఁడే ?"

ఇట్లే ప్రతిపాత్రమువిషయమునను గడుబాగ రూకతలోఁ దూచినట్లు మాటలు వేయుచు ముక్తసరిగ వలసినవిషయము లన్నియు వచ్చునట్లు శీలచిత్రణమును జేసిన శిల్పిరత్నము భాసమహాకవి.

ఇట్లే భాసుఁ డిందుఁ బోషించిన పరశురాముని శీలము నిరుపమానమైనది. భవభూతియంతటిమహాకవికూడ నవతారపురుషుఁ డగు పరశురాముని దశరథ జనకరాజర్షులు రామాదులు నోటికి వచ్చినమాట లని యుద్ధమునకు సిద్ధపడినట్లు మహావీరచరిత్రమునఁ గల్పించినాఁడు. అసలీ రామద్వయ సమాగమ ప్రధానోద్దేశ మేమన భృగురాముఁ డవతారమును జాలించుచుఁ దన తేజమును రామతేజములో నైక్యమొనరించి తన ధను వాతని కొసఁగి దుష్టశిక్షణ శిష్టరక్షణ

కార్యకలాప మాతనిపై విడుచుటయు, [illegible] మును చక్కఁగా గ్రహించి ఆ సమాగమసమయమును సన్ని పాత్రముల శీలముల నత్యద్భుతముగా నిర్వహించిన వాఁడొక్క-భాసుఁడే. అదియు నీ యజ్ఞఫలమునసే. క్రుద్ధుఁడై వచ్చిన పరశురాముని దశరథ జనకాదులు రామలక్ష్మణాదులు వసిష్ఠ విశ్వామిత్ర శతానందులు నమస్కారసహితశిరస్సులచే శాంతపఱిచిరి. ఆమహాత్ముఁడు కోదండము నొసంగి :

“పాపులబరిమార్చుటకై, చేపట్టుము నీవు దీని; క్షితి ధర్మాత్ముల్
ప్రాపించి శరణుచొచ్చిన, నేపగిదిని వారిఁగాచియుంగుము రామా!”

అని శాసించి తాను శాంతుఁడై నిష్క్రమించును. ఇంతకు నాతఁడు చేసిన పనులెల్ల ధర్మరక్షణార్థము, ఖల శిక్షణార్థము నని భాసుఁడు పరశురాముని నోటనే పలికించి యాతని శీల మత్యున్నతముగఁ బోషించినాఁడు.

### అలంకార సంపద : సుభాషితములు

స్పష్టమై స్వచ్ఛమై త్రికాలాబాధ్యములై తీరుదీయములు గలిగిన భాసుని యలంకారములు సుభాషితములు, నీ నాటకమున లెక్కకు మిక్కిలిగా నున్నవి.

“సరసులోని యగాధంబు జలములోన, నెసఁగు నుత్తమమాన సౌకసములట్లు
సకలరసపూర్ణ కవిచిత్త సద్మమందుఁ, బరగు నుజ్జ్వలనూత్న భావంబు లనఁగ”
“మనసెకాద కృత్యాకృత్య మతి వివేకమునకు నుత్తమప్రామాణ్య మనధరిత్రి”
“కేసరిని నుంగు తరుఁ బెల్లగింప గనెనె?”
“కాలవశమునఁ బుణ్యంబు క్షయమునొంద సారహీనములౌ నెట్టిసంపదలును.”

ఇట్లెన్నియైనఁ జూపవచ్చును.

## నవరసపోషణము — శృంగారము

ఈ నాటకమున నవరసపోషణము [illegible] జక్కఁగా నిర్వహింపఁబడినను, ఇందు ప్రధానరసము శృంగారము. ఇది మిథిలోద్యానమున సీతారాముల పరస్పర వీక్షణములతో నారంభమై రామానురక్తయై మూర్ఛిల్లిన సీతను రాముఁడు సమీపించుటతో వృద్ధియై సీతాకల్యాణమున శుభపర్యవసానము నందినది. ఇందలి శృంగారము పరమ పవిత్రమైనది. నాయకుఁడగు రాముని ప్రణయము అస్థానమునఁగాక స్వస్థానమున నగుట యొక్క విశేషము. మఱి యిది పేలవములగు కచకుచాది వర్ణనములవంటిఁ గాక కేవలము స్త్రీసౌందర్యద్యోతకములగు ముఖకాంతిసౌందర్యములకే సంబంధించినది.

"స్వచ్ఛసుందరశరదిందువదన"
"ఆజగన్మోహనాంగి" "కుసుమ పేశలసుగాత్రి"
"సుందరీరత్నవదనారవిందముగని, మన్మథము నాట్యమొనరించుమహితభంగి"

మున్నగు మనోహరభావములతోడనే కాని నీచశృంగారమునకుఁ గాని గతానుగతిక మగు నవయవవర్ణనములకుఁ గాని పోక భాసుఁ డిందలి సీతారామ శృంగారమును బవిత్రతర మొనరించినాఁడు.

## హాస్యరసపోషణము

భాసుని హాస్యరసపోషణమునకుఁ దొలుతటి యంకమునందలి విదూషక కాంచుకీయ సంభాషణము చక్కని యుదా

హారణము. ఇదికాక, నాల్గవ యంకమునకుఁ బూర్వమునఁ గల ప్రవేశికలో జనకరాజ ప్రాసాదమున మాళవకుఁడు, భషకుఁడు, దంతిలుఁడు, గోపిలుఁడు అను నలుగురు వైతాళికులు జరిపిన సంభాషణము, విదూషకుఁడు వచ్చిన పిమ్మట ఆతఁడు విశ్వామిత్రుఁడు ఉభయతోముఖుఁడని వికృతముగా వర్ణించిన వర్ణనములు మున్నగునవి అబాధకములైన భాసుని హాస్యసంభాషణములకు సాక్ష్యములు.

## కరుణరసము

విశ్వామిత్రుని వెంటనరుగు రామలక్ష్మణులు గ్రామసీమలఁ గనుచు వృద్ధగోపికతోఁ జేసిన సంభాషణము, తమ కపకారము చేయుచున్న మృగములనైనను జంపవల దనియు నవి యొక్కనాఁడు కానరానిచో విచారించెద మని యామె చెప్పిన పట్టులను గరుణరసము లలితముగాఁ జూపఁబడినది.

## వీరభయానకబీభత్సరసములు

రాముఁడు తాను విడచిన రెండుబాణములు వ్యర్థములైనపుడు వీరగర్జన మొనరించి భయంకరముగాఁ బలికినపుడు వీరభయానక రసములు, పిప్పలవృక్షము నాకులు చిల్లులుపడి యుండుట, రథము గుఱ్ఱములు కానరాకుండ వాని యానవాళ్లు గనిపించుటచేఁ గలఁగి పాఱిపోయిన చెలికత్తెల స్థితి గనుఁగొన్నపుడు బీభత్సరసము పోషింపఁబడినవి.

## శాంతరసపోషణము

జనకరాజర్షి శీలపోషణముపట్ల శాంతరసము చక్కఁగా నిరూపిత మగుచున్నది. "దేశాంతరమో జన్మాంతరమో, ప్రస్థానము జీవికి స్వకృత్యము ననుసరించి పోవక తప్పదు. వెళ్ళినపిదప నెవరు బంధుజనులకు బాధ కలిగింపరో మఱి తాము దుర్గతి నందరో వారే ధన్యులు." మున్నగు జనకుని వాక్యములు శాంతరస ప్రతిపాదకములు.

"ఒక్కటయ్యును నాత్మ తానక్కజముగ
వివిధరీతుల మనలోన వెలయుచుండు."

అన్న జనకుని విజ్ఞాన విశేషమున శాంతరసము సారము గన్నది.

## అద్భుతరసము

భరతలక్ష్మణశత్రుఘ్నుల ధనుర్విద్యా ప్రదర్శనమునను, శ్రీరాముఁడు శివధనుర్భంగ మొనరించిన పట్టునను, శ్రీరామలక్ష్మణులు రాక్షసులను బెక్కువిధములఁ బాఱఁద్రోలి మారీచసుబాహుల నుక్కణఁచు పట్టునను అద్భుతరసము పోషింపఁబడినది. అదికాక :

"నలువయును విష్ణువున్ శివుఁడు నారదతుంబురులింద్రుఁడున్; సుతూ
నాలులయి కల్పవృక్షకుసుమావళిఁ జల్లుచు..."

అను పట్టునను అద్భుతరస పోషణము గలదు.

## ఉపసంహారము

ఈ విధముగా 'యజ్ఞఫల' మను సుందర భాసనాటకము నవరస సంపదలకు మనోహరాలంకార సుభాషితములకు భాసుని ప్రతిభా విశేషములకు నాలవాలమైన దనుటలో నత్యుక్తి లేదు. కాలగర్భమున లీనమైయున్న ఆమహాకవీశ్వరుని యితరనాటకములు నితరగ్రంథములు బయలువడి సంస్కృత వాఙ్మయాకాశమున ధ్రువతారలై ప్రకాశించు సుముహూర్తము త్వరలో విచ్చేయుఁగాక !

కాకినాడ : మాస్టర్‌మన్ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

గ్రంథకర్త
## ఇతర కృతులు:

### ౧. పద్యకావ్యములు:

1. అష్టావక్ర చరిత్రము రు 1-8-0
2. అరుంధతీ వసిష్ఠము రు 1-0-0
3. అహల్యా గౌతమము రు 2-0-0
4. అష్టావక్రసంహిత రు 1-0-0
5. ఆత్మోపదేశము రు 0-8-0
6. వైరాగ్యగీతాలు రు 0-8-0
7. భక్తిగీతాలు రు 0-8-0

### ౨. గద్యకావ్యములు:

1. శ్రీమహర్షి జీవిత కథామృతము
   ఐదు భాగములు రు 10-0-0
2. రత్నత్రయము రు 1-0-0
3. శ్రీశారదామణీదేవి జీవితము రు 0-8-0

### ౩. నాటకములు:

1. అభిషేకము రు 2-0-0
2. కుందమాల రు 2-8-0
3. వేణీసంహారము రు 3-0-0
4. యజ్ఞఫలము రు 2-0-0

ప్రతులకు: B. V. & SONS.
Ramaraopeta, Kakinada.